# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 9 ప్రధాన సంపాదకుడు : టి. రామచంద్రరావు కార్తిక - మార్గశిర 1886 శకం
సంచిక : 1 సంపాదకుడు : కప్పగంతుల లక్ష్మణశాస్త్రి నవంబరు, 1964

## విషయ సూచిక



---

ముఖచిత్రం : ప్రదీపజ్వాలాభిఃదివసకర నీరాజనవిధిః
— శ్రీ శంకరాచార్యులు

ఓదేవీ ! నేను నీకు సమర్పించే యీ పూజ దీపాలతో సూర్యునికి హారతి యిచ్చినట్టుంది.

రెండవ అట్ట : ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్
— కాళిదాసు

ఒక దీపంనుండి మరో దీపం వెలిగించినట్లు.

మూడవ అట్ట : సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
— కాళిదాసు

రాత్రివేళ నడుస్తున్న దీపంవలె

నాలుగవ అట్ట: ఇదమంధంతమః కృత్స్నం జాయేత భువనత్రయం
యది శబ్దాహ్వయంజ్యోతిః ఆసంసారం నదీప్యతే
— దండి

సంసార మున్నంత కాలం శబ్దజ్యోతి వెలుగకున్నచో ఈ లోకత్రయ మంతా అంధకార బంధుర మైపోతుంది.

---

# ముఖ్యమంత్రి లేఖ



ప్రియమైన చదువరీ,

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ 8 వ వార్షికోత్సవ శుభసందర్భంగా, ప్రజానీకానికి ఈ లేఖద్వారా నా అభినందనలు, శుభాకాంక్షలు తెలియజేయ డానికి చాలా ఆనందిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం గడచిన మొదటి 8 సంవత్సరాలలో సర్వతోముఖమైన అభివృద్ధి జరిగింది. ఈ కాలంలో చారిత్రక ప్రాముఖ్యత గల సంఘటనలు, ప్రయత్నాలు అనేకం జరిగాయి. నిరంతరంగా సాగిన ప్రణాళికా బద్ధమైన కృషి ఫలితంగా స్తబ్ధత తొలగిపోయి రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ వేగాన్ని పుంజుకున్నది. దీనికి పటిష్ఠమైన పునాది వేయడం జరిగింది. ఇది రాష్ట్రాన్ని నానాటికి దృఢతరం చేస్తుంది. రాజకీయ సుస్థిరత, ఆర్థిక ప్రగతి, సాంఘిక సంక్షేమంతో కూడిన శకం సుస్థిరంగా వుంటుంది.

1956వ సంవత్సరంలో మనం కొత్త రాష్ట్రాన్ని ఏర్పరచుకున్నప్పుడు మనలో ఆశలతో పాటుగా భయ సంశయాలు కూడా ఏర్పడ్డాయి. అయితే రాష్ట్ర అభివృద్ధి, ఏకీకరణ కృషి సాఫీగా సాగిపోయింది. నేడుమనం ఇతోధికమైన అభ్యున్నతిని పొందడానికై ముందుకు సాగిపోతున్నాము. శైశవ దశలో వున్న ఆంధ్రప్రదేశ్‌కు దాని ఇబ్బందులు దానికి వున్నాయి. అయితే మొత్తంమీద ఇతర రాష్ట్రాలతో పోల్చినట్లయితే ఇది శైశవదశను సుఖప్రదంగా గడిపిం దనవచ్చు. శాంతి భద్రతల విషయంలో మన రాష్ట్ర పరిస్థితి సంతృప్తికరంగా వుంది. మన ప్రజలు సంప్రదాయకంగా చట్టాలకు బద్ధులై ప్రవర్తించే వారనీ పరస్పరం సహాయపడే వారనీ, శాంతియుత జీవనంలో విశ్వాసంవున్న వారనీ చెప్పడానికి నాకు సంతోషంగా వుంది.

దేశాభ్యుదయానికై ప్రజలు శాంతియుత జీవనం గడపడం అవసరం. ఇటువంటి శాంతియుతమైన వాతావరణం మన రాష్ట్రంలో నెలకొని వుంది. ఎనిమిది సంవత్సరాల ప్రాయంగల ఈ రాష్ట్రం చాలా ఆరోగ్యకరమైన, శక్తి వంతమైన స్థితిలో వున్నట్లు ఇది సూచిస్తున్నది. ఎక్కడన్నా వరదల తాకిడి తగిలి వుండవచ్చు. మరెక్కడైనా దేనికన్నా కొరత ఏర్పడవచ్చు. అయితే మనం వాటికి భయపడడంలేదు. పైగా వాటిని ధైర్యంగా దృఢవిశ్వాసంతో ఎదుర్కొని అవరోధాలన్నింటినీ అధిగమిస్తున్నాము.

గత ఎనిమిది సంవత్సరాలలో మనరాష్ట్ర ఆదాయం రు857.61 కోట్లనుంచి రు 1323.30 కోట్లకు పెరిగింది. తలసరి సగటు ఆదాయం కూడా రు 255.85 నుంచి రు 354.31లకు, రాష్ట్రబడ్జెటు రు 61.08 కోట్లనుంచి రు 136.00 కోట్లకు, ప్రణాళికా పెట్టుబడి రు 180.59 కోట్లనుంచి రు 312.66 కోట్లకు పెరిగింది. గతమూడు ప్రణాళికల అమలు అనుభవంవల్ల వచ్చే పంచవర్ష ప్రణాళికను మరింత పెద్దఎత్తులో ఎక్కువ మొత్తంతో రూపొందించుకోడానికి వీలు కలిగింది. మన నాల్గవ ప్రణాళిక పెట్టుబడి రు 700 కోట్లకు ఉంటుందని, అది మన పురోభివృద్ధికి క్రొత్త ప్రమాణాలను సృష్టిస్తుందని చెప్పడానికి నేను సంతోషిస్తున్నాను. మన నినాదం ఎల్లప్పుడూ "ఉన్నత లక్ష్యం, ఉదాత్తకృషి" అనే ఉండాలి,

ఆంధ్రప్రదేశ్ పంచాయతీరాజ్‌ను ప్రవేశపెట్టి, చరిత్రను సృష్టించింది. భారత దేశంలో తాత్కాలిక పంచాయతీ సమితులను నెలకొల్పిన ప్రప్రథమ రాష్ట్రం మనది. 1959 నవంబరు 1వ తేదీన చట్టబద్ధమైన పంచాయతీ సమితులను ఆ తర్వాత ఒకనెలకు జిల్లా పరిషత్తులను 20 జిల్లా లన్నింటిలో ఏర్పాటు చేయడం జరిగింది. యీ సంస్థలలోని ప్రతినిధులు వారి హక్కుల సాధనంలోఅత్యంత ఆసక్తిని కనబర్చడమే గాక వారిపై ఉన్న బాధ్యతలను నిర్వర్తించడంలో చూపిన అమోఘమైన అర్హతనుబట్టి పంచాయతీరాజ్ పురోగమనాన్ని పరీక్షించవచ్చు. వికేంద్రీకరణవల్ల సమర్థత పెంపొందడం, స్థానిక అవసరాలను తీర్చడానికి దారి తీసింది. ఇటీవల జరిగిన పంచాయతీ ఎన్నికలలో 71.77 గ్రామ పంచాయతీలలో ప్రతినిధులను ఏకగ్రీవంగా ఎన్నుకోవడం, ఐక్యతలో గల ప్రాముఖ్యాన్ని ప్రజలు గుర్తించారనడానికి తార్కాణం.

ఆంధ్రప్రదేశ్, పారిశ్రామికంగా వెనుకబడిన రాష్ట్రం. మొదటి రెండు ప్రణాళికలలోనూ వ్యవసాయ కార్యక్రమాలపైననే దృష్టిని కేంద్రీకరించారు. దక్షిణాది ధాన్యాగారంగా పేరొందిన రాష్ట్రాన్ని, సమృద్ధిగా లభించే బొగ్గు, నీరు, వనరులను పూర్తిగావినియోగించుకుని మూడవ ప్రణాళిక ప్రారంభంతో పారిశ్రామిక రాష్ట్రంగా రూపొందించుకోవాలని కృషి చేస్తున్నాము.

పారిశ్రామికరంగంలో భారీవిద్యుత్పరికరాల ఫ్యాక్టరీతోపాటు సింథటిక్ ఔషధాల ఫ్యాక్టరీ, రక్షణ ఎలక్ట్రానిక్ ఫ్యాక్టరీలను హైదరాబాదులో నెలకొల్పుతున్నారు. హైదరాబాదు రసాయనాలు, ఎరువుల కంపెనీతోపాటు కొత్తగూడెం, విశాఖపట్నంలలో రెండు ఎరువుల ఫ్యాక్టరీలను నెలకొల్పనున్నారు, యీ విధంగా ఆంధ్రప్రదేశ్ నేటి వర్తమాన పరిస్థితులను ఎదుర్కొంటూ భవిష్యత్తులోకి ముందడుగు వేస్తున్నది. అయితే వచ్చే కొన్ని సంవత్సరాలలో లభించే కేంద్రసహాయంపై చాలావరకు యిది ఆధారపడి ఉంటుంది. రాష్ట్రంలో అపారంగా లభించే శ్రేష్ఠమైన ముడిఇనుము, బొగ్గుసరఫరా దృష్ట్యానూ, అనువైనప్రదేశం ఉన్న దృష్ట్యానూ సమీప భవిష్యత్తులో విశాఖపట్నంలో భారీ ఉక్కుఫ్యాక్టరీని నెలకొల్పుతారని నేను ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను,

ఆదిలో నెహ్రూజీ మనరాష్ట్ర జగన్నాథరథానికి ప్రారంభోత్సవం చేశారు. నాటినుండీ అవసరమైనప్పుడల్లా సహాయపడుతూనే వచ్చారు. ఆ మహామవుడు — మనదేశ భవిష్యత్తును తీర్చిదిద్దిన మహామనీషి — లేకుండా ఆంధ్రప్రదేశ్ వార్షికోత్సవాన్ని జరుపుకోవడం మన రాష్ట్రావతరణ తరువాత యిదే తొలిసారి. ఈ నాడు నెహ్రూజీ మనమధ్య లేకపోయినప్పటికీ అంతర్జాతీయ శాంతి, ప్రణాళికా ప్రగతి, జాతీయ సమైక్యత విషయాలపై వారి మార్గదర్శికసూత్రాలు మనఎదుటే నిలిచి, నిత్యం ఉత్తేజపూరితులనుచేస్తూ వుంటాయి. దేశసౌధాన్ని నిర్మించే ప్రయత్నంలో తలఎత్తే సమస్యలను సహనంతో, ధైర్యంగా, ఎదుర్కొనే శక్తిసామర్థ్యాలు ప్రజలకున్నాయని నెహ్రూజీకి అపారమైన విశ్వాసం వుండేది. అందువల్ల నెహ్రూజీ మనముందుంచిన ఉన్నత లక్ష్యాలను సాధించే బృహత్తరకృషికి మనమందరమూ పునరంకితులమవుదాం.

చైనా దురాక్రమణను మనమంతా నిర్భయంగా, ఏమాత్రం దిగులులేకుండా, చాలా సమర్థవంతంగా ఎదుర్కొన్నాం. చైనాదురాక్రమణ కారుమేఘాలవల్ల దానిచుట్టూ జాతీయ సమైక్యత అనే శాంతివంతమైన, స్వచ్ఛమైన ధవళదీధితులతో తెల్లటి అంచు ఏర్పడింది. భాషావివాదాలు, సరిహద్దుగొడవలు, సంకుచిత దృక్పథాలు— అన్నీ ఒక్కసారిగా మటుమాయమయ్యాయి. మనమంతా ఒక్కటే అన్న యీ భావసువాసనలు విశాల భారతావని అంతటా శీఘ్రగతిని వ్యాపించడానికి మనమంతా అన్నివిధాలా పాటుపడుదాం, జాతీయ సమైక్యత, ఐక్యతాకృషిని మునుముందుకు కదిలిద్దాం.

పండుగల వెనకగల సంఘటనల తలపులు, అవియిచ్చే సందేశాలు మన నిత్యజీవితంలోని అనుభవాలకూ, ఆలోచనలకూ అతీతమైనవి. నిత్యనూతనమైనవి. అందుకే ఎలాంటి పరిస్థితులమధ్య మనం వున్నప్పటికీ ప్రతిఏటా దసరా, దీపావళి, రంజాన్ మొదలయిన పండుగల్ని మనం చేసుకొంటూనే వున్నాం. ఈ పండుగలు మనలో ఉన్నతాశయాలనూ, భావాలనూ కలిగించి మానసిక శాంతిని ప్రసాదిస్తాయి.

మాతృభూమికి మరింతగా సేవలుచేద్దామన్న దృఢసంకల్పంతో, కొత్తఉత్సాహంతో, ఉత్తేజంతో నవ్యనవ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ శుభగడియల్లోకి అడుగుపెడదాం. మనం గతంలోకన్న సుందరంగా వర్తమానాన్ని తీర్చిదిద్దుకుంటున్నాం, వర్తమానంకన్న భవిష్యత్తును మరింత రమణీయంగా నిర్మించుకుందాం. బహుళ సంఖ్యాకులకు అధికసంఖ్యలో సుఖశాంతులను అందజేసేందుకు తీవ్రంగా కృషిచేద్దాం.

ఆంధ్రులకు దీపావళిపండగ ఎప్పుడూ రాష్ట్రావతరణను జ్ఞప్తికి తెస్తూవుంటుంది. ఆరోజున ఆంధ్రులకళ్ళల్లో దివ్య దీపావళి జ్యోత్స్నలు వెల్లివిరిశాయి. ఆనంద దీపావళి రావడంతోనే ప్రతి పట్టణంలో, పల్లెలో, కుగ్రామంలో మళ్ళీదీపావళికాంతులు ఎగిరి దేశమంతటా అలముకున్నాయి. ఈ దీపాలపండుగ మనకొక సుభ సూచన. మనలక్ష్యమార్గాన్ని వెలుగులతోనింపి కళ్ళముందు చూపించే పండుగ,

జై హింద్

# దీపావళి

---కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

ఉ॥ మానవదేహమే ప్రమిద మట్టిది; సంస్కృతి
వహ్నిలోఁ బుటం
బూనుప గట్టిపడ్డయటు లుండుటఁ జూచి
అహంత మీఱుచున్
నే నిది కంచు దంచుఁ గడు నీల్గుచు ని
క్కుచు నుంటిఁ గాని దే
వా! నిమిషంబులోఁ బగులునట్టిది పెంకని
యెంచనైతిఁగా.

ఉ॥ భూతదయానిధీ! పగిలిపోయి భువిన్ శతకోటి
ముక్కలై
పాతము గాంచులోపలఁ గృపామతిఁ గూర్పఁ
బ్రయోజనంబు నీ
చేతము మీఱ నీ దయిన స్నేహ
ము నింపి తలంపువత్తులన్
ప్రీతిని నిల్పు మీ ప్రమిద; విశ్వచిదాత్మక!
స్వప్రకాశకా!

శా॥ నీ సంకల్పపువత్తి వెల్గుటకు విజ్ఞానప్రకాశం
బులన్
భాసింపం గయిసేసి భద్రముగఁ గాపాడం
దగున్ నన్ను; నా
లో సంపద్దీప్తి వెలింగెనేనిఁ ద్రుటిలో లో నున్న
మాలిన్య ధూ
మ్యాసందోహము పోయి నిర్మలరుచిప్రాప్తిన్
బ్రకాశించెదన్.

మ॥ ఇది నీ కేల్దమిదోయిటన్ వెలిగెనేనిన్
కోటిసూర్యప్రభల్
గదియింపఁబడినట్లు నిర్మలచిదాకాశంబు
నన్ దోచి నీ
యదియై యైక్యము నొందుఁగాదె పర
మాత్మా! యిట్లు లోకంబునం
దుదయం బందినదేహముల్ ప్రమిదలై
యొప్పారు నీయంశచే.

ఉ॥ ఈవిధి దీపపంక్తి వెలయించిన పండుగు
సంబరాన దీ
పావళి నీ చిదంశ లయి యారతిపట్టెడు
జోతులట్టు లీ
జీవచిదాత్మకుల్ వెలిగి చెచ్చెర మేన్ప్రమి
దల్ దొలంగఁగా!
ఓ విభు! త్వచ్ఛరణ్యు లయి యుండుట నిక్కముగా
ధరాస్థలిన్.



సీరియల్ నవల

విశ్వనాథ సత్యనారాయణ



# మిహిరకులుడు

"యువరాజుగారూ ! మీరు నాదగ్గర శుశ్రూషచేయుటకిది చివరిదినము. ఇదినామమాత్రము. ఒకయాచారము. తమరి విద్య యిదివఱకే పూర్తియైనది. నేఁడు మంచిదినము. విద్యకు శుభావసానము కావలయునని యీనాఁడు నిర్ణయింపఁబడినది. తమరికి యౌవరాజ్యపట్టాభిషేకము జరిగి పదునెనిమిది దినము లైనది. మీరు పదునెనమండుగురు ప్రకృతులలో నొకరు. శుక్రనీతిసారము నేను దెచ్చితిని. చివరి రెండు పత్రములు నాఁడు మిగిల్చితిమి. ఆ రెండు పత్రములు నేఁడు చదివినచో విద్య పూర్తియగును. తమరు గుఱ్ఱము మీఁద బయలుదేరితిరి; నేను పాదచారినై వచ్చుచుంటిని. మీరు గుఱ్ఱము నురికించితిరి. కనుచూపుమేర దాటిపోయితిరి. నేనీ దిశాభిముఖముగా వచ్చుచుంటిని. ఈ శుభావసానమునకు మహారాజుగారు నన్నాజ్ఞాపించిరి. తమరు నాకుఁ గనిపించకుండఁబోయి జామున్నరపైన అయినది. నేను ప్రభువుతో నేమి చెప్పవలయునో యని భయపడుచుంటిని. అదృష్టవశమునఁ దిరిగి కనిపించితిరి. ఈ శుభవేళ దాటిపోరాదని పరమేశ్వరుని సంకల్పమున్నట్లు తోఁచుచున్నది. ఈ చంద్రావతీనది సర్వకాశ్మీరదేశ తరంగిణీ సంతానమువలెనే కొబ్బరిపాలవంటి జలములో నట్టనడుగు నీదుచున్న మీనముల తెలిపొలుసులు కూడ దృశ్యమానము లగుచున్న పరమస్వచ్ఛతతో లఘుతర జలముతో సూర్యకిరణ ప్రతిద్వంద్వి వళక్షకాంతి నివహములతోఁ తమ పూర్వరాజుల యశః కాంతిసితాంబర శదృశముగా మీ పూర్వ రాజులు విరచించిన యనంత పుణ్యకార్య సమున్మీలిత ధవళిమతోఁ ప్రవహించుచున్నది. మీరీ యశ్వము నధిరోహించి కొండలమీఁద బండలమీఁద నిరుకురాళ్ళ సందున నెంత ప్రయాణించితిరో మీ శరీరము కలసటలేదు. మీయొడల స్వేదబిందు లవమైనలేదు. తమరు మహాబలవంతులు, తమరికి గల క్షమాగుణము దేవతలకైన నుండదు. ఈ దీనబ్రాహ్మణునియందు దయయుంచి యొక్కింతసేపు మన్నించి యీ లవలీతరుచ్ఛాయా సమాసన్నస్ఫటిక శిలాతలమున నాసీనులగుచో నా రెండుపత్రములు చదువుదము. సర్వగ్రంథములు చివరి రెండాకులలోననే వానిరహస్యములు వెలయించును. అల్పకవులు రచించిన గ్రంథములయందు చివరియాకులు నీరసములై పాఠకుల హృదయములయందు గోచరించిన కథావసానములై యుండును. తాత్పర్యావసానములై యుండును. మహర్షుల గ్రంథములు చివరి యక్కరమువఱకుఁ జదివినగాని పతివ్రత జీవితమువలెఁ బరిపూర్ణములు కావు. ఈ రెండాకులు చదివినగాని తమ చదువు పూర్తియైనదని చెప్పుటకు వీలులేదు. అవసానము పొందని చదువు పరమార్థ మెఱుఁగనివాని జీవితమువంటిది. తక్రము మాలిన భోజనమువంటిది. వెన్నుమిగులని చెఱకువంటిది. తమరు - మరల విన్నవించుచున్నాను — కూర్చుండవలయును. లేదేని తమరశ్వముయొక్క వెన్ననే యుండుఁడు. నేను ప్రక్కనిలుచుండి వానిని వినిపింతును. మఱియుగాదేని మీరు గుఱ్ఱమును నెమ్మదిగా నడిపించుచుండుఁడు. నేను వెంట నడుచుచు వినిపింతును. కానిచో నేను పోయి ప్రభువుతో నబద్ధ మాడవలయును. ఆడినచో మిగిలిన జీవితము కడచునుగాని పరలోకము భంగింపఁబడును. నరకము తప్పదు.

మిహిరకులుఁడు: నరకలోకమునకు వెళ్ళినచో నేమి ?

గురువు : అచ్చట యమబాధలు పడవలయును.

మి. కు : ప్రొద్దున మనము వచ్చితిమి. ఇంతవఱకు నేను కనిపింపలేదు. రాళ్ళలో రప్పలలో నీవు తిరుగుచుంటివి. వెదకుచుంటివి. నేనుకనిపింతునో, కనిపించనో యని దిగులు పడుచుంటివి. ఇది యంతయు బాధయేకదా ! యమలోకములోని బాధ యింతకంటె నెక్కువదియా ?

గు : యువరాజా ! మీరు పండితులు. బహువిషయ పరిజ్ఞాతలు. తమరు తెలియనివానివలె నడిగినచో నే నేమి చెప్పఁగలను. మర్త్యలోకమునందు బాధలు కలవు. ఇచట జనులకు పాంచభౌతికము లైన శరీరము లుండును. యమలోకమున నిట్టి శరీరము లుండవు. ఈ శరీరములు కొంత బాధ ననుభవింపఁగలవు. ఆ బాధ యొక పరిధిని దాటినచో నా శరీరములు భరింపలేవు. పాంచభౌతికము లైన యీ శరీరములకు, నీ యింద్రియములకు, నీ సుఖములకు నొక పరిధి యుండును. ఒక కనుముక్కుతీరు, నొక చెక్కిళ్ళపొలుపు, నాసికయొక్క పరిమాణము, నొకఫాలప్రదేశము యొక్క పరిణాహము మొదలైన వానినే కన్ను సహింపఁగలదు. తక్కిన వానిని దయ్యపు మొగ మనుకొనును. రాక్షసి మొగ మనుకొనును. అట్టివానిని జూచి భయపడును. అట్లే సర్వేంద్రియముల శక్తియు నియమింపఁబడి యుండును. కొంత వేడిమిని మానవ శరీరము సహింపఁగలదు. అది దాటినచోఁ జర్మము మాడిపోవును. ప్రాణములు నిష్క్రమించును. పాంచభౌతిక శరీరముయొక్క బాధ శరీర పతనావధికముగా నుండును. యమలోకమునందలి జీవులయొక్క మేనులు పాంచభౌతికముకావు. వానికిఁ బతనము

లేదు. ఎంతటి బాధయైన ననుభవించు చుండును. ఇది భేదము. అందుచేత యమయాతన యనుమాట వచ్చినది.

మి. కు ; యముఁ డెట్లుండును ?

గు : భారతములో నున్నదిగదా! సత్య వంతుని ప్రాణములను గొనిపోవుటకు వచ్చినప్పుడు యమధర్మరాజు సావిత్రీ దేవికి దర్శన మిచ్చెను. తమరు చదివి నదే.

మి. కు : నేను చదివిన యమునకు నేను చూచిన యమునకు నాకు సంబంధము కుదురలేదు.

గు : మీరు యముని దర్శించితిరా ? అది యెట్లు జరుగును! యముని జూచిన తరువాత మానవుఁడు జీవించి యుండఁడు; మీరు జీవించియున్నారు గనుక మీరు చూడలేదు.

మి. కు : సావిత్రి యముని జూచినది. తరువాత బ్రతికియున్నది.

గు : చిత్తము, దాని కేమి ? తమరు దేవతా మూర్తులు కావలయును. అని నాకుఁ దెలియును. మీ పాలనలో నున్న కాశ్మీర ప్రజలకుఁ జాలమందికిఁ దెలియును. సావిత్రీదేవి మహా పతివ్రత. ఆమె యముని జూచి బ్రతికియున్నది. తమరు దేవతాస్వరూపులు. అందుచేత యముని జూచికూడ జీవించియే యున్నారు.

మి. కు : నేను దేవతామూర్తిని. తక్కిన రెండాకులు చదవకపోయినచో నేమి ?

గు : దేవతలు దేవతలుగా నున్నప్పుడు సర్వజ్ఞులు. అవతారములు పొందినప్పుడు వారి శరీరాంతర్దేశములయందు సర్వజ్ఞ మైన దేవతాలక్షణ ముండును. ఆ సర్వ జ్ఞత్వము తాము ధరించిన మానవశరీర వ్యవహారదశయందు భాసించుటకుఁ జదువుకొనవలయును. చదివిన కొలంది యా సర్వజ్ఞత్వము భాసించు చుండును. ఒక మణి, పుట్టుకచేత మణియే. కాని తరిపిణి పెట్టినప్పుడు గానిదానికిఁ బ్రకాశమురాదు. అందుకనియే శ్రీరామచంద్రుఁడు వశిష్ఠ విశ్వా మిత్రులయొద్ద, శ్రీకృష్ణదేవుఁడు సాందీ పనియొద్ద నధ్యయనము గావించిరి. సామాన్య మానవుఁడు చదివి చదివి చింతన చేసినగాని విషయములను గ్రహింపఁ జాలరు. అవతార పురుషు లకు శ్రవణమాత్రమున సర్వ విద్యలు కరతలామలకము లగును. తమరు విద్య లన్నిటినివిన్నారుగాని పఠింపలేదు. చింతన చేయలేదు.

మి. కు: నే నవతార పురుషుఁడ నైనచో నెవని యవతార మగుదును ?

గు. అది తమరికే తెలియవలయును.

మి. కు: ఈ మాత్రము తెలియనివాఁడవు నీవు నాకు గురువవేమి ? వశిష్ఠునకు శ్రీరామచంద్రుఁడు విష్ణ్వంశ సంభూతుఁ డని తెలియును. సాందీపనికి శ్రీకృష్ణుఁడు భగవంతుఁ డని తెలి యును. అతని కది కష్టములేదు. విష్ణున కున్న నామములలో కృష్ణుఁడు గూడ నొక్కటి గనుక వానికి సులభమైనది.

గు: యువరాజా! మీరు సర్వజ్ఞులు. అవ తార పురుషులు. నేను మీకు గురువుగా నుండుటకుఁ దగను.

మి. కు: నీ కిప్పటికైనను జ్ఞానోదయ మైనది.

గు: చిత్తము. కాని శ్రీరామచంద్రుఁడు వశిష్ఠుని తిరస్కరించ లేదు. శ్రీకృష్ణుఁడు సాందీపనిని నగౌరవ పరచ లేదు. గురువు వివేకి యగుగాక, యవి వేకి యగుగాక; వానిమీఁద నేకవచన ప్రయోగము చేయరాదు.

మి.కు: ఏకవచన మనగా నేమి ?

గు: యువరాజు వాక్కైనచో నేకవచ నము. గురువైన నాలోఁ గలసినచో బహువచనము.

మి. కు: అది ద్వివచనము.

గు: అది దేవభాష యైనచో.

మి. కు: మేము దేవతల మంటివిగదా!

గు: చిత్తము.

మి. కు: నా కేకవచనమే యిష్టము. అది యట్లుంచి మే మెవ్వరమో చెప్పుదుము. విందువా ?

గు: విందును. అంతకంటె నదృష్ట మే మున్నది ?

మి. కు: మేము నీతో చెప్పుదుము. నీ విం కెవరితోడనైన చెప్పినచో నేమగును ?

గు: నేను చెప్పను.

మి. కు: పోయి రహస్యముగా నీ భార్యతో జెప్పవచ్చును. ఆమె మీ కొడుకుతో జెప్పవచ్చును. మిమ్ము నమ్ముటకు వీలు లేదు.

గు: అయినచో జెప్పవద్దు.

మి. కు : కాదు చెప్పెదను. సాందీపని కృష్ణుని కృష్ణుఁడన్న పేరుచేతనే మహా విష్ణువని తెలిసికొనెను. నా పేరును బట్టియే నేనెవరనో తెలిసికొన వచ్చును. నాపేరు మిహిరకులుఁడు, మిహిరుఁ డనఁగా సూర్యుఁడు. మిహిరకులుఁ డనఁగా సూర్య కులుఁడు. పూర్వము శ్రీరాముఁడు మిహిరకులుఁడు. ఇప్పుడు నేను మిహిరకులుఁడను. రాముఁడు లంకావైరి.

గు: చిత్తము.

మి. కు. అజ్ఞులతో నేదియైన చెప్పుట మిక్కిలి కష్టము. మరియు రాజ సేవకు లతో రాజులు మాట్లాడుట మిక్కిలి విసుగుదలను పుట్టించు పని. వారు చిత్తము చిత్త మనుచుందురు. వా

రూహింపరు. ఆలోచన చేయరు, కాదన లేరు. చెప్పిన మాటలో దోషమును చూపించలేరు. మరియొక యర్థము వచ్చినచో దాని నుటంకింపరు. నేను మిహిరకులుఁడను. రామచంద్రుఁడ ననఁగా చిత్తమందురు. మిహిరకులుఁ డనఁగా సూర్యునియొక్క కులము కల వాఁడని గదా యర్థము. రాముఁడు మిహిరకులుఁడు సరే! సూర్యున కిద్దరు కుమారులు కలరు. వారిని మిహిరకులు లని యేల యనరాదు? శనైశ్చరుడు సూర్యుని కుమారుడు. యముఁడు సూర్యుని కుమారుఁడు. వారిరువురు కూడ మిహిరకులులు కావచ్చును. నేను రాముఁడను గానిచో శనైశ్చరుఁడును. కానిచో యముఁడను. ఏమందువు?

గు : యువరాజా! నే నేమనఁగలను?

మి. కు : ఏమియు ననలేవా? నేను యముని దర్శించితి నంటిని గదా! నేను రాముఁడను గాను, శనైశ్చరుఁడను గాను. నేను యముఁడను.

గు : నిస్సంశయముగాఁ గావచ్చును. ఏలయనగా పాండవజ్యేష్ఠుఁడైన యుధిష్ఠిరుఁడు యమధర్మరాజు నంశవలన జన్మించినాఁడు. యముఁడు ధర్మరాజు. ఆయన ధర్మమంతయు యుధిష్ఠిరుని యందు మూర్తి కట్టినది. తమరుకూడ ధర్మమూర్తులే.

మి.కు : ఓయీ! యమునియందు రెండు లక్షణాలు కలవు, యుధిష్ఠిరునియం దొక లక్షణము సంపూర్ణముగా వికసించినది. నేను రెండవలక్షణమును పూని జన్మించినాను.

గు : నా కర్థముకాలేదు.

మి. కు : నాకు పలుసార్లు యముఁడు స్వప్నములోఁ గనిపించెను. అతఁడే చెప్పినాఁడు. ఓయి మిహిరకులా! నేను దక్షిణదిశకు యముఁడను. నీవు ఉత్తర దిశకు యముఁడవని.

గు : యముఁడా యొక్కదిశయం దుండుటయే చాలును. అతఁడా దిశయందున్నను సర్వదిశలయందలి జీవులను సంహరింపఁగలడు. క్రొత్తగా నుత్తర దిశయందు వేరొకయముఁడు సృష్టింపఁ బడ నక్కఱలేదు.

మి. కు : ఎవనికష్టము వానికిఁ దెలియవలయును. నీ కేమి తెలియును? కొన్ని కష్టములు నిత్యమును నుండును. కొన్ని తాత్కాలికముగా నుండును. వట్టియప్పుడు తన సర్వకార్యములను తా నొకఁడు చూచికొనఁగలడు. ఒక క్లిష్టదశయందుఁ జూచికొనలేడు. అప్పుడు వానికిఁ దోడు కావలయును.

గు : నిజమే! ఇప్పుడా దక్షిణదిశాపతి తమరిని తోడుతెచ్చుకొనెను గాఁబోలు!

మి. కు : కాబోఁలుకాదు. యథార్థము. ఆయన నాకుఁ గలలోఁ గన్పడి యిది చెప్పినాఁడు. లోనిచో నా కేమి తెలియును. నా కిప్పు డిర్వదియేండ్లు వచ్చినవి. చిన్నప్పటినుండియు నా కెవ్వరినైనఁ జంపవలయుననియే యుండెడిది. చంపుటలో నా కొక యుత్సాహమున్నది. భయములేదు. నా ప్రకృతి నాకే యర్థము కాలేదు. యముఁడు కనిపించి చెప్పెడి పఱకు నాకీ రహస్యము తెలియదు. నే నిదివఱ కెంతమందినో సంహరించితిని. నీకుఁ దెలియునా?

గు : నాకుఁ దెలియదు.

మి. కు : నేను రాజుకొడుకును గాన నవి యేవియు బయటకు రాలేదు. నా చిన్నప్పుడు పలుమంది సేవకులను వధించితిని. అవి యన్నియు రాజగృహ రహస్యములు. వారి చావుల కన్యకారణములు కల్పింపఁబడినవి. నేను వేటకు వెళ్ళినప్పుడు పలుమృగములను సంహరింతును. విచిత్రచిత్రముగా సంహరింతును. అది వేటకాదు. అది యొక జాతర. నా చేతిలో ఖడ్గ ముండఁగా వంద హింస్ర మృగములు నన్ను చుట్టుముట్టియు నేమియుఁజేయలేవు. నాది వజ్రశరీరము. పులుల కోఱలు నా శరీరమున దిగవు.

గు : ఇది జగత్ప్రసిద్ధమైన వార్త. ఈ సంగతి తమరి రాజ్యమునఁ బలుమందికిఁ దెలియును.

బ. కు : యమునకును నాకును మిక్కిలి భేదము కలదు. అతఁడు సహజముగా యముఁడు. నే నసహజముగా యముఁడను. వధించు నుపాయములు నాకుఁ దెలిసినన్ని వానికిఁ దెలియవు. నే నెందుకు వధింతునో నాకే తెలియదు. ఈ గుఱ్ఱమున్నది. నమ్మకమైనగుఱ్ఱము. నాతండ్రికి ప్రియమైనగుఱ్ఱము. ఈగుఱ్ఱమును రాజైనవాఁడు తప్ప మరి యెవ్వఁడు నెక్కఁగూడదు. నేను తండ్రికిఁ దెలియకుండ దీని నధిరోహించి వచ్చితిని. దీనికి నేను యముఁడనని తెలియదు. నేను యువరాజనని దీనికిఁ దెలియదు. రేపు రాజును గాబోవుచున్నానని దీనికిఁ దెలియదు. ఇది నన్ను మొదట కొంచెమిబ్బంది పెట్టినది. ఇది నాతండ్రి కలవాటుపడినది. ఇది గుఱ్ఱముకదా! ఎవరైనా నధిరోహించినచో స్వారిచేయుట దానికి ధర్మముకదా! ఎక్కినవాఁడు స్వామి. ఇది భృత్యుఁడు. భృత్యునకుఁ దన యిష్టమువచ్చినట్లు స్వామి నెన్నుకొను నర్హతకలదా? స్వామిత్వమొకనియందు పరినిష్ఠితమై యుండునా? కాలముతో స్వామి మారును. మారునని తెలియని భృత్యుఁడు హింసింపఁబడును.

గు : అది పశువు. దానికేమి తెలియును. దానియజ్ఞానమునందలి దాని యేకస్వామిగత నిశ్చయబుద్ధియే దానిగుణము. దానిచేత నది భూషింపఁ బడుచున్నది.

మి. కు : మరిక్రొత్తస్వామి వచ్చినప్పుడు శిక్షింపఁబడుచున్నది.

గు : అలవాటున తరువాత నది క్రొత్త స్వామినిగూడ ప్రాతస్వామిని వలెనే విశ్వాసముతో సేవించును. ఈ నడిమి కాలమున స్వామి దయావంతుఁడై యుండవలయును. ఓర్పు కలిగి యుండవలయును. ప్రకృతియందలి లక్షణముల పరిజ్ఞానము స్వామియందు స్వామిత్వమును కల్పించును.

మి. కు : ఓహోహో ! ఈ గుఱ్ఱమునకును నీకును పూర్వజన్మమం దేదో సంబంధముండియుండవలయును. ఈ గుఱ్ఱమును నే నిప్పుడు వధింతును.

గు : యువరాజా ! మహారాజు గారికిఁ గోపము వచ్చును. వారికిఁ దెలియకుండ మీరు గుఱ్ఱమును దెచ్చితిరి. అదియే కోపకారణముకదా ! దీనిని వధించినచో మీయందలి దోషము పది రెట్లగును.

మి. కు : నేను దీనిని వధించితినని యాయన కెట్లు తెలియును ?

గు : గుఱ్ఱమెట్లు చనిపోయినది ?

మి. కు. కొండయంచునుంచి దొరలినది. ఈ రాతిమీఁదినుండి యా రాతిమీఁదికి దూకినపుడు కాలుజారి క్రిందఁబడినది. గుహలోనున్న సింహము హఠాత్తుగా వెలికివచ్చి గుఱ్ఱముమీఁదదూకి దాని మెడ నులిమినది. గుండెజబ్బువచ్చి హఠాత్తుగా నోట నురుగులు క్రక్కుకొనుచుఁ జచ్చెను. పరుగెత్తుచుండగా ప్రక్కనున్న యుక వంశనాళము ఖడ్గము వంటిది డొక్కలో దూరి పడిపోయి మరణించెను. ఒకజంతు వెన్నివిధములుగా మృతిపొందరాదు. నేను దీనిని వధించితినన్న సాక్ష్యమేమున్నది? నేను పూర్వమువలె వట్టి రాజుకొడుకునుగాను. నేఁడు యువరాజను. రాజ్యాంగమైన పదునెనమండుగురు ప్రధానులలో నొకఁడను. రాజెక్కెడు గుఱ్ఱమును నే నెక్కరాదా ! మాటాడవేమి !

గు : చిత్తమునకుఁగూడ భయముగా నున్నది.

మి. కు : ఇది నా చదువు తుదిదినము. నాకుఁ బలుసంశయములు కలవు. ఇదివర కెవరితోఁ జెప్పుటకును వీలులేకపోయెను. నీవు నాకు గురువవు కాన నీ సంశయ విచ్ఛేదము నీచేతఁ జేయించుకొనవలయునని వేచియుంటిని. రేపటినుండి నీవును నేనును కలియము. నాకు శుక్రనీతిసారపుఁ దుది రెండాకుల చదువవలదు. నేను యముఁడను. నాకుఁ జదువుతోఁ బని యేమి ? సర్వజంతువుల నెన్ని విధములుగా వధింపవలయునో యా సర్వ విధములు నాకుఁ దెలియును. అచట నీ గురుత్వము నాకక్కఱ లేదు. నేను కాశ్మీర దేశమునకు రాజును కావలయును. ఆ నీతి యంతయు నీవు నాకుఁ జెప్పితివి. ఇతరులున్ను చెప్పిరి. రాజ్యపాలనా సర్వ విషయములు నా కవగతములైనవి. నాకుఁ గల సందేహములు నీతోఁ జెప్పెదను. నీవు వాని కొక ముకి కల్పించి చెప్పినచో నీవు చెప్పినది నాకు సమ్మతమైనచో నీవు నాకు గురువవు. నాకుఁ బదియేండ్లు వచ్చినప్పటినుండి చిత్ర చిత్రములైన స్వప్నములు రా నారంభించెను. నాకుఁ బదునేనేండ్లు వచ్చెడివఱకు నేను వానిని గుఱించి పట్టించుకొనలేము. ఎవ్వరితో జెప్పలేము. తరువాతను జెప్పలేదు. మొదట చెప్పుటకు భయము వేసినది. తరువాతఁ జెప్పినచో నితరులకు భయము వేయునని మానివేసితిని. నా తల్లిదండ్రులకుఁ దెలియదు. నాకు స్నేహితులు లేరు. నాతోఁ జెలిమి కట్టుటకుఁ బ్రయత్నించిన పలుమంది యధికారుల పుత్రులను రహస్యముగా వధించితిని. నేను చంపితి నన్న పొలకువ కూడ లేకుండఁ జంపితిని. వారికి నిజముగాఁ జెప్పినచో నా స్వప్న వృత్తాంతములు చెప్ప వలయును. నేను చెప్పలేదు. నీకుఁ జెప్పుచున్నాను. నా కన్నియుఁ గలిపి వంద స్వప్నములు వచ్చిన వనుకొనుము. అన్నియు నొక్కటే. పరమాల్ప విషయములందు భేదము లున్నవిగాని మహావిషయముల యందు భేదములు లేవు. నాకు యముఁడు తఱచుగాఁ గనిపించుచుండును. అతఁడు కాలాంజన పర్వతమువలె నుండును. వాడిగల పొడుగైన కోఱ లుండును. వాని కన్నులు భగభగ మండిపోవుచుండును. వాఁ డెఱ్ఱని ధోవతియు నెఱ్ఱని యుత్తరీయమును ధరించియుండును. వాఁడొకనల్లని యగ్నిజ్వాలవలె నుండును. వాఁడు దగ్గఱకు వచ్చినంతనే నీ యొడలు మాడిపోవుచుండును. ఇతడు నాకు నా తొమ్మిదవయేట లీలగాఁ గనిపించెను. నాకు భయమువంటిది కలిగెను. వాడు నవ్వెను. నేను నవ్వితిని. నాకుఁ బదునెనిమిదవయేడు వచ్చువఱకు నతఁడు క్రమ క్రమముగా విస్పష్టతరముగాఁ గనిపించుచు వచ్చెను. నడుమ నడుమ మాకుఁ బ్రసంగములు జరిగెడివి. నీ వెవరవని యడుగఁగా నతఁడు కొన్నియేండ్లు సమాధానము చెప్పలేదు. తరువాత యముఁడనని చెప్పెను. తరువాత నెన్నెన్నియో చెప్పెను. నేనుత్తరదిశా యముఁడనని

తరువాత చెప్పినమాట. ఇంక నెన్నియో చెప్పెను. కొన్ని చెప్పెను. నన్నెవ్వఁ డేమియుఁ జేయలేదు. రాజ్యమంతయు నెదురుతిరిగినను నన్నేమియుఁ జేయ లేదు. నే నందరను సంహరించుటకుఁ బుట్టితిని. నన్ను సంహరించుట యెవ్వరి కిని జేతకాదు.

గు : కాశ్మీర రాజ్యము వేయేండ్లు వృద్ధి బొందుగాక. యువరాజు చిరాయులై వర్ధిల్లుగాక.

మి. కు : ఇట్లనుటకు నీ వెవ్వఁడవు? నేను డెబ్బదిఏండ్లు రాజ్యము చేయుదును. అది యట్లుంచి నాకు స్వప్నములందు మఱి యొక్కఁడు కనిపించును. వాఁడును యమునివలెనే యుండును. భేద మేమ నగా యమునకు నుదరము సన్నగా నుండును. వీనికుబ్బియుండును. యముని శిరోజములు మెత్తగా నునుపుదేరి యుండును. యముని శిరమున మణులలోఁ బొదిగిన బంగారపుఁ గిరీటముండును. వీనికిఁ గిరీటము లేదు. వీని శిరోజములు జుంజురు వెంట్రుకలు. వంద గోదుమవన్నె త్రాఁచులు విడిచిన కుబుసముల ప్రోవు వలె నుండును. యముని వదనమున తిలక ముండును. వీఁడు నిస్తిలకుఁడు. యముఁడు తనచేతిలో నొక పెద్ద పగ్గ మును బూనియుండును. వీని చేతిలోఁ బెద్దఖడ్గముండును. యముఁడు నాగర కుఁడు, వీఁడ నాగరకుఁడు. యముఁడు మాంసఖాదికాఁడు. వీఁడు మాంసఖాది. వాఁడెవఁడో చెప్పుము.

గు : యువరాజా! నా కెట్లు తెలియును?

మి. కు: శుక్రనీతి సారపు చివరి రెండాకు లను దెలియునా! ఏమి చదువోయి మీఁది! అతఁడు బేతాళుఁడు. వీరిద్దరు నాకుఁ గనిపించు చుందురు. యముని యందు రెండు ధర్మములున్నవి గదా! మొదటి ధర్మము నియమనము. యముఁడు క్రూరునివలెఁ గనిపించును గాని నిజముగా గ్రూరుఁడు కాఁడు. అతనిచేతల యందుఁ గ్రూరత్వ మున్నది గాని వాని మనస్సులోఁ గ్రూర త్వము లేదు. అతని మనస్సులో ధర్మ మున్నది. ధర్మములోఁ గ్రౌర్యమున్నచో నతని దోషములేదు. అచ్చముగా క్రూరుఁడు బేతాళుఁడు. సహజముగా యమాంశయందు జన్మించిన నన్ను బేతాళుడు తన క్రౌర్యముచేత నావేశించి నాడు. ఆ బేతాళుడు లేనిచో నేను యముని ధర్మమును నిర్వర్తింపలేను. ఈమాటలు నావికావు. బేతాళుఁడు చెప్పినవే. అది యట్లుంచి యమధర్మ రాజు మొగమునఁ దిలకమును ధరిం చును గదా: ఆ తిలకము గంధాక్షతలు. బేతాళుఁడు నిస్తిలకుఁడైనను భస్మ ధారి. వారిద్దరు శైవులు. కాని యిద్ద రును శివ విరోధులవలెఁ గనిపింతురు. శివ విరోధులవలె మాటాడుదురు. ఈ సందేహమును నీవు నాకుఁ దీర్చిపెట్టి నచో...?

గురువునకు భయము వేసినది. మిహి రకులుఁడు వాక్యావసానము చేయలేదు. తీర్చి పెట్టినచో నేమగును. తీర్చి పెట్టనిచో నేమగును? రెండు నిముసములైనది. వారు నిలుచుండిన ప్రదేశము తెల్లని రాయి వితర్ది కలుగా నేర్పడిన స్థలము. ప్రక్కన నది ప్రవహించు చున్నది. ఆ నది పైనుండి వచ్చుచున్నది. పైనుండి దూకిన నది కళపెళలుగా నుంత దవ్వు వచ్చి విశ్రాంతిపొందిన నడక కొంత దవ్వుచేసి, మఱియు నింకొక రాతినుండి పడఁబోవు వేగమును నుంత మేరనందెకొనిన లక్షణము కొంతదవ్వు వెలార్చుచు, నిందులో మలుపు తిరిగిన చోట కెరటములతో నొడ్డునఁ గొట్టుచుఁ దుంపురులు పైకెగ జిమ్ముచు స్వచ్ఛమైకూడ తీరము నందుఁ బంకిలమై ప్రవహించుచుఁ బ్రవహించుచు నిష్కారణ ముగ నొక యావర్తమును కలిగించికొని, నదీ దేవతానాభి ప్రదేశము వలెఁ జూపరులకు శృంగార రసాభిలాష కలిగించుచు, స్వచ్ఛమై జాలు వారుచు గూడఁ దీరస్థ వృక్షపత్ర కుసుమాదులను సుడిలోనికి గుంజుకొనుచు నీచ యువతివలె మోక్షదాత్రివలె దేవతా మూర్తివలెఁ గనిపించుచు, వీరున్నచోట మలుపుతిరిగి వీరు నిలచిన సిత శిలావితర్ది కల మీదికి శీకరములతో నెగబ్రాకుచున్న దానివలెఁ దీరగత తరుకిసాలయ వాయు చలన రేఖాలక్షణమును ఛాయాగతములై యనుకరించుచుఁ జిత్రముల యందలి స్థిర త్వము కూడ ఛాయల యందులో పెంపఁ జేసికొనుచుఁ నిలుచున్న గుఱ్ఱపు గిట్టల త్రొక్కిళ్ళఁబడి తత్రత్య శిలావితర్దిక తన్నా వరింప వచ్చు నీటి వెల్లువకు భీతిలి యెవ రినో రక్షింపుమని యడిగినట్టి సవ్వడి చేయుచు, నిలుచున్న గుఱ్ఱపుపీడ ప్రొద్దు క్రుంకఁ బోవుటచే దీర్ఘకృతమై గుఱ్ఱమును బట్టికొని యెవరో లాగి హింసించుచున్న ట్లుగాఁ గనిపించుచుఁ, గాంతార ప్రదేశ నివ సత్ జరఠ కృకలాస ప్రయాణవేళా హఠా ద్దృష్ట పురుషవ్యయా జానేయ పరిభీతిఁ బశ్చాత్ప్రసరత్ భీరుతా ప్రతిపాదక శిలా సంధిగతాల్ప మృత్ సంస్రవణ సంజా తాల్ప ధూళి తచ్ఛిలా సమాసస్ఫోరకముగా చిఱుగాలులకు నటనట నటచ్ఛుష్క పత్ర సంతానము తంతన్యమాన నిష్కారణ తత్ప్రదేశ భయస్ఫోరకముగాఁ గ్రాలుచు సూక్ష్మ పరిశీలనా జనిత భయహేతుకమూ.

స్థూల దృష్టికి రమణీయతా పాదకమునై యుండెను.

గురువు మాటాడలేదు. మిహిరకులుఁడు మరల నిట్లనెను. 'ఇవి మూఁడు ప్రశ్నములు. ఒక ప్రశ్నకు సమాధానము లేదు కదా? రెండవప్రశ్న మిది. నీవునాకు గురువవు. యువరాజ గురువవు. యువరాజు యొక్క చదువు సంపూర్ణముగా నుండవలయును. కొన్ని రాజనీతి గ్రంథములు, కొన్ని కావ్యములు చెప్పినంతఁ జదువు పూర్తికాదు. మా రాజవంశ చరిత్రము నీవు చెప్పవలయును. మా వంశము పేరేమి? ఇది యెపుడు మొదలు పెట్టినది. ఇంతవఱ కెంతమంది రాజులైరి?'

గు : యువరాజా! మీది గోనంద వంశము. మహాభారత యుద్ధమునకు రెండు మూఁడు వందలయేండ్లకుఁ బూర్వము కాశ్మీర దేశమున గోనందుఁ డన్నరాజు పరిపాలించుచుండెను. అతఃపూర్వరాజుల చరిత్ర తెలియదు. ఆ గోనందుని కుమారుని పేరు దామోదరుఁడు. ఇంకనొక యేఁడాదికి మహాభారతయుద్ధము జరుగుననఁగా గాంధారపతియొక్క యొక కూఁతు స్వయంవరము జరిగినది. దామోదరుఁడా స్వయంవరమును విఘ్నపరుపవలయునని తనసైన్యముతో వెళ్ళెను. తత్కాలమున శ్రీకృష్ణుఁ డచ్చట నుండెను. ఆయన దామోదరుని సంహరించెను. దామోదరుని భార్య పేరు యశోవతి. ఆమె యప్పటికి మూఁడు నెలల గర్భవతి. తరువాత నాఱునెలలకామె ప్రసవించెను. ఆ శిశువునకు మరల గోనందుఁడన్న పేరు పెట్టికొనిరి. మంత్రులు పసివాఁడైన గోనందునినిరాదరించి యెవనినో తెచ్చి రాజును చేయవలెనని భావించుచుండగా శ్రీకృష్ణుఁడచ్చటికిఁ బోయి మంత్రుల నదలించి యా పసివానినే రాజుగా నంగీకరించునట్లు చేసెను. తరువాత నారునెలలకు మహాభారతయుద్ధము జరిగెను. ఆ యుద్ధములో నాసేతుశీతాచలమున సర్వదేశముల రాజులు పాల్గొనిరి. కాశ్మీరరాజు పసివాఁడగుటచేత రెండుపక్షములవారితని నడుగలేదు. ఇతఁడుపోలేదు. తరువాత కొన్నాళ్ళకు శ్రీకృష్ణ నిర్యాణము జరిగెను. ఏనాఁడు భగవంతుఁడైన కృష్ణుఁడు ధాత్రీతలమునుండి వినిర్గమించెనో యానాఁడు కలిప్రవేశించెను. తరువాత నిరువదియారేండ్లు యుధిష్ఠిరుఁడు ధాత్రిని పరిపాలించెను. యుధిష్ఠిరుఁడు నిర్యాణము పొందినదినము సప్తర్షిమండలము మఘానక్షత్రమును వదలిపెట్టి వెళ్ళెను. ఆనాటినుండి లౌకికాబ్దము ప్రారంభమయ్యెను. దానికే సప్తర్షికాలమని, యుధిష్ఠిర కాలమని పేరు. గోనందుఁ డేబదియాఱున్నర సంవత్సరములు పరిపాలించెను. లౌకికాబ్దమేడవయేట గోనందుఁడు మరణించెను. ఈ లౌకికాబ్దమునకుఁ గాశ్మీరాబ్దమునికూడఁ బేరు. ఈ గోనందునకు పరీక్షిన్మహారాజునకు యుద్ధము జరిగెను. పరీక్షిత్తు గోనందుని యుద్ధమున వధించెను. కాశ్మీరదేశము హస్తినాపుర రాజులచేత ముప్పది నాల్గుమంది చేతఁ బదమూడువందల పదునేడు సంవత్సరములు పాలింపఁబడెను. అప్పటికి బ్రవాసమునందున్న గోనంద వంశీయుఁ డొకఁడు లవుఁడనువాడు మరలఁ గాశ్మీరమును గెలిచి రాజయ్యెను. మొదటి గోనందునినుండి లవుఁడు నలుబదియవవాఁడు. ఆయనతరువాత పన్నిద్దరు గోనంద వంశజులు పరిపాలించిరి. ఏబదిరెండవరాజు పేరభిమన్యుడు. ఏఁబదిమూఁడవ రాజుపేరు మరల గోనందుఁడు. ఈ మూఁడవ గోనందుఁడు రాజ్యమునకు వచ్చునప్పటికి లౌకికాబ్దమునఁ బదునెన్మిదివందల తొంబదినాల్గు వత్సరములు గడచెను. ఆయన యేఁబదిమూఁడవరాజు. మీ తండ్రిగారైన వసుకుల మహారాజుగారరువది మూడవరాజు. మీ రరువది నాల్గవ ప్రభువులు. తమరు మరి పదిదినములలోఁ ప్రభువులగుదురు. ఇది రెండువేల మూఁడువందల డెబ్బది రెండవ లౌకికాబ్దము. ఇదినాకుఁ దెలిసిన చరిత్ర.

మి. కు : ఇది నీకెట్లు తెలియును?

గు : కొందఱు పూర్వకవులు వ్రాసిరి. మొదటి యైదుగురికి చరిత్రములు నీలముని యన్న ఋషివ్రాసెను. తరువాతి రాజులచరిత్రములు మఱికొందఱు వ్రాసిరి.

మి. కు : వారి పేరులేమి?

గు : రెండవ యాయనపేరు సువ్రతుఁడు. మూఁడవ యాయనపేరుక్షేమేంద్రుఁడు.

మి. కు : నా తరువాత నెంతమందిరాజులు వత్తురు?

గు : యువరాజా! అదియెట్లు చెప్పఁగలను? యముఁడు చెప్పఁగలఁడేమో? బేతాళుఁడు చెప్పఁగలఁడేమో?

మిహిరకులుఁడు గ్రహించెను. గురువునకు భయముపోయెను. అతడును తెగించుచున్నాఁడు. బ్రతికినచో నింటికిఁ బోదును, లేనిచోఁ బోనని నిశ్చయించుకొన్నాఁడు. మిహిరకులుఁ డిట్లనెను. 'అనఁగా నేటికి భారతయుద్ధము జరిగి యెన్నియేండ్లైనదన్నమాట?'

గు : ఇది యిరువదిమూడువందల డెబ్బది రెండేండ్లు. తత్పూర్వము సుమారు

ముప్పదియేండ్లు కట్టుకొనవలయును.

మి. కు : భారతయుద్ధము జరిగి యిన్ని యేండ్లైనదా ! కృష్ణుఁడు మామూలుపురుషుని వధించెను. పరీక్షిత్తు మరియొకనిని వధించెను. ఈ యాదవపాండవులు మాకు విరోధులు.

గు : ఇప్పుడు వారి వంశములు లేవు. కృష్ణుఁడు చనిపోయినతరువాత ద్వారకానగరము సముద్రములోమునిగిపోయెను. పరీక్షిద్వంశీయులు నేఁడు రాజ్యములు చేయుటలేదు. మగధరాజులక్రింద సేనాపతులుగా చిన్నచిన్న యుద్యోగస్థులుగా నున్నారు. వారిపైన పగతీర్చికొనుట యెట్లు.

మి. కు : పగతీర్చుకొనుట యెట్లో పగయొక్క స్వరూపమేమో నాకు దెలియును. నీవు వినవలతువా ?

గు : ప్రభువుల దయ.

మి. కు: నేను పది దినములలో రాజునగుదునంటివి కదా ; అది నీకెట్లు తెలియును ; నా తండ్రి దృఢకాయుఁడు. ధర్మబుద్ధి. నేనన్నచో మిక్కిలి ప్రేమకలవాఁడు. ఆయన చనిపోవలయునని నీయుద్దేశమా ?

గు : పదిదినములలోఁ దమరు రాజగుదురు. దేశజాతకమట్లున్నది. మనము ప్రసంగమారంభించిన సమయమును లెక్కచూచితిని. ఇది తప్పదు.

మి. కు : నీవు జ్యోతిర్వేత్తవు. నీ సంగతి నీకుఁ దెలియునా ?

గు : తెలియునుఁ, తెలియదు. అనంతమైన మహారణ్యమునఁ ద్రోవలుండును. కొన్ని యడవి మృగముల కాలిత్రొక్కిళ్ళ చేత నేర్పడినవి. కొన్ని కాంతారగత ఫలకాష్ఠాదులకు సంపాదింప వచ్చిన మనుజుల పాద సమ్మర్దము చేత నేర్పడినవి. ఏ దారి యెచ్చటికిఁ దీయునో తెలియదు. దారికదా యని మనము నడచుచుందుము. దానికిఁ జీలువలు పలువలు కలవు. ఒక పలువ వెంటఁబోయినచో సింగపు గుహకుఁ బోవును. పరమేశ్వర నిర్మితమైన యప్పటి బుద్ధి మరియొక దారి పట్టించినచో నదీతీరమునకుఁ బోవచ్చును. కాలము మహారణ్యము. మనుజుని జీవితమునడచుచుండును. రెండు చీలికలైన మార్గమునందు నిలుచున్న మానవుఁడు భగవంతుఁడే త్రోవనుండి వానిని బంపించునో దానిచివరకుఁ బోవును. వాఁడు పులిగుహకుఁబోవునో నదీ తీరమునకు జేరునో విర్ణయించినది యాసంధి ప్రదేశము. నేనిప్పుడా సంధిప్రదేశమున నున్నాను. భగవంతుఁ డనుగ్రహించినచో నదీతీరమునకుఁ బోదును. లేనిచో బులినివసించు కందరాంతరమునకు జేరుదును.

మి. కు : అందఱి జీవితము లింతియేనా ?

గు : త్రోవచీలదు. చివరిదాక సూటిగాఁ బోవును. ఈ సంధిప్రస్తావనలేదు. అప్పుడు దుఃఖములేదు, ఆలోచనలేదు, సంశయములేదు. కొందఱి జీవితమునందు భగవంతుఁడు సంధిఘట్టములు కల్పించఁడు. యువరాజా పగయొక్క స్వరూపమును దాని లక్షణములను చెప్పుదుమనిరి.

మి. కు : ఇంతవఱకు నే నడిగెడి వాఁడను, నీవు చెప్పెడివాఁడవు. ఇప్పుడు నీ వడిగెడివాఁడవు.

గు : బహువచనము లేనప్పుడు భయము లేదు.

మి. కు : పగయనగా నొకని జీవితముతో నొకకాలముతో నాగెడిదికాదు. కృతయుగమునందు పూనినపగ కలియుగమునందుఁ దీర్చుటకలుగును. పూర్వకల్పములందు పూనినపగ యనంతర కల్పములందుఁ దీర్చుట కలుగును. కొన్ని పగల కవధిలేదు. తిరిగితిరిగి తీర్చబడుచుండును. మరలమరల పూరింపబడుచుండును. నీకుఁ దెలియని సమాధానములు నేను చెప్పుదును. యముఁడు శైవుఁడు, అయినను శివవిరోధి. కావలసినవారిలో నొక విలక్షణమైన విరోధము ప్రాపించును. బంధుత్వముబంధుత్వముగా సాగుచునేయుండును. అంతర్విరోధరేఖ యనుస్యూతముగా నుండి సమయము వచ్చినప్పుడు పొడిచికొని వచ్చుచుండును. ఇద్దరు బాలురున్నారు. వారిద్దరన్నదమ్ములు. సోదరప్రేమ సమృద్ధిగాఁగలదు. నాల్గుదినములక్రింద నేదియో యడుగఁగాఁ దమ్ముఁడీయలేదు. ఈనాడు తమ్ముఁడేదో యడిగెను. నీవు మొన్న నాకీయలేదుగనుక నేను నేఁడీయను. గడచిన నాల్గునాళ్ళేకాదు రానున్న వంద యేఁడ్ల జీవితములోఁగూడ సౌదర్యమునకు భంగములేదు. ఈ పట్టింపుపట్టింపే. దానివలనఁ గలిగెడి కోపముకోపమే. ప్రతిక్రియ ప్రతిక్రియయే. ఇది చిన్న విషయముగనుక సామాన్యముగా గనిపించును. అధికప్రయోజనమునుఁడి భంగించునదై తీవ్రస్వరూపములో హృదయమున నిగూఢమై యున్నచో నది పగయగును. ఇద్దరువ్యక్తుల విషయములో నది వారియిద్దరి జీవితకాలములయందుఁ బగగా భాసించును. రెండుకులములైనచో రెండు జాతులైనచో నవిరెండు సిద్ధాంతములైనచో నీవిరోధముల యొక్క నడక వందలయేండ్లమీద జరుగును. యుగములమీద జరుగును. అనంత కాలముమీద జరుగును. యముని బంటు మృత్యువు.

మృత్యువును కాదన్నచో యమునికిఁ గోపము. శివుఁడు మృత్యువును గాదనుటయే చేయలేదు. యమునకే సున్న చుట్టినాఁడు. మార్కండేయునకుఁ గాలము తీరినది. వంపు తిరిగిన కొమ్ములుగల దున్న నెక్కి సర్పముల వంటి పాశములు పూనివచ్చిన యముని లింగమునుండి సముద్భవించిన శివుఁడు మువ్వాడి యీటితో రొమ్మున బొడిచినాఁడు. అంతటితో సరిపోలేదు. మార్కండేయుని చుట్టున నొక గిరి గీసినాడు. ఆ గీసినగిరి యుగయుగములందుఁ జెఱుపరాని దైనది. ఇదియొక చమత్కారమైన విషయము. ఒకఁడొక దానియందు మిక్కిలి మమత కలిగి యుండి దానిని మాత్ర మడుగకుము. మరి దేనినైన నిత్తుననును. మమత యెక్కువది కాని దాని వెలతక్కువదియే. ఆ రెండవవాఁడు సర్వమును దీపి కొనును. వీఁ డంగీకరించును. పట్టించుకొనఁడు. దానియందు విరాళ చేసుకొనును. అట్లు చేసికొనెడు విరాళ యీ మమత పెంచికొన్న యల్ప వస్తువునందు జేసికొన్నచో నెంతయో మేలగును. కాని మమత చెడ్డది. అల్ప విషయమునందు ముడి వేసికొని కూర్చుండి మహావిషయములను పరిత్యజించును. ఒక్క మార్కండేయునకు దీర్ఘాయుర్దాయ మిచ్చినాఁడు. చిరాయువిచ్చినాడు. మహా ప్రళయ సముద్రము పైన విదురించుచున్న వటపత్ర శాయిని మార్కండేయుఁ డొక్కఁడే చూచినాఁడు. అంతటి యాయుస్సు నొసంగినాఁడు. మ యముఁడు దీనికి వారడిగా యథేచ్ఛముగా విహరించు చున్నాఁడు. తాను చాలక నన్నిచట నుత్తర దిశయందు సృష్టించినాఁడు. కృతయుగారంభమున మార్కండేయుని విషయమునఁబట్టిన పగను ప్రతి కలియుగమునందు విశృంకలముగా యముఁడు తీర్చుచున్నాఁడు. శివుఁడు మాటాడుటకు వీలులేదు. పగయు బంధుత్వము కలచోటి లక్షణ మిట్లుండును.

గు : యువరాజా మహా పండితులు, అవతారమూర్తి. ఆయనకు తెలిసిన మహా విషయములు మానవులకు మాకేమి తెలియును.

మి. కు : మీరు బ్రాహ్మణులు, పొగడిక మీకుఁ దెలిసినట్లు మఱి యెవ్వరికిని దెలియదు.

గురువు : యథార్థ కథనము పొగడికవలె నుండును. వేదమునందు దేవతలను గూర్చిన స్తుతి యుండును. అది యుత్ప్రేక్షగా నతిశయోక్తిగా సామాన్యులు భావింతురు. సర్వవ్యాపియయిన పరమేశ్వరుఁడు విభూతి మత్పదార్థముల యందుఁ బ్రకాశించు చుండును. పరమేశ్వర స్తుతికి దత్కాలమునందలి తద్విభూతి మత్పదార్థమునకు నిజముగా భేదములేదు. వేదము యథార్థము వక్కాణించు చున్నది. నిజమైన యుపాసకుఁడు దానిని జెప్పుచున్నాఁడు. అల్పుఁడు దానిని ద్విధా దర్శించుచున్నాడు. తమరు భూపతులు. భూపతి యష్టదిక్పాలకుల యంశలో జన్మించువని శ్రుతులు చెప్పుచున్నవి. స్థూల దృష్టికిఁ దమరికిఁ గూడఁ గరచరణాద్యవయవములే కలవు. శరీరమే కలదు. కామక్రోధాదు లందఱికి వలెనే తమకును గలవు. ఇది యంతయు మనుష్య భాగము. దేశమును పాలించుటయందు, ధర్మమును పంరక్షించుటయందు మీకొక వైశిష్ట్యము కలదు. ఆ వైశిష్ట్యమునందు దిక్పాలకాంశలును విష్ణ్వంశయు కలవు. అది సూక్ష్మదృష్టితోఁ జూడఁదగినది. రాజును మానవుఁడే. ఇంత మంది ప్రజ లతనిని రాజనుకొనుచున్నారు. ఎందుకనుకొనుచున్నారు. పరంపరానుగతమైన యొక విశ్వాసము చేత ననుకొనుచున్నారందము. ఆ పరంపర యెట్లు వచ్చినది. కాదు. రాజు లేకుండ ప్రజాభిప్రాయముతోఁ బాలింపబడు రాజ్యములు కలవు. పూర్వము ద్వారకానగర మట్టిది. కృష్ణుఁడు రాజు కాఁడు. ప్రజాప్రతినిధి. ఇట్టి రాజ్యములు త్రేతా యుగమునందుఁ గూడఁ గలవు. రఘు మహారాజట్టిరాజ్యములను గొన్నిటిని గెలిచెనని కథలు కలవు. అచట ప్రజా ప్రతినిధి రాజ స్థానీయుఁడు. వానియూహలు వేఱు. వాని లోననే మనసులో రెండు గదులున్నవి. ఒకగది వాని వ్యక్తిత్వమునకు సంబంధించినది, రెండవది ప్రజాపాలనకు సంబంధించినది. ఇది రస సిద్ధాంతము వంటిది. వ్యక్తిగతములై కామక్రోధాదులు కలవు. కావ్యపఠన వేఁగూడనవి కలవు. వ్యక్తిగతములైన కామక్రోధాదులు వ్యక్తియొక్క సుఖ దుఃఖములకు హేతువులు. అవి వ్యక్తిగత కర్మకు సంబంధించినవి. కావ్య పఠన శ్రవణ వేళా సంజనిత కామక్రోధాదులు రసమార్గమునందు సంచరించు చున్నవి. ఒకటియే బుద్ధి. ఇచట నల్ప ఫలము. అచట నధిక ఫలము. రాజు ప్రజాపాలనము చేయునపుడు వాఁడు సామాన్యమానవుఁడు కాఁడు, కోట్ల ప్రజల సుఖ దుఃఖములను పాలించు నొక మహత్త్వము వాని యందు సంక్రమించియున్నది. సంక్రమించ లేదను

కొందము. తన వ్యక్తి గతమైన కామ క్రోధముల చేతనే వాఁడు దేశమును పాలించునందము. అప్పుడు వాని స్థితి యెట్టిది? వాఁడట్లెందుకు చేయుచున్నాఁడు. అప్పటి ప్రజల భాగధేయముల ననుసరించి వాఁడు కుత్సితుఁడో క్రూరుఁడో ధర్మబుద్ధియో యగుచున్నాఁడు. ప్రజల యొక్క సమాహారభూతమైన భాగధేయమే దిక్పాలకుల యొక్కయు విష్ణువు యొక్కయు తత్ప్రజా సన్నిహిత భావనా లక్షణము. ఇది యాంతరమైన మనోవిషయము, ఆధ్యాత్మిక విషయము. దానిని కాదనుట యెట్లు? కాదన్న వాఁడు సూక్ష్మ విచారణ యెఱుఁగని వాఁడు.

మి. కు: నీవు సామాన్యుఁడ వనుకొంటిని. విశేషజ్ఞుఁడవు, పండితుఁడవు. గ్రంథముల యొక్క తత్త్వము తెలిసిన వాఁడవు. నిన్నొక్కటి యడిగెదను. పది దినములలో నా తండ్రి యెట్లు మరణించును? నేను కాశ్మీర దేశాధిపతి నెట్లగుదును? ఇదినాకుఁ జెప్పినచో...?

గురువు మరల నాలోచించెను. 'ఇది రెండవ ప్రశ్న. మూఁడవ ప్రశ్న కూడఁ దెలిసినచో నటో యిటో తేలిపోవును.' అతఁ డిట్లనెను. 'ఇది రెండవ ప్రశ్న. యువరాజుగారి మూడవ ప్రశ్న మిగిలియున్నది. నేను రెండు ప్రశ్నలకు సమాధానములు చెప్పలేక పోయితిని. మూఁడవ ప్రశ్న కూడ వేయించవలసినది.'

ఆ మహా పర్వతములలోఁ దెల్లని మంచు గడ్డలచేతఁ బ్రాతః కాలమునుండి యస్తమయ కాలమువఱకు వంద విధములైన వన్నియలుగాఁ బరిణమించు సూర్య కిరణముల యొక్క ప్రసార ప్రతిబింబముల రామణీయకమును వెలిగ్రక్కు పర్వతములలో ధవళిమయన్న వర్ణమును సహస్రచ్ఛాయలతో నిరూపించు తెలిమంచు చిఱురాళ్ళ పొందికలు కలిగిన యా పర్వతములలో నా సాయము చూచుచు నిలుచున్నచో దినము దినము కృతార్థమగును. జీవితము జీవితము కృతార్థమగును. సూర్యకిరణములను గిరణములుగా నెవ్వఁడు చూడఁగలడు? అవి యన్నియు సముదాయ భూతములై యొక యెండగాఁ గనిపించును. స్థూల దృష్టికి వాని విభక్తి తెలియదు. మఱియు నా కిరణములు వస్తువులయందుఁ బడి పుచ్చెడి తళతళ, తెచ్చెడి వికారము చేతఁ గిరణము లూహింపబడుచున్నవి కాని దర్శింపఁ బడుటలేదు. కిరణములు కొన్ని సూటిగాఁ బడును. కొన్ని పడవు. వాని వెలుగుపడును. పడమట సూర్యుఁ డస్తమించును. పర్వత మడ్డము వచ్చును. పర్వతము వెనుకతట్టునఁ గిరణములు పడుచున్నవి. కాని యా వెలుగు పర్వతాగ్రములపైనుండి దూకి యా పర్వతము యొక్క తూర్పు ప్రక్క పడుచున్నది. ఆ వెలుతురు విలక్షణముగా నుండును. దాని వలన మంచుపొరల మీదఁగలిగెడి మార్పు, తెచ్చెడి వర్ణము విచిత్రముగా నుండును. కృతకముగా నుండును. నేత్రములకుఁ దక్షత కలిగించదు. ఒక రామణీయకమును సందిల్లఁ జేయును. ఆ సమయమునఁ దెల్లని యేటి జలము నల్లగాఁ గనిపించును. సృష్టిలో నితరమైన సర్వదేశములయందు నదులు పలువికారములు పొందును. అవి యొకప్పుడు పంకసంకిలములు. ఒకప్పుడరుణ వర్ణాభిరామములు. కతకఫలము రీతి కలశ సూతి ముట్టుకొన్న వేళ తెలి వలిపపు చీరల సొగసు వెలార్చును. శరత్తు ముదిరి హేమంత శిశిరములుగాఁ బరిణమించువేళ నీళ్ళు నల్లఁబడును. కాశ్మీర దేశమునందట్లుకాదు. సర్వ ఋతువులయందు సర్వకాలముల యందు నీరు కరగిన మంచువలెఁ గరుగకయే నీరుగా ప్రవహించు వెన్నవలెలోని యస్థికలు యక్కున్నాంసాదులు కనిపింపఁ జేయు తెల్లని కామధేనువు యొక్క దేహమువలెఁ బ్రవహించును. ఆ యస్తమింపఁబోవు సూర్యుని ప్రత్యక్షకిరణ ప్రసరణముచే యచ్చోటగూడ నా నదీ తీరములు తెల్లగానే యుండెను. వేఱు చోటి నదీతీరమైనచో నల్లబడియుండును. వానియందు చీకట్లు ప్రతిఫలించి యుండును. ఇచట నట్లులేదు. కైలాస శిఖరమునందు నెలకొన్న ధూర్జటిమౌళి భాగమునందుఁగల లేతజాబిల్లి జిలుగు వెలుగులచేత నిచ్చలు పచ్చలవన్నె ముచ్చివించు కాంతి యాప్రదేశములందు విహరించుచుండును. ఆ నదీ నీరము నల్లఁబడదు. మిహిరకులుఁడిట్లనెను. 'ప్రొద్దు కుంకుచున్నది. ఇచటికి చీకట్లు రావు. నీవు పండితుఁడవు. రెండు ప్రశ్నలకు సమాధానము లేదు. మూఁడు ప్రశ్నలలో రెండింటికి సమాధాన మిచ్చినచో నీవు గెలిచినట్లు. రెంటికీయనిచో మూఁడవదాని కిచ్చినను ఫలితము లేదుగదా. కాని నీవు జ్యోతిర్వేత్తవు. ఇంటికిఁబోయి గుణించినచో రెండవ ప్రశ్నకు సమాధానము చెప్పఁగలవు. అది రేపు చెప్పుదువు గాని. అపుడు మూఁడవ ప్రశ్న యడుగుదును.

గు; రెండవదానికి సమాధానము చెప్పుదును.

ఇది జ్యోతిష విద్యా సంబంధిగానఁ జెప్పినచోఁ జెప్పఁగలనేమో. మూఁడవ ప్రశ్న యెట్టిదో నాకుఁ దెలియదు. ఇది చెప్పినను మూఁడవది నా శక్తి కతీత మైనదైనచో నే నోడిపోయినట్లే. అదియుఁగాక నేను పన్నిదము పరచ లేదు. అన్నింటిని యువరాజే భావించుచున్నారు.

మి. కు: నీవు పట్టి చదువు చదివినవాఁడ వేనా! కత్తి యుద్ధము చేయఁగలవా?

గు: నేనెన్నఁడు కత్తిపట్టిన వాఁడనుగాను.

మి. కు: నీకుఁగుమారు లెంతమంది?

గు: ముగ్గురు.

మి. కు: వారి వయస్సు లెంత యెంత?

గు: పెద్దవాఁడు మీ యీడువాఁడు. అతఁడును పండితుఁడే. రెండవ వాఁడు పదునాలుగేండ్లవాఁడు. వారణాసి యందుఁ జదువుకొనుచున్నాఁడు. మూఁడవ వాఁడా రేండ్లవాఁడు.

మి. కు: కుమార్తెలు కలరా?

గు: వారింకను చిన్నవాండ్రు. ఒకత్తుక తొమ్మిది యేండ్లది. రెండవ పిల్ల మూఁడేండ్లది.

మి. కు: మీ కేమాత్ర మాస్తియున్నది?

గు: ఎక్కువ లేదు. అన్నోదకములకు, పరిపోయినంతకలదు.

మి. కు: ఉదకము ధనముతోఁగొనముకదా. అన్నోదకములనరాదు. అన్నమనవలయును.

గు: తిన్నయన్నము జీర్ణమగుటకుఁ దగినంత జలము త్రావవలయును. ఆ త్రావిన జలమునకుఁదగినంత యన్నము తినవలయును. అందుచేత నన్నోదకములందురు.

మి. కు: మన మెల్లుండి కలసికొందము ఇచ్చటనే!

(సశేషం)




దివ్య దీపావళీ జ్యోత్స్నలు

చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ

భారతదేశంలో అత్యధికంగా
అమ్మకం జరుగుతున్న సిగరెట్టు
ఆంధ్రప్రదేశ్ లో ఉత్పత్తి అవుతున్నది



# అధికాహారోత్పత్తికి దోహదమిచ్చే సస్యసంరక్షణ-కొన్ని సూచనలు

ఎ. సుంకన్న

## వెలుగు బాటలు

ప్రభుత్వమువారు అధికాహారోత్పత్తి చేయుటకుగాను రైతులకు పలు విధముల సహాయపడుచున్నారు. మరియు అధికాహారోత్పత్తికి దోహదమిచ్చే రకరకములగు, ఆధునిక వ్యవసాయ పనిముట్లను, నవీన వ్యవసాయ పద్ధతులను, రైతులకు తెలియజేయుటకు బ్లాకులోని గ్రామసేవక్, వ్యవసాయ విస్తరణ శాఖాధికారి ద్వారా విశ్వ ప్రయత్నము చేయుచున్నది. సకాలములో రైతులకు బావుల సబ్సిడీలు, రసాయనిక ఎరువులు కొనుటకు అప్పులు, మంచి విత్తనములను తెప్పించి యిచ్చుట, భూమిని అభివృద్ధి పరచుకొనుటకు భూసారము రక్షించుకొనుటకు, తక్కావీ ఋణములను మంజూరు చేయుచున్నారు. ఇన్ని చేయుచున్నను అధికాహారోత్పత్తి "ఎక్కడ వేసిన గొంగడి యక్కడే" యన్నట్లున్నది. ప్రభుత్వమువారు ఐహాళ కృషి చేసినను ప్రజలు విమర్శించుచునే యున్నారు. కనుక ఎక్కడో లోపముండి తీరును. పెరుగుచున్న జనాభాను దృష్టిలో పెట్టుకొని, దేశ శ్రేయస్సుకొరకు, ధరలను అదుపులో పెట్టుటకు అధికాహారోత్పత్తి చేయుట ప్రతియొక్క రైతు కర్తవ్యమై యున్నది.

ముఖ్యముగా బ్లాకులు (సమితులు) ఆహారోత్పత్తిని పెంచుటకే ఏర్పడినవని చెప్పవచ్చును. అధికాహారోత్పత్తిని సాధించుటకు, రైతులలో ఒకవిధమైన "విప్లవము" రావలెను. ఆ విప్లవము పాత పద్ధతులను విస్మరింపజేసి, నవీన పద్ధతులను అవలంభించునట్లు చేయుటయే పాత పద్ధతులపై వారికున్న మమతను, క్రొత్త పద్ధతులు జయప్రదముగా నిర్వహించి చూపించుట ద్వారా కొంతవరకు వాటిని విస్మరింపజేయవచ్చును.

అధికోత్పత్తికి దోహదములగు

1. సేద్య ప్రణాళికలు తయారుచేయుట.

2. రసాయనిక ఎరువులు వాడుటవలన అధికోత్పత్తిని గావింపవచ్చునని ప్రత్యక్ష ప్రదర్శనములద్వారా చూపించుట.

3. మంచి విత్తనముల వాడి మంచి పంటలను, మంచి దిగుబడిని సాధింపవచ్చునని నిరూపించుట.

4. ఆధునిక వ్యవసాయ పనిముట్లను, ఆధునిక వ్యవసాయ పద్ధతులను వాడుట వలన మంచి దిగుబడి వచ్చునని చెప్పి చూపించుట.

5. పచ్చిఎరువుల నిచ్చే మొక్కలను విరివిగా పెంచుట. పచ్చి ఆకును తెచ్చి, కసువు మొదలగువానితో కంపోస్టు ఎరువు తయారుచేసి పొలములకు వేయుట.

6. సమయమునకు క్రిమి సంహారక మందులను చల్లి సస్య సంరక్షణ చేయుట.

7. విత్తనములనుండి వచ్చు రోగములను అరికట్టుటకు సీడ్ ట్రీట్‌మెంటు (Seed treatment) వివిధ విత్తనములను వివిధ ఔషదములలో కలుపుట. ఉదా॥ 1. వరి విత్తనములలో అగ్రసాన్ జి. యన్. కలుపుట. 2. జొన్న విత్తనములను గంధకముతో కలిపి విత్తుట. మొ॥

పై వివరించిన పద్ధతులను రైతులు అవలంబించినపుడే అధికాహారోత్పత్తి యగును. బ్లాకు సిబ్బంది పై పద్ధతులను రైతులచే అవలంబింపజేయుటకు కృషి చేయుచున్నారు. కాని రైతులు వానిని సరిగా అవలంబించుట లేదు ఎందుకనగా.

1. జయప్రదముగాని రసాయనిక ఎరువుల, మంచి విత్తనముల ప్రత్యక్ష ప్రదర్శనలు వారిని సందేహాస్పదులుగా చేయుటయే కాక క్రొత్త పద్ధతులను అవలంబించుటలో వారిని విముఖులుగా చేయుచున్నవి.

2. రసాయనిక ఎరువులు సమయమునకు అందుబాటులో లేవు.

3. ఆధునిక వ్యవసాయ పనిముట్లు అందుబాటులో లేవు. వున్నను వానిని వుపయోగించుట తెలియదు. వానిని రిపేర్ చేయుట తెలియదు. వారి ఆర్థిక దుస్థితి కూడా వానిని కొనుటయందు అశ్రద్ధ చేయబడుచున్నది.

4. వారి ఆర్థిక స్థితి మెరుగగుటకు తగిన వృత్తులు వారు అవలంబించుట లేదు.

పై సమస్య లన్నియు తొలగిపోవుటకు కొన్ని స్వచ్ఛంద సంస్థలు ముందుకు రావలెను. అవి (1) గ్రామపంచాయతీ సంస్థ. (2) సహకార సంస్థ.

సహకార సంఘములు లేని చోట ప్రతి గ్రామ పంచాయతీ ఆ గ్రామ అవసరముల గుర్తించి, రసాయనిక ఎరువులను, క్రిమి సంహారక మందులను, నవీన వ్యవసాయ పనిముట్లను, స్ప్రేయర్లను, డస్టర్లను, సీడ్ ట్రీట్ మెంటు డ్రమ్‌ను, నిర్వహించవలెను. ఇట్లు చేయుటవలన రైతులకు సకాలములో క్రిమి సంహారక మందులు, మొదలగునవి, లభ్యమగుటవలన సకాలములో రోగముల నరికట్టవచ్చును.

ఉదాహరణకు ఒక రైతు వరివిత్తనములు వేయుచుండును. విత్తనముల నుండి వచ్చు రోగములు నిరోధించుటకు అగ్రసాన్ జి. యన్. లో విత్తనములను కలుపుమని (Treat చేయుట) గ్రామ సేవక్ చెప్పియుండును. కాని అగ్రసాన్ జి. యన్. ఏ బ్లాకు ప్రధాన కేంద్రములోనో తాలూకా కేంద్రములోనో దొరుకును. ఒకటి లేక రెండు పౌనులు అగ్రసాన్ జి. యన్. కొరకు సుమారు 20 లేక 30 మైళ్ళ దూరములో నున్న ఆయా కేంద్రములకు పోవలె నన్న ఖర్చు ఎక్కువగుటచే రైతు పోవుటకు సమ్మతించడు. అక్కడితో *సీడ్ ట్రీట్‌మెంటు స్తంభించి పోవును.* పై ఔషధము లన్నియు గ్రామ పంచాయతీ నిర్వహించిన రైతులకు సకాలములో మేలుచేయుటమే గాక అధికోత్పత్తికి పంచాయతీ దోహదకారి యగును. ముఖ్యముగా పంటలను రోగముల బారినుండి సమయమునకు రక్షించినపుడే వుత్పత్తి తగ్గిపోకుండ చేయగలము. కనుక అధికోత్పత్తిలో "సస్య సంరక్షణ" ఒక ముఖ్యమైన అంశము.

ప్రభుత్వము వారు "సస్య సంరక్షణ"కు గాను ప్రత్యేకముగా కొంత సిబ్బందిని "మందు చల్లుటకు మాత్రము" ఒక్కొక్క గ్రామ సేవకుని సర్కిల్‌లో కొంత మందిని నియమించి వారికి కావలసిన క్రిమి సంహారక మందులు, స్ప్రేయర్లు, డస్టర్లు, సీడ్ ట్రీట్‌మెంటు డ్రమ్ సీడ్ ట్రీట్‌మెంటు ఔషధములు యిచ్చి ఏ ఏ రోగములకు ఏ ఏ మందులు చల్లవలసినది ఆ సర్కిల్ గ్రామసేవక్ నుండి గాని లేదా వ్యవసాయ విస్తరణ శాఖాధికారి నుండి గాని సలహాల పొంది ఆ సిబ్బంది పని చేయుచుండవలెను. *వారికి పంట లుండు కాలంలో* మాత్రము దినకూలీలు ఏర్పాటు చేయవచ్చును. దోమలను నిర్మూలించుటకు ప్రతియింటికి డి. డి. టి చల్లుటకు ప్రభుత్వము వారు ఎలా కూలీల ఏర్పాటు చేశారో అలాగే సస్య సంరక్షణకు కొంత మందిని నియమించి సకాలములో పంటలను కాపాడవచ్చును. మందు చల్లినందుకు రైతు నుండి ఎకరమునకు కొంత స్వల్ప సొమ్మును వసూలు చేయవచ్చును. మరియు ఆ సిబ్బంది కయ్యే ఖర్చు ఆ యా గ్రామపంచాయతీలు కొంత భరించవచ్చును. ఆ సిబ్బంది గ్రామ సేవక్ యొక్క సర్కిల్ సంతయు చూచుటయే గాక ఆ సర్కిల్ పర్యటించుచుండును. పై సిబ్బంది గ్రామ సేవకుని సర్కిల్‌లో వున్న ఎడల, సమయమునకు, పైరులు రక్షింపబడును. పైరులను రోగముల బారినుండి రక్షించినపుడే అధికోత్పత్తి యగును. అధికోత్పత్తి సాధించినపుడే రైతు ఆర్థిక స్థితి మెరుగగును.

★

# మాటలు - చేతలు

ముద్దంశెట్టి హనుమంతరావు

హాలు ప్రేక్షకులతో క్రిక్కిరిసి వుంది.

నాటకం ప్రారంభించే వేళయింది. నిర్వాహకుల తరపున వారి కార్యదర్శి వేదిక మీదికి వచ్చాడు.

"మహాజనులారా! మరికొద్ది నిముషాల్లో, నాటకం ప్రారంభించ బడుతుంది. ఈ నాటకాన్ని విజయవంతంగా సాగించడానికి తోడ్పడిన మీ అందరికీ, మా సమితి తరపున కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

"ఈ నాటి నాటకానికి వసూలైన మొత్తం దేశరక్షణ నిధికి పంపుతున్నామని తెలియజెయ్యడానికి, యెంతో ఆనందిస్తున్నాం, అంతేకాదు – ప్రస్తుతం మేం ప్రదర్శించబోతున్న నాటకం కూడా, దేశాభ్యుదయానికి సంబంధించిందే కావడం గమనించ తగ్గ విషయం. ఈ నాటకాన్ని నిశ్శబ్దంగా చూచి ఆనందించి, అందులోని నీతిని ఆదర్శంగా తీసుకుంటా రని ఆశిస్తున్నాం. ఇప్పుడు ప్రముఖ న్యాయవాది, శ్రీ మహేశ్వరరావుగారు రెండు ముక్కలు మాట్లాడుతారు. సావధానంగా వింటారని మా నమ్మకం ..." అంటూ వేదిక పైకి శ్రీ మహేశ్వరరావుగారిని ఆహ్వానించాడు కార్యదర్శి కేశవరావు.

మహేశ్వరరావుగారు, నలభై అయిదు సంవత్సరాలు పైబడిన వ్యక్తి. గంభీరంగా అగుపిస్తారు. దేశభక్తులు. దేశంకోసం యే త్యాగం చెయ్యడానికైనా సంసిద్ధులాయన. అందుకే, యిటువంటి సందర్భాల్లో ఆయన యెక్కువ ఆసక్తి చూపుతూ వుంటారు.

మహేశ్వరరావుగారు, మైకు ముందు నుంచుని గొంతు సవరించుకొని మాట్లాడారు. "సోదర, సోదరీ మణులారా, ప్రస్తుతం మన మొక పరీక్షలో నిలబడ్డాం: చైనావారు మనదేశాన్ని అక్రమంగా, అకారణంగా దోచుకోవాలన్న తలంపుతో దురాక్రమణ జరిపే ప్రయత్నంతో మనల్ని మేల్కొలిపారు. వారుచేసిన యీ అన్యాయానికి, ప్రపంచమంతా వారిని అసహ్యించుకుంటున్నా, వాళ్ళ మాత్రం, తమని తాము సమర్థించుకుందుకు యేవో కల్లబొల్లి కల్పనలు ప్రచారం చేస్తున్నారు. ఇక మీదట వారు యెటువంటి అన్యాయానికి తలపెట్టినా, మనమంతా యేకమై, ధైర్యంగా యెదిరించి, వారికి పాఠం చెప్పడమే మన కర్తవ్యం. అదే మనల్ని యెదుర్కున్న పరీక్ష కూడాను. ఈ పరీక్షలో మనదే పైచేయి. అందుకు సందేహంలేదు. అయితే, మనలో ఐక్యత కావాలి. అంతే కాదు. శక్త్యానుసారంగా దేశరక్షణకు చేయూత నివ్వాలి. ఈనాడు మనం యిప్పుడు ప్రదర్శించబోయే నాటకాన్ని చూడ్డానికి రావడం యెంతో శ్రేయోదాయకం. ఐక్యత వల్ల కలిగే లాభాలను వ్యక్తం చేసే నాటకం యిది! ఈ నాటకాన్ని మీరంతా చూసి, ఆనందిస్తా రనే నమ్మకం నాకుంది. అందులోని నీతిని సూక్ష్మంగా గ్రహించి, ఆచరణలో పెడతా రన్న నమ్మకం కూడా వుంది. జైహింద్." అంటూ ముగించా రాయన.

హాలంతా, కరతాళ ధ్వనులతో ప్రతిధ్వనించింది. క్షణం పోయాక నిశ్శబ్దం ఆవరించింది. ప్రార్థన గీతం వినిపించింది ... తక్షణమే తెరలేచింది.

నాటకం ప్రారంభ మయ్యింది! నాటకంలో నాయకుడి పాత్ర పరంధామయ్య కొడుకు ప్రభాకరం నిర్వహించాడు. కథానాయకి పాత్ర మహేశ్వరరావుగారి అమ్మాయి సుజాత నిర్వహించింది. సుజాతను రంగస్థలం మీద చూస్తూనే, మహేశ్వరరావుగారు మండిపోయారు. అవుతే, ఐక్యత అవసరమని, అతనే వుపన్యాసం యిచ్చి వుండటం వల్ల చప్పున ఆవేశం తెచ్చుకొని అసభ్యంగా ప్రవర్తించలేకపోయాడు.

నాటకం జయప్రదంగా కొనసాగింది. నాటకంలో వుత్తమ నటనకు రెండు బహుమతు లేర్పాటు చెయ్యబడ్డా యనీ, ఆ బహుమతులను మహేశ్వరరావుగారే ప్రధానం చెయ్యాలని కార్య నిర్వాహకులు ప్రకటించారు. మహేశ్వరరావుగారికి ఈ ప్రకటన మనస్కరించలేదు. అయినా, ఆ క్షణంలో నిరాకరించలేకపోయారు. ఉత్తమ నటనకు నాయకీ నాయకులకు బహుమతులు లభించాయి.

కూతురికి బహుమతి అందజేస్తున్న

మహేశ్వరావుగారి మొహం, అప్రయత్నంగా అరుణకాంతిని పుంజుకుంది. కార్య నిర్వాహకులు అతని ముఖ కవళికలు గమనించి, కాస్తంత కలవరపడ్డారు కూడాను. అవుతే, ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో, మహేశ్వరరావుగారి కోపం అణగారి పోయింది.

ఆరోజు కార్యక్రమం యెలాగో సవ్యంగా ముగిసింది. మహేశ్వరరావుగారు అక్కణ్ణించి నిష్క్రమించారు.

• • •

సుజాత యిల్లు చేరుకునేసరికి, కాస్త ఆలస్య మయ్యింది. ఇల్లు చేరువ అవుతున్న కొద్దీ, భయపడిందామె. ఆమెకి అప్పు డనిపించింది, తను తప్పు చేశానని; నాటకంలో వేషం వేస్తున్నట్టు తండ్రితో ముందుగానే చెప్పి వుండవల్సింది... అనుకుంటూ మెల్లగా, అడుగులో అడుగు వేసుకుని లోపలికి నడిచింది.

మహేశ్వరరావుగారు హాల్లో కూర్చుని వున్నారు సోఫాలో. ఆయ నింకా దుస్తులు కూడా మార్చలేదు. తండ్రిని చూస్తూనే, స్తంభించి పోయింది సుజాత. లోపలికి వెళ్ళిపోబోయింది మౌనంగా. "సుజాతా!" వురిమి నట్లుగా కేక వేశారు మహేశ్వరరావుగారు. అతని కంఠం కోపంతో కంపించింది.

సుజాత టప్పున ఆగిపోయింది. మెల్లగా తండ్రి సమీపానికి వచ్చింది. ఆయన మొహంలోకి చూళ్ళేక పోయింది.

"నా యింట్లో మళ్ళీ యెందుకు అడుగు పెట్టావే? ఆ ప్రభాకరంతో పాటే వెళ్ళి పోలేక పోయావూ? వాళ్ళకీ, మనకీ, విరోధం వుందని తెలిసి కూడా, వాడితో నాటకం వెయ్యడానికి యెలా అంగీకరించావు? ఇంత ధైర్యం నీలో యెలా వచ్చింది? నా గౌరవం మంటగలిపావు కదా?" రుసరుస లాడుతూ అన్నాడు. ఆ కోపంలో అతను యిటూ, అటూ, పచారు చేయడం ప్రారంభించాడు.

సుజాత క్షణం మాట్లాడ లేకపోయింది. అలా మౌనంగా వుండటం, మరీ మంచిది కాదనిపించింది.

"ఏ విధంగా మీ గౌరవం మంట గలిసిందంటారు నానా?" అంది.

కూతురు యెదురు ప్రశ్న వెయ్యటం, ప్రథమ పర్యాయంగా వింటున్నాడాయన, యిందుకు విస్తుపోయాడు కూడాను.

"ఇంక ఆ మాట మెల్లిగా అంటున్నావేమిటి సుజాతా! వాళ్ళకీ, మనకీ వున్న బద్ధవైరం మాట మరిచావా? ఇంతకంటె తలవంపు కలిగించే విషయం మరోటి యేం కావాలి? నా కూతురు నా విరోధి కొడుకుతో నాటకం వేసిందంటే, నాకు మిగిలిన వ్యక్తిత్వం యేమిటీ? ఛీ! ఛీ! ఇటువంటి అవమానం, నా జీవితంలో యెప్పుడూ తారసపడలేదు. ఈ రోజునుంచీ నీ చదువుకి స్వస్తి చెప్పి, లక్షణంగా యింట్లో కూచో!" వుక్రోషంతో అన్నాడు.

"నాన్నా!" స్తంభించి పోయింది సుజాత. చదువుకి స్వస్తిచెప్పమనడం, ఆమెనుమరింత బాధించింది. బి. ఏ. పట్టా పుచ్చు కుందుకు మరొక్క సంవత్సరముంది. ఈరోజు సంఘటనకి తన భవిష్యత్తే బలి అవుతుందా? ఇన్నాళ్ళ శ్రమ వృధా అవుతుందా? ... యింక ఆమె ఆలోచించలేక పోయింది.

"ఏమిటి నాన్నా, మీ రంటున్నది? నా చదువుకే స్వస్తి చెప్ప మంటున్నారా? ఇన్నాళ్ళ నా శ్రమ వృధా కావల్సిందేనా? నా భవిష్యత్తు భూస్థాపితం కావల్సిందేనా? ఇంతకీ నేను చేసిన అంత ఘోరమైన తప్పేమిటి?"

"తెలీనట్టు అడుగుతా వేం? మనకి విరోధి అయిన పరంధామయ్య కొడుకుతో పరిచయం యేర్పర్చు కోవడమే నీ తప్పు. అది నాకు తలవంపు తెచ్చేది కాబట్టి క్షమించరాని తప్పు" అన్నాడు కోపంగా.

"ఏమి టండీ సుజాత చేసిన తప్పు" అనుకుంటూ లోపలికి వచ్చాడు ప్రభాకరం.

మహేశ్వరరావుగారు, ప్రభాకరంని చూస్తూనే కాస్తంత కలవరపడ్డారు.

"నువ్వా!" అన్నా రాయన ఆశ్చర్యంతో. కూతురూ, ప్రభాకరం, కలిసివచ్చారన్నది యిప్పుడు గ్రాహ్యమయింది. "ఔనండీ! మీరు అంటున్న ప్రతి పదం విన్నానండీ! కాని, నేను బాధపడేది ఒక్కటే; మీ వంటి అభ్యుదయ భావాలుగల వ్యక్తి, ఇలా ప్రవర్తిస్తారని అనుకోలేదు. మానాన్నా, మీరూ, యే విషయం గురించి విరోధపడ్డారో, యెవరిక్కావాలి? మీ తొందరపాటుకి, అమాయకులమైన మేం బాధపడాలా? ఇదెక్కడి న్యాయమండీ! అదీ గాక, ఐకమత్యత అవసరమని యిప్పుడే కొద్ది గంటల క్రితమే, వేదికపై నుంచుని వుపన్యాసమిచ్చారే; మనలోని విభేదాలను పారద్రోలాలని చెప్పారే మరి, అవన్నీ యిప్పు డేమయ్యాయండీ? మీ మాటలకీ, చేతలకీ, సమన్వయం వుండదా? మీ వంటి ప్రసిద్ధవ్యక్తే యిలా ప్రవర్తిస్తే, మిగతావారి విషయం, యింకేం చెప్తాం? దేశంలోని ప్రతివ్యక్తీ, యేదో ఒక విభేదాన్ని మనసులో పెట్టుకుని ప్రవర్తిస్తే, యింకా దేశంలో ఐక్యత కావాలంటే, యెలా సాధ్యపడుతుంది చెప్పండి? ఇప్పుడు మీ పట్టుదలనూ, మీ రిప్పుడు సుజాతతో అన్న మాటల్నీ, నేను బైట పెడితే, మీకు యేం విలువ వుంటుంది చెప్పండి? మిమ్మల్ని గౌరవంగా చూసిన

ప్రజానీకం, మీగురించి యేమనుకుంటారు? ఉపన్యాసాలు యివ్వడం కాదుసార్ కావల్సింది, చెప్పినవి కార్యరూపంలో పెట్టడం! అప్పుడే వ్యక్తి విలువ పెరుగుతుంది." నిశ్చలంగా చెప్పారు ప్రభాకరం.

మహేశ్వర్రావుగారికి కోపం యినుమడించింది, ఎర్రగా చూశారు ప్రభాకరం కేసి.

"అంటే, నాకు విలువలేదనే నీ వుద్దేశమా? ఏమిటి నీ పొగరుబోతుతనం, నీకేం మతిపోయిందా? నా యింట్లో నుంచుని, నన్నే తూలనాడుతున్నావా? తక్షణం ఇంటి నుండి బైటికినడు...వూ!..." గర్జించారు మహేశ్వర్రావుగారు.

"నాన్నా?'' అంటూ వారించబోయింది సుజాత.

''నువ్వు నోర్ముయ్. నీ వల్లనే విషయం యింత మేరకు వచ్చింది.'' అన్నారు మహేశ్వర్రావుగారు.

ప్రభాకరం చిన్నగా నవ్వేడు. ''మీరు అనవసరంగా ఆవేశపడుతున్నారండీ, మీరు చెప్పనవసరం లేదు. నేనే వెళ్ళిపోతాను. కాని, ఒక విషయం గుర్తుంచుకోండి. మన విభేదాలు ఇలానే కలకాలం వుండాలని మీరు కోరితే, మీ పరపతి దెబ్బతింటుందని మాత్రం గ్రహించండి. రేపే పత్రికలో మీ గురించిన వ్యాసం ప్రకటింపజేస్తాను. మీరు చెప్తున్న శ్రీరంగ నీతులకీ, బోధనలకీ, ఆచరిస్తున్న చేష్టలకీ, యెక్కడైనా సామ్యం వుందో లేదో, ప్రజలే గుర్తిస్తారు. వస్తా..." అంటూ వెళ్ళబోయాడు ప్రభాకరం.

మహేశ్వర్రావుగారిలో, ప్రభాకరం మాటలు, పాదరసంలా ప్రవహించాయి. ప్రజల్లో తన గౌరవమే ప్రధానం మహేశ్వర్రావుగారికి. ప్రభాకరం అన్నంత పనీ చేస్తాడన్న నమ్మకం యేర్పడిందతనికి. ఆయనలో కలవరం వుత్పన్నమయ్యింది. నిజమే. తనలాంటి వ్యక్తి, పట్టుదల పట్టి కూర్చోవడమేమిటి?

"ఆగవోయ్!" వెళ్ళిపోతున్న ప్రభాకరంని పిల్చారు మహేశ్వర్రావుగారు. ప్రభాకరం దగ్గరగా వచ్చాడు.

''నిజమేనోయ్ ప్రభాకరం! నువ్వన్నది నిజం. నేను చెప్తున్నదానికీ, చేస్తున్నదానికీ, యెక్కడా పొత్తులేదు. అది నా బలహీనతే! నేనే ఓడిపోయాను. దేశంలో ప్రతిపౌరుడు పట్టుదలలూ, పగలూ త్యజించిననాడే, దేశం ఒకటిగా నిలబడుతుంది. అప్పుడు మనం ఎటువంటి క్లిష్టపరిస్థితినైనా యెదుర్కోవచ్చు. మీనాన్నతో నాకు విరోధం అవాంఛనీయం. నేనే ముందు ఆదర్శం చూపాలి. రేపే మీ యింటికి వచ్చి మీ నాన్నని కలుసుకుంటాను. చాలా వేళయింది—వెళ్ళిక,'' అంటూ ప్రభాకరం భుజం తట్టారు మహేశ్వర్రావుగారు.

ప్రభాకరం, మహేశ్వర్రావుగారిలో హఠాత్తుగా కలిగిన పరిణామానికి ఆశ్చర్యపోయాడు. సుజాతకేసి చూస్తూ, తృప్తిగా నవ్వుకున్నాడు.

"వస్తానండీ!''

నిష్క్రమించాడు ప్రభాకరం.

సుజాత, మొహం దించుకుని, ఇంకా అక్కడే నుంచుంది. ఆమె చేతిలో వున్న రజితపాత్ర మిలమిల మెరుస్తోంది. ఆమెలో చెలరేగిన తుపాను తగ్గింది.

''వెళ్ళమ్మ, నిద్రపో,'' నా తొందరపాటుకి నేనే సిగ్గుపడుతున్నాను.'' కూతురికి దగ్గరగావచ్చి, తలనిమురుతూ అన్నాడు మహేశ్వర్రావుగారు.

సుజాత హృదయం తేలికపడింది. మెల్లగా అక్కణ్ణించి జారుకుంది.

మహేశ్వర్రావుగారు సోఫాలో కూలబడి, తనలో తనే నవ్వుకున్నారు. ఆరోజు తను మరో మంచిపని చేశాడన్న తృప్తి యేర్పడిం దతనిలో. ఉత్సాహంగా లేచి పడకగది కేసి నడిచాడు.

# నన్నెచోడునికవితపై తమిళకన్నడ భాషల ప్రభావము

*లింగంనేని బసవశంకరరావు*

నన్నయాది ఇతర ప్రాచీనకవు లందఱి కవితపైకంటెను నన్నెచోడుని కవితపై తమిళ కన్నడ భాషల ప్రభావ మెక్కువగా గోచరించు చున్నది. నన్నెచోడునికి తమిళ కన్నడ భాషల వాఙ్మయముతో నెక్కువ పరిచయముకలదు. ఇతడు ఆ భాషనుండి వాఙ్మయ రీతు లెన్నిటినో గ్రహించి తన గ్రంథమున వాటిని ప్రవేశ పెట్టినాడు.

నన్నెచోడుని తండ్రియగు చోడబల్లి ఇరువదియొక్క వేయి గ్రామములు కలిగిన పాకనాటి కధీశుడగుటచేతను, పాకనాడు తమిళ కన్నడ దేశములకు దగ్గఱగా నుండుట చేతను ఆ దేశ భాషలతో వారికి నెక్కువగా పరిచయ ముండెడిది. రాజకీయముగా సంబంధము గలదు. సంస్కృతి ఈ మూడు దేశములకు నొకేవిధముగా నుండెడిది. శైవమతము తమిళ దేశమునందు కొంతవఱకు ప్రవేశించి యుండుటచే శైవ మతస్థుడగు నన్నెచోడునికి అభాషతోను, వాఙ్మయముతోను సంపర్క మేర్పడినది.

పశ్చిమ చాళుక్యుల సోదరుడు వేంగీ దేశమును జయించి స్వతంత్రుడై తూర్పు చాళుక్య రాజ్యమును స్థాపించెను. పశ్చిమ చాళుక్యరాజుల శాసనములు కన్నడమున, తూర్పు చాళుక్యరాజుల శాసనములు తెలుగునను గలవు. పంప, పొన్న, రన్న ఇత్యాది వేంగీదేశస్థులు కన్నడ దేశమునకు వలసపోయి ఆ భాషయందు గ్రంథములు వెలయించిరి. తమిళ చోళులకును చాళుక్యులకును సంబంధ బాంధవ్యము వివాహముల వలన నేర్పడినది. శాతవాహన, కాకతీయ, చాళుక్య. విజయనగర రాజులు కన్నడాంధ్ర దేశములను పరిపాలించిరి. వారి వలెనే నన్నెచోడుడు సుమారు ఆ పరిసర ప్రాంతముల నేలినవాడగుటచే కన్నడ దేశీయులతో వలెనే వారి భాషలతోడను వారి భాషా సంప్రదాయముల తోడను విశేషపరిచయమేర్పడినది. సంస్కృతిగాని సంస్కృత భాషా ప్రభావముగాని, రాజవంశములతోగల సంబంధ బాంధవ్యముగాని కన్నడాంధ్ర దేశములకు తమిళ దేశములకంటె విశేషముగా నుండుటచే కన్నడభాషా సంప్రదాయములు తమిళముకంటె ఈ గ్రంథమునం దెక్కువగా ప్రవేశించినవి. ప్రాచీనాంధ్ర కవులకు కన్నడభాషా వాఙ్మయముతో పరిచయ మున్నంతగా తమిళ వాఙ్మయముతో లేదు. ఆంధ్రకవులు కన్నడ వాఙ్మయమును చక్కగా పరిశీలించిరి. నన్నయాదులకు సహితము కన్నడభాషా ప్రభావము లేకపోలేదు.

తమిళ భాషనుండి ఈ మహాకవి గ్రహించిన వాఙ్మయభాషా సంప్రదాయములను గూర్చి కొంచెము ఇచ్చట ప్రశంసింతము.

*తమిళ వాఙ్మయ ప్రభావము :* ఈ కవి గజానన జన్మవృత్తాంతమును క్రీస్తుశకము పదవ శతాబ్దివాడగు 'జ్ఞాన సంబంధర్' అను తమిళకవి రచించిన 'తేవారము' అను గ్రంథమునుండి గ్రహించినాడు. తేవారమను తమిళ గ్రంథము నందలి ఈ క్రింది పద్యమును నొకించుక తిలకించుడు.

పెడియదన్ ఉరుఉమై కొళమిగు కరియదు
వడికొడు తనదడి వళుపడుం అవరిడర్
కడి గణపతివరం అరుళినన్ మిగుకొడై
వడివినర్ పయిల్ వలివలముఱైఇఱైయే"

మహాశివుడు మగయేనుగు రూపమును సతీదేవి ఆడయేనుగు రూపమును ధరించి క్రీడింపగా పుట్టినవాడును, 'వలివలం' గ్రామమున వసించినట్టి వాడును నగు గణపతి దానశీలురైన ప్రజల బాధలు, కష్టములు తొలగించి రక్షించుగాక యని ఈ పద్యముయొక్క తాత్పర్యము. ఈ విషయమే తమిళమునందలి 'వినాయక పురాణమునందు గూడ వర్ణింపబడినది. పైవిధము ననుసరించియే ఈ మహాకవి కూడ గజానను ని జన్మమును వర్ణించెను.

'సతీగరిణియగుడుఁ త్రిజగత్పతిగరిమై'
కూడి రమింపగా సద్యోగర్భంబున
''పురుషాకారముఁబటు మద
కరివదనముఁగుజ్జపాదకరములు లంబో
దరము హారినీల పర్ణముఁ
గరమొప్పతోఁదాల్చి విఘ్నకరుఁ డుద
యించెన్'' (1-107)

అని వినాయకుని జననమును చెప్పినాడు. పార్వతి నలుఁగుపిండితో బొమ్మనుచేసి జీవము పోయగా వినాయకుడైనాడని శివపురాణమునందును తెనుగు దేశము నందును ప్రచారము గలదు. వినాయకుడు గజవదనుడుగదా. గజవదను డగుటకు కారణము తమిళ భాషలో ప్రచారమున నున్న కథను గ్రహించిన సహేతుకముగా నుండునని భావించి ఈ కవి ఆ కథను తీసికొని యుండును.

స్త్రీల కేశపాశమును హస్తిహస్తముతో పోల్చుట సంస్కృతాంధ్ర గ్రంథములం దెచ్చటను గానరాదు. ఈ పోలిక తమిళ గ్రంథములగు 'జీవక చింతామణి' యందు 'పిడిక్కైక్కూన్దల్' అనియు 'అగనానూరు'లో 'పెడిక్కై యున్న పెన్నగన్ తీండి' అనియు కలదు. దీని ననుసరించి కవిరాజ శిఖామణి అష్టమాశ్వాసమున మునుల పరమేశ్వరునకు పార్వతీదేవి ప్రత్యంగవర్ణనము చేయుచున్న సందర్భమున 'వలకోటఁజెరిగిన వలరాజు హస్తిహస్తంబునుఁగేశపాశంబు నెనయొ' (12 ప) అని గిరిజ కచమును వర్ణించినాడు.

క్రమాన బండ్లకును నా వృక్షములపై నిలిచిన స్త్రీలకునుగల పోలికను నన్నెచోడుడు పెక్కుమారులు పేర్కొనినాడు.

'క్రమానబండులు సతులు కామరిగియాడు' 7-144.

''కరశాఖలఁ దరుశాఖలు
పరువడి నూదికొని నిలిచిపడతులు శోభా
కరమైరి తత్కుజంబుల
భరితంబైయున్న క్రమానబండులపోలెన్''
(9-115)

'కవిగమకి ప్రశంసేతుడు' (2-208) 'కవిగమకి వాగ్మిగాయక నట చింతామణి' (8-112) 'కవిగమకి బుధనిధానుడు' (11-1) అని కుమార సంభవ కావ్యమునందు కవిగమకి వాగ్మి ప్రశంస గావింపబడినది. ఈ ప్రశంస 'నవనీత పాట్టియర్' అను తమిళ అలంకార గ్రంథమున 'కవి, గమకన్, వాది, వాక్కి ఎన్డవగైయుం' అని పేర్కొనబడినది. ''కవిగమకి వాదివాగ్మియర్' అని కన్నడ గ్రంథములందును ప్రసిద్ధము గ నున్నది. ఈ కవిరాజ శిఖామణి ఈ నాలుగు విధముల కవులనుగూర్చి కన్నడము నుండిగాని తమిళము నుండిగాని గ్రహించియుండును. తిక్కనార్యుని ఉద్యోగపర్వము నందొక్క పర్యాయము తక్క, తక్కిన తెనుగు వాఙ్మయమునందెక్కడను ఈ చతుష్టయ ప్రశంస గాన వచ్చుటలేదు.

తమిళ వాఙ్మయమునందలి సాహిత్య వస్తు సంప్రదాయములనేకాక ఆ భాషా పదజాలమును సహితము ఈ కవి తన కావ్యమున ప్రవేశింప జేసినాడు. ఈ క్రింది పదజాలమును పరిశీలించుడు.

1. నాయి=కుక్క. తమిళము 'నాయి' 'దొంతులుసేరి నాయి దోర్ప నేర్చుఁగాక దియేమి సేర్ప నేర్చు' 1-29.

2. వేలగొను=దాస్యముచేయు; తమిళము 'వేలగొను' ''నీ పనిచినవాని వేలగొని పైబడఁ జేసెద'' 4-43.

3. కులిరుగొను=శైత్యము నొందు; తమిళము 'కులిరుగొను' ''కులిరుగొన మేన నొత్తిరి లలనలు పార్వతికి శీతల క్రియ వెలయన్'' 5-149.

4. కట్టాయము=నిర్బంధము చేయు; త 'కట్టాయము' ''ఇంక నాలికిఁ గట్టాయము సేయుచుండు డిదిమేలే'' 8-177.

5. ముడి = కిరీటము, తమిళము 'ముడి' ''శృంగార రాజ్యలక్ష్మికి ముడిఁ గలిపినగతి హంసతిలకంబుఁ గబిరిఁ బూన్చి'' 9-13

6. మలరులు = పువ్వులు; తమిళము 'మలర్' ''నవ్వులన్ మలరులకిచ్చి'' 0-108.

ఈ క్రింది రూపములుగూడ తమిళ భాషా రూపములని దోచుచున్నవి.

1. ''ఇక్కుముట్టి చక్కె నెక్కఁగ ముఱచి'' 2-73

ఇక్కు = నడుము Tamil Lexico : 'waist' 'Middle.'

2. నెక్కిరి శవసంకులమున 11-128
నెక్కిరి = క్రిక్కిరిసి
తమిళము 'నెక్కు' < నెరుక్కు 'to Puss,' 'to push,' of. నెరుక్కుం.

3. పేర్ బిందులు = 8-38, 8-173, 9-49, 11-58 = చెమట బిందువులు తమిళము 'వేర్వై'

4. నీయజ్ఞ ఫలము నీకిచ్చునట్టి పెద్దలెవరచ్చిన పేళ్ళయందు 2-24. తమిళము 'పేర్' of ఇత్తని పేర్ = ఇంతమంది తమిళమునుండి 'పేర్' తీసికొని బహువచనము కలిపియుండును. పైనిచ్చిన రూపములన్నియు తమిళభాషా వ్యవహారములో నున్నవి.

కన్నడ వాఙ్మయ పరిశీలనము : 1. కన్నడమున కవితకు సంబంధించి మార్గదేశిభేదములను పంప 'దేశియొళ్ పుగువుదు

పొక్కమార్గదొళె తర్పుదు' అనియు; రన్న 'సొగల్డు రసం మనం గొళిసె మార్గ మొదంబడె దేశి కబ్బి మంబగె గొళవింత పేల్దుదు' అనియు: మల్లికార్జునుడు సూక్తిసుధార్ణవమున 'పదవిన్యాసాన దేశి మార్గదవిలాసం రూఢి వెత్తంగ' అనియు పేర్కొనిరి. వీరి ననుసరించియే ఈ మహా కవి నన్నెచోడుడు మార్గదేశి భేదములను కవిత్వమునకు సంబంధించి పేర్కొని నాడు. 'దేశిమార్గములు దేశీయ ములుగా', 'మార్గకు మార్గము దేశీయ మార్గము' అని పేర్కొనినాడు.

2. నన్నెచోడుడు తన కావ్యము నందు వస్తుకవితను ప్రశంసించినాడు. వాల్మీకిని 'వస్తుకావ్య బ్జర్వి'గాను భారవి కవితను **'వస్తుకవిత'** గాను, ఉద్భటుని కుమార సంభవమ్మును 'గూఢ వస్తుమయ కావ్యము'గాను, పేర్కొనినాడు. కన్నడ మున పంప 'ఆది పురాణమును' వస్తు కవిత అనినాడు. నాగవర్మ 'ఛందోం బుధి'లో తనను వస్తుకవియని చెప్పికొని యున్నాడు. ఈ వస్తు కవితా భేదమును ఈ కవిరాజ శిఖామణి కన్నడ కవుల నుండియే గ్రహించియుండును.

3. ఈ కవిని పాల్కురికి సోమనకంటె పూర్వునిగా గ్రహించిన యెడల తెనుగు వాఙ్మయమునందు మొట్టమొదటిసారిగా 'జాను తెనుగు'ను గూర్చి ప్రశంసించిన వాడీతడేయగును. 'సరళముగాగ భావ ములు జాను దెనుంగున నాపు పెంపుతోఁ బిరిగూన' అని పేర్కొనినాడు. కన్నడ మున నయసేన కవి క్రీ. శ. 11-12 తన 'ధర్మామృతమున' గుణవర్మ 'జాణ్' తనమును ప్రశంసించినాడు. జన్నకవి 'యశోధర చరిత్ర'లో 'గుణవర్మనజా ణ్ణుడె'అని పేర్కొనెను. పలు వాఙ్మయ సంప్రదాయములను గ్రహించిన నన్నె చోడుడు దీనిని కన్నడ కవుల నుండియే గ్రహించినాడనుట సమంజసము.

4. ఈ కవి తన కావ్యము 'శ్రీవా ణీంద్రామరేంద్రార్చిత మకుటమణిశ్రేణి' అని శ్రీకారముతో ప్రారంభించి; మం గళ మహాశ్రీ' అని గ్రంథమును మరల శ్రీకారముతోనే ముగించినాడు. పంప కవి తన కావ్యమును భద్రం శుభం 'మం గళం' అని ముగించినాడు. దీనిని నన్నె చోడుడు అనుసరించి యుండును.

5. కావ్యమునందలి పూర్వాశ్వా సాంత పద్యములందలి విశేషణములు, పరాశ్వాసాది పద్యమునందలి విశేషణ ములు ఏకవిభక్తికములగునట్లుగా ఈకవి రచించినాడు. ఈ సంప్రదాయము ప్రాచీన కన్నడ కవులగు పంపాదులలో కానవచ్చుచున్నది. ఇట్లు చేయుటవలన కృతి పతికి కృతినాయకునకభేదము పాటింప బడుచున్నది. మరి కొన్ని సందర్భములలో కృతిపతికి కృతినాయకునితో నభేదమును పాటించి కథా భాగమున జేర్చినాడు. కన్నడమున, "గదా యుద్ధము" అను కావ్యమునందు కృతిపతికి కృతినాయకు డగుభీమున కభేదము పాటింపబడినది.

6. కన్నడ కవులు కథా సూత్రమును గ్రంథాంతమున పేర్కొనిరి. నన్నె చోడుడు శైలిని పాటించి కథా సూత్ర మును కథారంభమున జెప్పినాడు. 'సతి జన్మంబున్ గణాధీశ్వరుజననము దక్షక్రతు ధ్వంసము' (1-68) అని పేర్కొనెను.

7. కావ్య ఫలశ్రుతిని కన్నడ కవులు పేర్కొనిరి. దాని ననుసరించియే నన్నె చోడుడు గ్రంథాంతమున కావ్యఫల శ్రుతిని పేర్కొనినాడు.

వెలయ మత్కృతి సదువుచు వినుచు వ్రాయు ఠీశ్వరాంబికా గుహాలిత్తు లిప్పితములు ...(12-226.)

8. జైన సంప్రదాయసిద్ధమై కన్నడ భాషలోని జైన కావ్యములందు పేర్కొన బడిన 'భూషణాంగ వృక్షము'లను 'మండనాంగానోకహములు'గా ఈ కవి పేర్కొనినాడు.

'మనసు లురులు కొల్ప మండనాంగా నోకహములఁబోలె చూచు' (3-14) భూషణాంగ వృక్షములనగా కల్పవృక్ష ముల వంటివి.

9. నన్నెచోడుని పద్యమగు 'రవికుల శేఖరుండు కవిరాజ శిఖామణి కావ్య కర్త సత్యవిభుడి నన్నెచోడడటె'(1-57) అనునది రన్న కవి 'గదాయుద్ధము'లోని 'కృతిసెగళ్లి గదాయుద్ధం కృతిసీశ్వర చక్రవర్తి సాహసభీమం' అను పద్యమును పోలియున్నది.

10. 'శ్రీ వాణీంద్రామరేంద్రారుణ మకుటమణిశ్రేణి' అను చోడుని ఎత్తు గడ రన్న చేరచాపబడిన 'అజిత పురా ణము'నందలి 'శ్రీమన్నమ్రామరేంద్రా రుణ మకుటమణి' అను దాని ఎత్తుగడను పోలియున్నది.

11. నన్నెచోడుడు పేర్కొన్న 'కః కే నార్థికో దరిద్రః' యని గోసనంబులు పుచ్చి (11-59) అనునది పంపభారతము నందును గలదు.

12. ఈ కవి పేర్కొన్న 'అంధ్రిస్త నాపహాసులు (8-54) అను భావము పంపభారతము నుండి గ్రహించినదే. 'ఆంధ్రీనీరాంధ్ర బంధురస్తరహారనుహారం'

13. 'జముడు కుడిచి కక్కిన భంగిన్' (11-194) అను ఈ మహాకవి ప్రయో గము రన్న 'గదా యుద్ధము'నందలి 'జవ నుండు కాఱిదవోలె ఆయితేత్తం కురు

క్షేత్రదోశ్' అనుదానికి సరిపోవుచున్నది.

14. 'జొన్నలు గొన్న రుణంబు నీగెదన్' (11-42) అను చోడుని ప్రయోగం పంపభారతమునందును గలదు. "సంగర దళోజళద పాళియం నెరపిదం గండం పెఱంగండనే"

15. 'చీకులావుకం ద్రొక్కినయట్లు' (1-38) అను వాక్యమును చోడుడు కన్నడమునందలి 'జీవసంబోధిని' నుండి గ్రహించినాడు.

'కురుడంలావు గెయం మెట్టిదంతె' కుమార సంభవములోని 'సుఖసంకథా వినోదంబులం బ్రవర్తించు చుండె' (10-118) అనునది అనేక కన్నడ తెనుగు శాసనములలో గలదు.

యుద్ధారంభమున యుద్ధమున కనుజ్ఞ ఇచ్చుచు తమ తమ సైన్యములకు నాయకులు 'చేయు వీచుట'యు, యుద్ధ విరామమును ప్రకటించుచు 'కైవిగుట'యు కన్నడ కవుల నుండి గ్రహించినదే. కన్నడమున ఈ పదము 'కైవీసు' అను రూపముతో కానవచ్చుచున్నది. ఇట్లే కన్నడ వాఙ్మయ ప్రభావ మధికముగా కవిరాజ శిఖామణిమీద కలదనుటకు మరికొన్ని దృష్టాంతములను చూపవచ్చును.

ఈ కవిరాజు తన కావ్యమునందు కన్నడభాషా పదజాలమును సహితము తమిళ భాషా పదజాలమున కన్న నెక్కువగా ప్రయోగించినాడు. కొంత పదజాలమును కన్నడమున నుండినట్లే ఆ రూపములతోనే గ్రహించినాడు. మరికొన్ని పదములను తెనుగున కొంచెము మార్పు చేసి ప్రయోగించినాడు.

1. అగుర్పు = అతిశయము. కన్నడ రూపము "అగుర్వు," 'అక్కజమైమహార్థ నివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్, గ్రుక్కిదమైన సత్కృతి *యగుర్పగు* గాక' 1-38.

2. అగ్గడి=సిగ్గులేని. కన్నడము 'అగ్గాడి' 'ఒడలంటాసి చనదయ్యె *నగ్గడి* జీవమింక నేమి సేయుదాన' 5-92.

3. ఉప్పయనము ; ప్రయాణమునకు ముందు చేయు పరస్థానము, కన్నడము 'ఉప్పయణ.' "కొదమ తుమ్మెద లుప్పయనము సేసినట్టి యొఱపున నొప్పెన్ 3-70.

4. కాతరిల్లు = ఉత్సహించు. కన్నడము 'కాతరిసు.' శృంగారములు చేసి కామకేళి సలుపఁ*గాతరిల్లె* 1-98.

5. కెలసము = పని. కన్నడము 'కెలస' తమకుఁదారవచ్చి *కెలసంబు* సేసి నవారె కారె. 2-25.

6. కేనము = అరమరిక, అడ్డు, మాయ. కన్నడము 'కేణ.'

*కేనము* లేకను రక్తయైన భాషాంగన 4-46.

వెఱపు *గేనము*ఁ జెయ్యాల కోలినెత్తు వెట్టిదు 4-59.

7. కొలవేళ్లు = వట్టివేళ్లు కన్నడము 'కొలవేర్' *కొలవేళులు* నొఁదూఁదులు 5-149.

8. శీతలికలు కన్నడము 'శీతలిక' *శీతలికలు* పిక్కమూలములు....(5-136)

9. గుళ్లు: కన్నడము 'గుడి' = జెండా "కురిసె సుర పురమంతెల్ల *గుళ్లు* గట్టి" 10-104

10. గడనములు = సమూహములు కన్నడము 'గడణ' *గడనము* లైకారు మొగుళులు.... (12-18).

11. చప్పరించు = తట్టుచు. కన్నడము 'చప్పరిసు' పెన్నేటి వేణులు *చప్పరించుచుం* 8-101

12. పరళు కన్నడము 'పరళు' *పరళు* లెత్తియున్న పరుషంపు టొడళులు 6-37.

13 మేఘడంబరములు = గొడుగులు కన్నడము 'మేఘడంబర్'.

వలరాజ వల్లవ రచితోభయ *మేఘడంబరములు* పోలెన్ 3-57.

14. సడగరంబు = తొట్రుపాటు

కన్నడము 'సడగర'

'*సడగరంబున* లెమ్మోగి వీళులెత్తగాన్' 11-6

15. సేవరించు = కోపముతో చీత్కరించు కన్నడము 'సేవరిసు'

'శీత గిరి మీద మదకరుల్ *సేవరించు* నెలుగు' 3-7.

ఇట్లే కన్నడ సాహిత్య సంపర్కము వలన కల్గిన కావ్యములోని మరికొన్ని కన్నడ పదములు: అబ్బగింపక, అరవి, ఎలరారు, కలుచు, కలువడగలు, కాద పూవులు, పీలితొంగళ్లు, ప్రాలేయకుత్కిలము, కెడ్పెరసు, పిక్కమూలములు, సంబవులిడు, గండబేటము, చేతరించు. (క. చేతరిసు) ; ఛత్రమపేరుహాళి, జయచూళి, జల్లితొంగళ్లు, తనిరేకులు, తలతంత్రము, తానదీవియలు, తిట్టంబు, తుంతుర్వని, లంబనములు, పేర్బిందులు, వేడి పరవాళులు, తొంగలి పట్టియ, బడరుడు, విగ్గోరు దీఁగలు, రాగదీవియలు, వెడసీర, మదకరులు. ఇట్లే మరికొన్ని పదములును గలవు.

కవిరాజ శిఖామణి బిరుదాంకితుడగు నన్నెచోడ మహాకవి తమిళ కన్నడ వాఙ్మయములతో నతి పరిచయము కలవాడగుటచే వారి వాఙ్మయ భాషా సంప్రదాయములకు తన కావ్యమున ప్రవేశము కల్గించినాడు. కేవల తమిళ కన్నడభాషల తోడి పరిచయస్థుడగుటయే కాక ఆ భాషలయందు పండితుడను అగుటకు కుమార సంభవ కావ్యమునందలి తమిళ కన్నడ భాషల నుండి గ్రహించిన సంప్రదాయములే తార్కాణము ★

# ఇది నీదేశము

సి. వి. సుబ్బన్న శతావధాని

సీ॥ ఇది నీదేశము, అంగుళంబయిన లేనే లేదురా, నీదికా
నిది భూభాగము; భూరియంత్రములుగానీ, పాఠశాలా మహా
సదనశ్రేణులుగాని, తోఁటలు నదీ సంతప్త సేతూరు వి
ద్యుదగారాదులుగాని, వేని వని నీ వూహింతు విప్పట్టునన్?

చ॥ మొనసి ప్రజాప్రభుత్వమున భూమి సమస్తము క్రొంబసిండి పం
డి, నవనవోదయ ప్రసవ నిర్భరతన్ గనునంచు నెహ్రుజీ
వినుత పథమ్ముఁ దీర్చి, యుడువీథిఁ జనెన్, మననాయకుండు చూ
పిన గతి నెల్లమానవులు వ్రేలెఁడు దప్పక పూనుటొప్పగున్.

చ॥ తొడరి ప్రభుత్వపున్ రథముఁ దోలు మహాత్ములు తోత్రహస్తులె
క్కుడఁబడ నక్కడే హయనికాయముఁ బాఱఁగ నీక చూచు నె
ప్పుడును బొనర్పు ధర్మమగు; బుద్ధి మదగ్రణులైన పెద్ద లే
ర్పడఁగని మంచిచెడ్డలఁ దిరమ్ముగ నిల్పుటపోలు నెల్లెడన్.

ఉ॥ ఆగతిఁగాక ధర్మమును న్యాయముఁ జుల్కన చేసి, సద్గుణ
త్యాగము స్వార్థభోగము మహాజనవంచన మున్నయాత్రయిన్
సాగుజనుల్ స్వదేశహిత శత్రులు; వారు విభుత్వ పీఠ సం
యోగ సమేధితాత్మ నిలయుల్ నరరూప పిశాచులెన్నఁగన్.

శా॥ ఔరా! డామర తస్కర ప్రకర ధీవ్యాసక్తి లేదయ్యె మా
ఖ్యా రాజ్యమ్మున-నీకు మేలెవఁడుగూర్పన్ గంకణంబూనె, వాఁ
డే రాజద్గతి నీ మెడన్ గోటికి చండించున్ స్వకీయోదరో
దారక్రోడము నిండి వాఁడ కనునో తాఁ జక్రవర్తిత్వమున్.

శా॥ ఈ వ్యాపారము నిర్నిరోధముగ నిర్లేపాఁగ నేమౌనొ దే
శవ్యుత్థానము; కంచెమేసెనన సస్యంబెల్ల సౌవాధికా
ర వ్యత్యస్తము గాకయుండ, ధరణీ రాజ్యమ్ము పౌరాళి క
ర్తవ్యం బుజ్జ్వల నీతికౌశలము మీఱన్ నిర్వహింపందగున్.

చ॥ ఒకఁడను నేననంగ వల దొక్కఁడ వేమిటి నీవు విష్ణుమూ
ర్తికరణి సర్వదేశ నిబిరస సమష్టి మనుష్యవర్తి వ
ల్గి కనుగొనన్ విభుత్వమది లేదు; స్వశక్తి యొఱంగి ధర్మదీ
పక రమణీయ మార్గమున భారతమాత భజింపు మింపుగన్.

# పంచాయతీరాజ్ ప్రగతి

బూరుగడ్డ నిరంజనరావు

భారత దేశం మొత్తం మీద ప్రస్తుతం 5,33,000 గ్రామాల్లో పంచాయతీలు ఏర్పడ్డవి. అంటే దేశంలో మొత్తం గ్రామీణ జనాభాలో నూటికి 95 వంతుల మంది పంచాయతీ పరిపాలన క్రింద ఉన్నారన్న మాట. ఒక్కొక్క పంచాయతీలో ఒకటి అంత కంటె అధిక సంఖ్యలో గ్రామాలు చేర్చబడినవి. ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమంగా పంచాయతీ రాజ్యం 1958 నవంబరు 1వ తేదీన అమలు చేయబడింది. రాష్ట్రమంతటా గ్రామ పంచాయతీలు ఏర్పడినవి. యీ సంస్థలు మొత్తం 15,098–పంచాయతీలు కలవు. అస్సాం రాష్ట్రంలో పంచాయతీ చట్టం (1959) అనుసరించి పంచాయతీరాజ్ విధానము అమలు చేయబడుచున్నది. యీ రాష్ట్రంలోని గ్రామా లన్నింటికి పంచాయతీలు కలవు. బీహారులో 1961 డిసెంబరులో పంచాయతీ రాజ్ విధానము అమలులోకి వచ్చింది. యీ రాష్ట్రంలో 10,641 గ్రామ పంచాయతీ లున్నవి. గుజరాత్ రాష్ట్రంలో యీ సంవత్సరం ఏప్రియల్ 2 తేదీన రాష్ట్రమంతటా పంచాయతీ రాజ్ విధానం ప్రవేశ పెట్టబడింది. యీ రాష్ట్రంలో మొత్తం 10,750–పంచాయతీలు ఉన్నవి. జమ్మూ, కాశ్మీరులో రాష్ట్రమంతటా పంచాయతీలు ఏర్పడినవి. కాని రాష్ట్రంలో ఇంకా పంచాయతీ రాజ్ విధానం ప్రవేశ పెట్టవలసి యున్నది. కేరళ రాష్ట్రంలో 923 పంచాయతీలు మాత్రమే వున్నవి. యీ రాష్ట్రంలో పంచాయతీరాజ్ విధానం అమలు పరచుటకు త్వరలో శాసనం రూపొందింపబడనున్నది. మధ్యప్రదేశ్‌లో బ్లాక్, జిల్లా స్థాయిలలో పంచాయతీ




రాజ్ విధానము అమలు పరచటానికి రాష్ట్ర శాసనసభా మండలి ఒక బిల్లును మంజూరు చేసింది. యీ రాష్ట్రం మొత్తంలో 20,811 పంచాయతీలున్నవి.

మద్రాసు రాష్ట్రంలో 1960 జనవరి 1 నుండి మద్రాసు పంచాయతీ చట్టం (1958) రాష్ట్రమంతటా అమలు చేయబడింది. రాష్ట్రంలో ప్రస్తుతం 18 వేల గ్రామాలకు 12,583 పంచాయతీలు ఏర్పడినవి. మహారాష్ట్రంలో 1958 బొంబాయి పంచాయతీ చట్టం రాష్ట్రంలో అమలులో వుండి, మహారాష్ట్ర పరిషత్తులు, పంచాయతీ సమితుల చట్టం యీ మధ్యనే రూపొందింపబడింది. యీ రాష్ట్రంలోని పంచాయతీల సంఖ్య 19,399. మైసూరు రాష్ట్రంలో గ్రామ పంచాయతీలు లోకల్ బోర్డుల చట్ట ప్రకారం గ్రామ, తాలూకా, జిల్లా స్థాయిలలో పంచాయతీరాజ్ విధానము అమలు చేయుటకు వీలు కల్పించబడింది. యీ రాష్ట్రంలో 26 వేల గ్రామాలకు 7,500 పంచాయతీ లున్నవి. ఒరిస్సా రాష్ట్రంలో 1959లో చేయబడిన చట్టం అనుసరించి పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు కూడ ఏర్పాటు చేయబడినవి. యీ రాష్ట్రంలో 48 వేల గ్రామాలకు 2,342 పంచాయతీ లున్నవి. పంజాబు రాష్ట్రంలో గ్రామ పంచాయతీలతో పాటు గ్రామ సభలున్నవి. యీ రాష్ట్రంలో 13,466 పంచాయతీలున్నవి. రాజస్థాన్‌లో 1959 అక్టోబరు 2 నాడు రాష్ట్ర పంచాయతీ రాజ్ విధానం అమలు చేయబడింది. యీ రాష్ట్రంలో 7,393 పంచాయతీ లున్నవి. ఉత్తర ప్రదేశ్‌లో 1947 నుండి

గ్రామ పంచాయతీ లున్నవి. యీ రాష్ట్రంలో సుమారు 40 వేల పంచాయతీలు కలవు. పశ్చిమ బెంగాలులో గత డిసెంబరులో జిల్లా పరిషత్తు బిల్లు రూపొందింపబడింది. యీ రాష్ట్రంలో 6,100 పంచాయతీ లున్నవి. ఢిల్లీ, హిమాచల్ ప్రదేశ్‌లలో పంచాయతీలు ఏర్పాటు చేయబడ్డాయి. అండమాన్, నికోబార్ దీవులలోనూ, మణిపూర్, త్రిపురాల లోను పంచాయతీలు ఏర్పడుతున్నవి. యూనియన్ టెరిటరీ ప్రాంతంలో పంచాయతీ రాజ్ విధానం అమలు జరుపుటకు వీలుగా రాజ్యాంగంలో సవరణ చేయబడింది. దీని ప్రకారం హిమాచల్ ప్రదేశ్, త్రిపుర, మణిపూరు, పుదుచ్చేరి, గోవా, డయ్యు, డామన్‌లలో పంచాయతీ రాజ్ విధానం అమలు జరుపబడుతోంది. దేశం మొత్తం మీద పంచాయతీ రాజ్ పురోగమిస్తున్నదనుటలో అతిశయోక్తిలేదు.

పంచాయతీ రాజ్య పరిపాలనా పద్ధతి మన దేశంలో యీనాటిది కాదు. ఇది అతి ప్రాచీనమైనది. ప్రజల సౌభాగ్యానికి, దేశ క్షేమానికి, ప్రజాస్వామ్య సాఫల్యతకు నిర్ణయింపబడిన చక్కని విధానమిది. యీ పంచాయతీ శబ్దం నిజంగా అమోఘమైందేగాదు, అత్యుత్తమమైనది. గ్రామీణులు తను సంక్షేమానికి, అభ్యుదయ పథ ప్రదర్శనానికే సమిష్టిగా, స్వేచ్ఛగా నిర్ణయించుకొనే "పంచ్" అయిదుగురు పెద్దలతో కూడుకొనిన సంఘమిది. యీ పెద్దలంతా గ్రామ శ్రేయోభిలాషులే కాదు. నిష్కామ సేవాపరులు కావడం వలననే ఆనాడు పంచాయతీ రాజ్యం సత్ఫలితాలు ఇవ్వగలిగింది. దేశంలో వుండే అసంఖ్యాకమైన గ్రామ ప్రజా స్వామ్యాల పరిపాలనకు ఏర్పడిన విధానమే యీ ప్రాచీన పంచాయతీ విధానము. ఇది ఎన్నో శతాబ్దాల నుండి మన దేశంలో అమలులో వుంది. కాని బ్రిటిష్ పరిపాలనలో దీనికి పెద్ద అఘాతమేర్పడినది. వారు అవలంబించిన "విడదీసి పరిపాలించు" సూత్రాన్ని వీరు గ్రామాలలో ప్రయోగించిరి. గ్రామాలు చిన్నాభిన్నమైనవి.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశపు పురోభివృద్ధికి పంచవర్ష ప్రణాళికలు అమలు చేయబడుచున్నవి. పంచవర్ష ప్రణాళికలను జయప్రదంగా అమలు పరచుటకు ఒక గొప్ప ప్రజా ఉద్యమం ప్రారంభింపవలసి వచ్చింది. స్వాతంత్ర్య సమర కాలంలో ప్రజలలో ఎంత చైతన్యం వచ్చిందో దాదాపు ఆ స్థాయిలో తిరిగి ప్రజలను నిర్మాణాత్మక సమస్యలను గురించి మేల్కొలపవలసి వచ్చినది. దీక్ష, త్యాగనిరతి, ప్రగతి సాధన సంకల్పంతో ప్రజల్లో ఏర్పడిన ప్రణాళికా కార్యక్రమాలు నిరాటంకంగా సాగుటకు ప్రజలలో వీటి పట్ల అభిమానం పుట్టుటకు, వారిని ఏకోన్ముఖంగా కృషికి ప్రోత్సహించే ఒక ఉన్నత లక్ష్యం నిర్వచించుకోవలసి ఉంటుంది. దానిని వారికి అర్థమయ్యే భాషలో వివరంగా ప్రచారం చేయవలసి వుంటుంది. మన దేశములోని ప్రజలు తరతరాలుగా దారిద్ర్య బాధతో చైతన్యాన్ని కోల్పోయి, నిస్పృహతో, నిస్సహాయస్థితిలో కాలము గడుపుతున్న సమయమిది. అటువంటి వారిలో నూతనోత్సాహాన్ని పురికొల్పి కార్యశూరత కల్పించటానికి పన్నెండు సంవత్సరాల క్రితం స్థాపించిన సమాజాభివృద్ధి కార్యక్రమం ఎంతగానో దోహదం చేసింది. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజలలో బాధ్యతలతోపాటు అధికారాలు కూడా వుండాలి. అందుకే బల్వంత్ రాయ్ మెహతా కమిటీ వచ్చి ప్రజలకు తక్షణం అధికారాలు ఇవ్వాలని సూచించింది. దానితో భారతదేశ మొత్తం మీద తొలిసారిగా మన రాష్ట్రంలో పంచాయతీ రాజ్య వ్యవస్థకు అంకురార్పణ జరిగింది. దీనికి ప్రజలు హృదయపూర్వకంగా స్వాగత మిచ్చారు.

సర్వతోముఖంగా గ్రామోద్ధరణ జరుగుటకు గ్రామ జీవితాన్ని ఆర్థికంగా, సాంఘికంగా, ఇతరత్రా శుభవంతం చేయడానికి ఏర్పడిన పథకమే పంచాయితీ రాజ్యం. నాలుగు సంవత్సరముల క్రితం పంచాయితీ రాజ్య పథకం ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రవేశపెట్టబడి క్రమేపి వృద్ధి పొందింది. గ్రామ పంచాయితీలు, పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులు ఏర్పడినవి. రాష్ట్ర మొత్తంమీద ఇప్పటివరకు 15,098 పంచాయితీలు ఏర్పడినవి. మొత్తం రాష్ట్రం 448 బ్లాకులుగా విభజింపబడినవి. 446 బ్లాకులలో పంచాయితీ రాజ్య కార్యక్రమాలు ప్రారంభింపబడినవి. జిల్లా స్థాయిలో ప్రతి జిల్లాలోను పరిషత్తులు మొదటినుండి ఏర్పడి పనిచేయుచున్నవి. పంచాయితీ రాజ్య లక్ష్యాలను, అందుకోడానికి కావలసిన కార్యక్రమాలను ఏర్పాటు చేయబడి నిర్వహించడంలో అనుభవం, ప్రజ్ఞ, విశ్వాసం గడించాయి. కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాల ఆదేశాల ననుసరించి స్థానిక అనుభవాలు, అవసరాలను వీటితో సమన్వయించి పంచాయితీలు, సమితులు, జిల్లాపరిషత్తులు గ్రామాభివృద్ధికి, గ్రామీణ ప్రజల సాముదాయకాభివృద్ధికి కృషి చేస్తున్నాయి. మనదేశంలో గ్రామమే

జీవితానికి పునాది. దేశాభివృద్ధికి మూలమైనది గ్రామమే. గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి కృషిచేయు లక్ష్యంతోనే పంచాయితీ రాజ్యం అమలుచేయబడుచున్నది.

గత నాలుగు సంవత్సరముల నుండి పంచాయితీ రాజ్యము వలన గలిగిన ఫలితము లేమి? మంచి ఫలితములు ఏమైన ఇప్పటి వరకు కలిగినవా? నేటి పరిణామమ్ము లేమి? కష్టములు ఏమైన ఎదుర్కొనవలసివచ్చినవా? వాటిని తొలగించుటకు మార్గము లేమైన కలవా? మున్నగునవి మనము ఆలోచింపవలసి యున్నది. 1959 సం. లో పంచాయితీ రాజ్యం అమలు చేయబడినది. అంతకు ముందే 1951 లోనే ప్రథమ పంచవర్ష ప్రణాళిక అమలు చేయబడినది. పంచాయితీరాజ్యం అమలు చేయబడిన నాటికి 8 సంవత్సరములైంది. అప్పుడున్న సంఘములు సలహా సంఘములుగా మాత్రమే వ్యవహరింపబడుచుండెడివి. అందువలన అధికారుల యందే ఎక్కువ బాధ్యత కలిగి వుండెడిది. అందువలన ప్రజలలో సరియైన చైతన్యము రాలేదు. ప్రజలనుండి రావలసిన సహకారము ఎంత ప్రయత్నించినను పూర్తిగ రాలేదు. ఉద్యోగులు ఎంత ప్రయత్నించినను ప్రజలలో ఉత్సాహము కలుగలేదు. కాని పంచాయితీరాజ్యం అమలు జరుపబడిన రెండు మూడు ఏండ్లలో ప్రజల నుండి సహాయం రావటం ప్రారంభించింది. ప్రజలలో నూతన చైతన్యం కలిగినది. శ్రమదానం ఐచ్ఛికంగా రావటం మొదలైనది. ఇది ఎంతో శుభ సూచకం కాదా?

పంచాయితీరాజ్యం నూతన నాయకత్వం సృష్టించినది. ప్రజలలో నూతన చైతన్యము కలిగినది. గ్రామాభివృద్ధి పట్ల ప్రజలలో ఆసక్తి క్రమ క్రమంగా ఎక్కువగుచున్నది. యువక నాయకత్వమునకు పునాది ఏర్పడినది. ఎంతో మంది సమితి అధ్యక్షులు యువకులు, విద్యార్థులు వున్నారు. వీరు నిస్వార్థంగా ప్రజలకు సేవ చేయుచున్నారు. ఇచ్చిన అధికారమును సద్వినియోగము చేయుచున్నారు. పంచాయితీ అధ్యక్షులు ఇదివరకన్న చురుకుగ పని చేయుటకు ప్రారంభించారు. ఎవరు ఎంత కష్టపడిచేసిన అంత గ్రామాభివృద్ధికి మార్గములు కలవని వారు తెలిసికొనినారు. పంచాయితీ సమితి సహాయం లభించ గలదనే ఆశాభావము వారిలో కలిగినది. పూర్వము నుంచి వచ్చుచున్న గ్రామీణ నాయకత్వమును కాదని కొత్త నాయకత్వమును సృష్టించలేకున్నారు. సమితి జిల్లా పరిషత్తు స్థాయిలు రాజకీయ పార్టీల సిద్ధాంతాలపై సభ్యులు వ్యవహరించుచున్నారు. కాని గ్రామ స్థాయిలో పూర్వంనుంచి వచ్చుచున్న నాయకత్వానికి ప్రత్యమ్నాయ నాయకత్వము సృష్టించలేకున్న దను భావము కలుగుటకు అవకాశము ఏర్పడినది. గ్రామ పరిపాలన యందు అనుభవము కొందరికి కలుగుచున్నది. మరి కొందరికి సమితి పరిపాలనయందు అనుభవము కలుగుచున్నది. పంచాయతీ రాజ్యము నందుగల త్రిచక్ర విధానమునందు ఎందరో బాధ్యతాయుతమగు పదవులలో నున్నారు. వీరందరికి యీ త్రిచక్ర విధానమునందుగల స్థానిక సంస్థలు పరిపాలనలో శిక్షణ కేంద్రాలుగా పనిచేయుచున్నవి. ఉత్తరోత్తరా వీరు బాధ్యత కల ఉన్నత పదవుల నలకరించుటకు గాను తయారగుటకు యీ క్షేత్రములు ఎంతో ఉపయోగ పడుచున్నవి. ఇది ఎంతో మంచి ఫలితం కాదా?

పంచాయితీరాజ్యము అమలు జరుపబడిన తరువాత అధికారులకు అనధికారులకు ఉన్నంత సన్నిహిత సంబంధములు ఇదివరకెన్నడు గోచరింపలేదు. అధికారులు మేమేదో గొప్ప యని కొందరు వ్యవహరించుచుండెడివారు. ఇటీవల యీ భావము పూర్తిగ తొలగిపోయినది. దేశపురోభివృద్ధికి ఇరు వర్గముల వారు కష్టించి పనిచేయవలెనని గుర్తింపబడినది. కనుకనే అధికారులు అనధికారులు కలసి ఇప్పుడు పనిచేయుట ఎంతో సహాయకారి కదా?

వ్యవసాయ రంగమునందు,పశుపోషణ యందేమి. కుటీర-పరిశ్రమల అభివృద్ధి యందేమి, సహకార రంగము నందు సాంఘిక విద్య మున్నగు విషయముల యందు ప్రజలకు అభిరుచి కలుగసాగినది. స్వయంకృషి, పరస్పర సహకారము యీ రెంటిని పంచాయతీరాజ్యం అభివృద్ధి చేయుచున్నదని స్పష్టపడుచున్నది. తరతరాలుగా నశించిపోయిన ఆత్మ విశ్వాసం పునరుద్ధరింప బడుచున్న దనుటలో అతిశయోక్తి లేదు. ఇటీవల కలిగిన అత్యయిక పరిస్థితిలో దేశ రక్షణ కృషికి పంచాయితీరాజ్య వ్యవస్థలు అమోఘంగా కృషి చేయుచుండుట మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము.

ఐతే ..పంచాయితీరాజ్యం'' అమలు చేయుటలో అనేక కష్టములు కూడ ఎదుర్కొనవలసి వచ్చుచున్నది. ఆర్థిక యిబ్బంది ముఖ్యము అయినది. పంచాయితీరాజ్య వ్యవస్థలకు ఆర్థిక వనరులు తక్కువగా నున్నవి. అందువలన ప్రజలకు చేయవలసిన సౌకర్యములు చేయలేక పోవుచున్నవి. రాజకీయ అభిప్రాయములు

కూడ కొంతవరకు అద్భుతగులు చున్నవి. గ్రామ స్థాయిలో పతురహితముగ ఉండవలెనను సిద్ధాంతము అక్షరాలా అమలు చేయలేకున్నారు. అందువలన కొంత ప్రతిబంధకము కలుగక తప్పుటలేదు. మన ముఖ్యమంత్రి ఇటీవల ఒక సభలో ఉపన్యసించుతూ ప్రణాళికులకు ఎంతో ఖర్చు చేయుచున్నాము కదా! ఇందుకు తగిన ఫలితము లభించుచున్నదేమో పరిశీలించవలసి యున్నదని తెలియజేసి యున్నారు. ఖర్చుకు తగిన ఫలితము లభించినపుడే పని సార్థకము కాగలదు.

ప్రణాళికల రూపమున చేయుచున్న వ్యయము సద్వినియోగము కావలసి యున్నది. ఇట్టి లోపములు కొన్ని ఉన్నను నేడు పంచాయితీ రాజ్యముకన్న మంచి పథకము కనుగొనుట దుర్లభమని స్పష్టపడినది. కనుకనే "పంచాయితీరాజ్యం" దేశమంతటా అమలు జేయబడుచున్నది.

పంచాయితీరాజ్య వ్యవస్థ అంటే ప్రజాస్వామ్య వికేంద్రీకరణ అని అందరికి తెలిసినదే. అనగా బాధ్యతలు, విధులు చాలమందిపై వుంచి వర్తింప చేయుటన్న మాట. పంచాయితీరాజ్యం కేవలం ఒక పథకం మాత్రమే కాదు, ఇది ఒక ఉద్యమం. పదవుల పంపిణీ కాదు, ప్రణాళికా నిర్వహణ, అదనపు వనరులను కల్పించే విధానము మాత్రమే కాదు, ప్రతి ఒక్కరికి తిండి, గుడ్డ, నివాసము కల్పించే సాధనము ఇది. బ్రహ్మాండమైన యీ ఉద్యమము భారత దేశములో నడుపబడుచున్నది. భారత దేశపు అధినేత కీ॥ శే॥ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ప్రధాన మంత్రిగ యీ ఉద్యమమునకు నాయకత్వం వహించినారు. మన ప్రభుత్వము వారు మన రాష్ట్రమునందీ ఉద్యమమును కడుసమర్థతతో నడుపుచున్నారు.

పంచాయితీరాజ్ సంస్థలను యీ లక్ష్యసిద్ధికి నడిపించుట కేవలము పరిపాలనా సూత్రాలు, చట్టనిబంధనలు మాత్రమే కాదు. మానసిక సంసిద్ధత, దీక్షా సంకల్పాలు అవసరం. దేశం మొత్తంమీద ప్రారంభించిన ప్రథమ ప్రయత్నం ఇది. నాలుగు సంవత్సరాల మన అనుభవం ఆశాజనకంగా ఉన్నది. నూతన కార్యక్రమాలను రూపొందించుటలో దైనందిన కార్యక్రమ నిర్వహణంలో అనుభవాలను సమీకరించుకుంటూ, లోపాలను సరిదిద్దుకుంటూ నిర్మాణయుతముగ వ్యవహరించుచు పంచాయితీ రాజ్యమునందు పురోగమించాలి. ✲

# 'రణభేరి'

విఖ్యాతాంధ్రకవులు
జాతీయైక్యత, రక్షణోద్యమ సందేశాలతో రచించిన ఉత్తేజకరాలైన
గేయముల రెండవ సంపుటి:

**వెల 00-25 న.పై.**

*ఇతర ప్రచురణలు :*

| | | |
|---|---|---|
| శంఖారావం: (గేయాలు) | 0-25 | పై. |
| కనువిప్పు : (బుర్రకథ) | 0-25 | ,, |
| చైనాద్రోహం: వీరభారత్ (బుర్రకథలు) | 0-25 | ,, |
| పాంచజన్యం: (బుర్రకథ) | 0-25 | ,, |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | రూ. 2-75 | ,, |
| వందేమాతరం: (నాటిక) | రూ. 1-00 | |
| అగ్గిగుండెలు-మరి రెండు నాటికలు | రూ. 1-00 | |

ప్రతులకు:
సమాచార ప్రజాసంబంధాల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్

అక్టోబరు 14 వ తేదీన రాష్ట్రపతి రాజధానికి వచ్చిన సందర్భంలో ఆయనకు బేగంపేట విమానాశ్రయంలో గవర్నరు, ముఖ్యమంత్రి, మేయరు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి స్వాగత మిస్తున్నారు.



ముఖ్యమంత్రి, రాష్ట్రపతిని పుష్పమాలాలంకృతుని చేస్తున్నారు.

రాష్ట్రపతి బొలారంలోని ఇ. ఎం. ఇ. కేంద్రంలో 'పతాకాన్ని' అందజేస్తున్నారు.





వివిధ మతాలవారు పతాకాన్ని దీవిస్తున్నారు.



ఐ. ఎం. ఏ. కేంద్రంలో సైనికులు రాష్ట్రపతికి గౌరవ వందనం సమర్పిస్తున్నారు.



వందనస్వీకారం చేస్తున్న రాష్ట్రపతి.

రాజ్‌భవన్‌లో మాజీ సైనికులను రాష్ట్రపతి పరామర్శిస్తున్నారు.



అక్టోబరు 15 వ తేదీన 'రాధాకృష్ణ బాలల గృహా'న్ని రాష్ట్రపతి సందర్శించారు.



రఘుపతి వెంకటరత్నం నాయుడు శతజయంతి ఉత్సవ సందర్భంగా రవీంద్రభారతిలో ఉపన్యసిస్తున్న రాష్ట్రపతి.



ఇ. ఎం. ఇ. కేంద్రంలో రాష్ట్రపతి ఇష్టాగోష్ఠి జరుపుతున్నారు.



అక్టోబరు 16వ తేదీన రాష్ట్రపతి తిరిగి ఢిల్లీకి వెళ్ళుతున్నప్పుడు వారి పర్యటన తాలూకు ఫోటో ఆల్బంను ముఖ్యమంత్రి సమర్పిస్తున్నారు.



అక్టోబరు 18వ తేదీన సమావేశమైన రాష్ట్ర ప్రణాళికా సలహా సంఘము.



ఆగ్నేయాసియా దేశాల ప్రపంచ బ్యాంక్ డైరెక్టరు ఎస్కాట్ రే ముఖ్యమంత్రిని కలుసుకున్నారు.



అక్టోబరు 20వ తేదీన రాజ్‌భవన్‌లో గవర్నరునూ, ముఖ్యమంత్రినీ, పశ్చిమ జర్మనీ రాయబారి కలుసుకున్నారు.

# శ్రీకృష్ణాష్టమి

# ఉట్లపండుగ - తాళ్లపాకవారు

వేటూరి ఆనందమూర్తి

పండుగలు పర్వములు మానవజాతి జీవనమున తొణికిసలాడు చైతన్య విలాసములు. అనుభవ విశేషములు. అవి నవోత్సాహదీపికలు. ప్రకృతి పరిణామ సూచికలు. అవి మన జాతి బ్రదుకునకు బలమునకు మూలకందములు. మతమునకు హితమునకు పట్టుగొమ్మలు. ఒక్క మాటలో అవి మన సంస్కృతీ సర్వస్వములు – సంప్రదాయ పోషకములు.

హిందువుల పండుగ లనేకము లనేక వర్గములుగా విభజింపదగినవి కలవు. వానిలో లోకహితార్థ మవతరించు పుణ్య పురుషుల జన్మోత్సవముల జరపుకొను వేడుక లొకవర్గమునకు చెందినవి. వానినే నిత్య వ్యవహారమున జయంతు[1]లనియు పేర్కొనుచున్నాము. శ్రీకృష్ణాష్టమి, హనుమజ్జయంతి, దత్తాత్రేయ కూర్మ నృసింహ వామన పరశురామ బుద్ధజయంతులు, శ్రీరామనవమి మున్నగు నుత్సవము లీ వర్గమునకు చెందినవే. ఈ జయంత్యుత్సవము లన్నింటిలోను శ్రీ కృష్ణాష్టమి, శ్రీరామనవమి – ఈ రెండును భారతీయులకు ముఖ్యముగా నాంధ్రులకు మిక్కిలి ముఖ్యములు. వీరీ పండుగలను పైయుక్తికముగనే కాక సామూహికోత్సవముగ కూడ నేడు జరుపుకొనుచున్నారు. శ్రీరాముని చరితము హితమునకును, శ్రీకృష్ణుని చరితము తత్త్వమునకును ప్రతీకములగుటచేత తత్త్వ హితము లుపదేశించు నీ యవతారపురుషు లిరువురి జన్మోత్సవములను మనవారానందోత్సాహములతో చేసికొనుచున్నారు. ఈ యుత్సవములు మన దేశమందే కాదు, ఆ యవతారపురుషుల కథ లేయే దేశములందు వ్యాప్తిగాంచినవో ఆయా దేశములందును జరుపుకొనబడుచున్నవి. [2]చైత్రశుద్ధ నవమినాడు శ్రీరాములవారును, శ్రావణ బహుళాష్టమి దివసమున శ్రీకృష్ణుల వారును జన్మించిరి. కనక నాయా దివసములు పవిత్రములు. శ్రీరామనవమి యుత్సవములు చైత్రశుద్ధ పాడ్యమి మొదలుకొని నవమివరకును నవరాత్రము లమితానందముతో మనవారు జరుపుకొందురు. ఈ తొమ్మిది దినములందును జనులు రామాయణ పారాయణ కథా కాలక్షేపములతో ప్రొద్దుపుచ్చి నవమినాడు రామ జనన ఘట్టమును, దశమినాడు పట్టాభిషేక ఘట్టమును పఠించి – అది వసంతర్తువు, ఎండకాలము నగుటచేత వడపప్పుపానకములారగింపుచేసి విసనకఱ్ఱలను పంచిపెట్టి – శ్రీరామ జననోత్సవమును సామూహికోత్సవముగ జరుపుకొందురు.

ఇవి వసంత నవరాత్రములు. ఇట్లే శరన్నవరాత్రము (దసరా పండగ) లందును ఆయవతార పురుషునకు సంబంధించి రావణవధానంతర విజయసూచకముగా వేడుకలు చేసికొందురు. నాడు ఉత్తరభారతమున నేటికిని రావణ కుంభకర్ణాదుల ప్రతికృతులను తగులబెట్టి 'రామలీల' ల నుత్సాహముతో జరుపుకొందురు. ఇట్లే శ్రీకృష్ణాష్టమినాడును ప్రజలు జయంత్యుత్సవము నంతకన్నా వైభవముగ జరిపి వేడుకలు చేసుకొందురు. వివరణము ముందు గలదు.

వర్షము పొడవున హిందువులు చేసికొను పండుగలలో నీ కృష్ణాష్టమియే ముఖ్యమగు తొలి పండుగనియు, శ్రీరామ నవమియే తుది ముఖ్యమగు పండుగనియు తలపవచ్చును. ఈ రెండింటికిని నడుమనే మిగిలిన పండుగలన్నియు వచ్చును. ఎట్లన చైత్రవైశాఖములతో గూడిన వసంతర్తువే సంవత్సరమున కారంభమగుట యీనాటి యాచారమయినను – వర్షమునకు మూడు

---

1. భాద్రపదమాసమున కృష్ణపక్షమున వచ్చు అష్టమి రోహిణీ నక్షత్రయుక్తమైనచో 'జయంతి' యని నిత్యవ్యవహార మగునని వహ్నిపురాణమున గలదు.
"కృష్ణాష్టమ్యాం భవేద్యత్ర కలైకా రోహిణీ యధి, జయంతీనామ సాప్రోక్త ఉపోష్యా సాప్రయత్నతః"
'జయంతి' యనునది జ్యోతిశ్శాస్త్రపరిభాష - క్రమముగ నిదియే ప్రతి మహాపురుషుని జన్మదినమునకు వ్యవహృతమైనట్లు తోచుచున్నది - (చూ. హిందువుల పండుగలు, పర్వములు - పు. 100 శ్రీరామచంద్ర ప్రకటితము 1960)

2. దక్షిణ అమెరికాలోని రెడ్ - ఇండియనులు ఏడాది కొకమారు సీతారామోత్సవము జరుపుటయు, వారి సాహిత్యమున సీతారామగాథలకు సంబంధించిన పాటలుండుటయు ప్రబలమగు నిదర్శనమని పరిశోధకులు తలచుచున్నారు. దీనిని దయానంద సరస్వతియే తెలిపిరి (చూ. పూర్వోదాహృతగ్రంథము పు. 61)

ఋతువులేయుండి. ఋతువునకు నాలుగు మాసములు చొప్పున పరిగణింపబడుచుండిన యాచారమింకొకటి ప్రాచీన కాలమున కన్పట్టుచున్నది. వానకారుతోనే వత్సరారంభమగునను పరిగణనము నాడుండెను. కనుకనే సంవత్సరమునకు వర్షమనియు పేరువచ్చెను. వర్షర్తువే వర్షమున కారంభము. ప్రతి ఋతువు ప్రారంభమగుటతో బాటు ప్రత్యేకమైన యజ్ఞయాగాదులు ఆరంభింపబడుచుండెను. ఈ పద్ధతి ప్రకారము "ఫాల్గుణ పూర్ణిమనుండి వైశ్వదేవయజ్ఞమును, ఆషాఢ పూర్ణిమనుండి వరుణప్రఘాస యజ్ఞమును, కార్తీక పూర్ణిమనుండి సాకమేంధయజ్ఞమును జరుపవలెనని శతపథబ్రాహ్మణమునగలదు." [3] ఇట్లు నాల్గేసి నెలల కృత్యమును నడుపుటకే చాతుర్మాస్యమని పేరు. వీనిలో హేమంత వసంతములకన్నను వర్షర్తు చాతుర్మాసమును నడపుటే మన కాచారమైనది. ఈ చాతుర్మాస్యము ఆషాఢ శుక్లైకాదశితో ప్రారంభమై కార్తీకశుద్ధ ద్వాదశితో సమాప్తమగును. ఈ ఆషాఢ శుక్లైకాదశియే ప్రథమైకాదశి. దీనినే మనవారు 'తొలియేకాదశి' అని కూడ నందురు. ఈ తొలి యేకాదశితోనే వర్షమారంభమగుటయు పండుగలు వచ్చుటయు జరుగును. దీని తర్వాత వచ్చు ప్రసిద్ధమగు పండుగ శ్రీకృష్ణాష్టమియే. అటుపై స్వల్పవ్యవధులలోనే పండుగలనేకములు వచ్చును. తుదకు చైత్రశుద్ధనవమినాడు శ్రీరామనవమి పండుగ. [4] దానితో నాఖరు. ఇక చైత్రము తర్వాత వచ్చు మూడుమాసముల వ్యవధిలోనే పండుగలు నుండవు. అందుకే ప్రాచీనమగు వైదిక కాలమునాటి యాచారము చొప్పున వర్షారంభమును చాతుర్మాస్యారంభమునునగు నీ 'తొలియేకాదశి' తోడనే పండుగలారంభమనియు చైత్రమున శ్రీరామనవమితో నాకరనియు వాడుక యేర్పడినది. అందుకే మనము జరుపుకొను ప్రసిద్ధమగు పండుగలలో కృష్ణాష్టమి తొలి పండుగనియు, శ్రీరామనవమి తుది పండుగనియు చెప్పనగును.

రామకృష్ణులు ఆదర్శ పురుషులు. వారి దివ్యచరితములగు రామాయణ భాగవతములు భారతీయులకు నిత్యపారాయణ గ్రంథములు. ఆంధ్రులకు మరియును. శ్రీరాము డిక్ష్వాకు వగుటయు, శ్రీమదాంధ్ర భాగవతము పోతన విరచిత మగుటయు దానికి హేతువులు. ఆ యవతారములను వారి చరితములను ఆంధ్రజాతి తలపులో నిలుపుకొని తనువులోనేకము చేసికొన్నది.

శ్రీకృష్ణపూజ ఆంధ్రదేశమున నతి ప్రాచీన కాలమునుండియుగలదు. ఆయర్చామూర్తి కాలయములు కూడ నెన్నియో వెలసినవి. అందందు బాలకృష్ణ, వెన్నముద్ద గోపాలకృష్ణ, కాళీయమర్ధన, మురళీకృష్ణ, గోపీకృష్ణ విగ్రహములు ప్రతిష్ఠాపితములు. ఇన్ని భంగులలో నాయర్చామూర్తి యారాధింపబడుటకు ఆ యవతారము సంపూర్ణమగుటయు, నాతని లీలావిలాసములు హృదయావర్జకములగుటయు ముఖ్య హేతువులు. శ్రీకృష్ణావతారము దశావతారములలో నెనిమిదవది. ఈ కృష్ణచరితము హరివంశ భాగవత విష్ణుపురాణాదులలో విపులముగా నున్నది. ఆది యాబాలగోపాల మెరిగినదే. ఈ పురాణముల ననుసరించి శ్రీకృష్ణుడు, శ్రావణ బహుళాష్టమీ తిథియందు రోహిణీ నక్షత్రమున జన్మించెను. దేవకీ వసుదేవులకే కలిగినను యశోదానందుల పట్టియై పెరిగి పిన్ననాడే పెక్కు దుస్సాధ్యములగు కార్యములొనర్చి మహిమలు ప్రదర్శించెను. తన చిలిపిచేతలచేత గయ్యితల విసిగించియు ముద్దులు కురిపించెను. పెరిగి పెద్దవాడై దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించి, రాజనీతి విశారదుడై, తత్త్వవేత్తయై గీతోపదేశముగావించెను. పూర్ణాయుష్యముతో నుండెను. ఆతడు సత్యతపోదానార్జవాహింసలనెడి దక్షిణలను పొంది పురుషయజ్ఞ విద్యను తెలిసికొనినవాడని ఛాందోగ్యమున ప్రశంసగలదు. [5] దాని ననుసరించి పురుషుడను ఋషివద్ద ఈ విద్యను నేర్చిన దేవకీపుత్రుడగు కృష్ణుడు భాగవత కృష్ణుడే యగుట సహేతుకమేయని పరిశోధకులు తలచిరి. వీనిని బట్టి వారు శ్రీకృష్ణుడు నూటపదునారేండ్లకు పైబడి – నూటయిరువదియైదేండ్లవరకును లీలామానుష విగ్రహమును దాల్చియుండునని భావించిరి. ఇట్టి లోకోత్తర పురుషుడుగా చిత్రితుడైన శ్రీకృష్ణుడు పురాణములందు వర్ణితుడైనట్లు జారుడును చోరుడును నై యుండడనియు పరిశోధకుల విశ్వాసము. శ్రీకృష్ణుని శృంగార జీవితమునకు సంబంధించిన కథలనేకములు తత్త్వజ్యోతిశ్శాస్త్ర ములకు సంబంధించిన సాంకేతికతగల గాథలగుట

3. చూ. పూ. గ్రం. పుట 108.
4. వాల్మీకిరామాయాణము ననుసరించుము నీ సమయము సంవత్సరాంతమే. 'తపశ్చద్వాదశే మాసే చైత్రేనావమికేతిథౌ' అని రామా. అప్పుడు చైత్రము సంవత్సరమున 12వ మాసముగా పరిగణింపబడెడిది.
5. చూ. పూ. గ్రం. పుట 105.

తరచిన మీదట తెలియనగు నంశములే.[6] కావున వారి విశ్వాసములు నభిప్రాయములు సరియైనవియే కాదగును. ఇక నామహానీయుని యాకృతి విశేషములను గూర్చి పలువురు పలుతెరగుల భావించిరి. వానినెల్ల సవిమర్శముగ సమీక్షించి కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు ఇట్లు నిర్ణయించిరి.

"శ్రీకృష్ణుడు నీలవర్ణుడు. నూనూగు మీసాలవాడు. మంచి జెట్కీలతో బోరి కర్కశకాయు డైనవాడు. పరిపూర్ణవయః పరిపాకమున నానారాజులతో యుద్ధముచేసి వారిని నిర్జించి యసామాన్యుడని యనిపించుకొనినవాడు. ఆజానుబాహువు. అవతార పురుషుల లక్షణములలో నిది యొక ముఖ్య లక్షణమైయున్నది కావుననితడు పొట్టివాడు కాక యెత్తయిన విగ్రహమైయుండి యుండును. ఇతడు మీసములు కలవాడుగా నుండి యుండును. భారతయుద్ధమునాటికి (భగవద్గీతను బోధించునప్పటికి) 80 ఏండ్ల వృద్ధుడు." (చూ. శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారి 'హిందువుల పండుగలు'. పు. 64-68 ప్రకటితము 1953.) ఈ పై యభిప్రాయములు సరియైనవే యనిపించును. కృష్ణునకు మీసములున్నట్లే తాళ్ళపాకవారునువర్ణించిరి.

ఇట్లు అవతారపురుషుడై పరిపూర్ణ మానవు డగుటచేతనే అతని జన్మదివసమగు శ్రావణ బహుళాష్టమిని శ్రీకృష్ణ జయంతిగా దేశమెల్ల వేడుకలు చేసికొను చున్నది. శ్రావణ మాసమున కృష్ణపక్షమున రోహిణీ నక్షత్రయుక్తమగు నష్టమి నా డుపవసించి శ్రీకృష్ణుని పూజింపవలెననియు - అట్లు చేసిన చతుర్వర్గ ప్రాప్తియు, మహాజయము కలుగుననియు, అట్లుకాక జయంతీ వ్రత మాచరింపనిచో మహాపాపము కలిగి రాక్షస జన్మలభించుననియు స్కాందాది పురాణములు వాకొనుచున్నవి.

"శ్రావణే బహులే పక్షే
కృష్ణజన్మాష్టమీ వ్రతం
నకరోతి నరోయస్తు
భవతి క్రూరరాక్షసః"

ఆనాడు చంద్రునకర్ఘ్యమిచ్చి వెండితోగాని, బంగారుతోగాని ద్వాదశాంగుల విస్తారమగు చంద్రబింబమును సిద్ధపరచి బంగారు పాత్రలోనుంచి పూజించి యర్ఘ్యమిచ్చిన సర్వకామములు తీరు ననియు భవిష్యోత్తరమున గలదు.[7]

అందుకే ఈ జయంత్యుత్సవమును ప్రజలు అనాదిగా జరపుకొనుచున్నారు. శ్రీకృష్ణాష్టమినాడు పగలంతయు నుపవసించి సాయంకాలం కృష్ణ విగ్రహము నూరేగింతురు. జనన సూచకముగా నుయ్యాలలు కట్టి యూగింతురు. బాలకృష్ణుడు దేవకీ స్తన్యమును గ్రోలుచున్నట్లున్న విగ్రహముల నలంకరించి పూజింతురు.

అనూచానముగా వచ్చుచున్న ఈ సంప్రదాయమును 15 వ శతాబ్దిలో తాళ్ళపాక వారును పోషించినారు. విష్ణ్వాలయములలో నీ దినమున వారు విశేషపూజాదికము నెరపించిరి. పలుసంకీర్తనములు రచించి జయంత్యుత్సవమును పుత్రోత్సవముగా బేర్కొని వేడుకలు జరపిరి. వారి సంకీర్తనము లివి పరికింపుడు.[8]

## సాళంగనాట

జగములెల్లా నీదేరె జయవెట్టిరిందరును
తగనే(డు కృష్ణావతార మాయ నిదివో॥
అచ్యుతు(డు జనించె నద్దమరేతిరి కాడ
ముచ్చిమి రాకాసులు ముట్టువడిరి.
పచ్చిగాను లోకులాల పండుగ సేయరో నే(డు
అచ్చవు( గృష్ణావతార మాయ నిదివో॥
గోవిందు(డు జనించె గోకులాష్ట మిదే నే(డు
కావరపు కంసుని గర్వమణ(గె
భావించి ప్రజలాల పారణ సేయరో నే(డు
ఆవేళ(గృష్ణావతార మాయ నిదివో॥

అన్నమా : (10-20)

ఉపవసించి పారణసేయు జయంతీవ్రతమును సూచించు సంకీర్తన మిది.

## సాళంగనాట

దేవతలు గెలువరో తెగి దైత్యులు పారరో
భావించనింతటిలో భూభారమెల్ల నణ(గె॥
ఇప్పు డిదె గోవుల నిచ్చెను పుత్రోత్సవము
యిప్పుడు తొట్టెల నిడిరి(తులెల్లాను
చెప్పరాని బాలలీల సేయ(గల దెల్లా(జేసి
కప్పెను విష్ణుమాయలు గక్కనే(డు॥

(అన్నమా: 7-244)

బాలకృష్ణుని తొట్టెలలో నిడినవేళ పాడిన పాట యిది.

## దేసాళం

జోజోయని మీరు జోల పాడరో
సాజపు జయంతి నేడే సఫల మిందరికి॥
అదె చంద్రోదయ మాయ హరి యవతార
మందె
మొదల జాతకర్మములు సేయరో
అదన పుత్రోత్సవమట పుణ్యాహము చేసి

---

6. శ్రీకృష్ణుడు నరకుని వధించి పదునారువేల కన్యలను పరిగ్రహించిన కథ జ్యోతిశ్శాస్త్రమునకు సంబంధించిన దని విజ్ఞు లందురు. అందు కృష్ణుడు సూర్యుడే - సత్యభామ చంద్రుడు-నరకుడు భౌమునిరాశి - కన్యారాశియే కన్యకల గుంపు. ఈ జ్యోతిశ్శాస్త్ర విషయమే పురాణకథగా మారినది.
ఇట్లే గోపికావస్త్రాపహరణ కథ- జీవుల మాయావరణమును తొలగించి వారికి మోక్షప్రాప్తి నుపదేశించిన తాత్త్వికమైన సాంకేతికగల కథ.
గోవర్ధనోద్ధరణ వృత్తాంతము పశువృద్ధికిని వర్ష ప్రాప్తికిని పర్వతారణ్యముల పోషణమవసర మను ప్రకృతి విషయమును వెల్లడించునట్టిది.

7. చూ. 'హిందువుల పండుగలు పర్వములు'- పు. 101. శ్రీరామచంద్ర.

8. చూ. తాళ్ళపాకవారి ఆధ్యాత్మ సంకీర్తనల సంపుటములు ప్రచురణము. తి. తి. దేవస్థానము.

కదిసి యిట్టె నామకరణముఁ జేయరో ॥

అన్నమా : (8_172)

ఉయ్యాలలోని బాలకృష్ణునకు జోలపాటయిది

## రామక్రియ

భూమిలోనఁ గొత్తలాయఁ బుత్రోత్సవ మిదివో
నేమపు కృష్ణజయంతి నేఁడే యమ్మా ॥
పొడవుకుఁ బొడవైన పురుషోత్తముఁడు నేఁడు
అడరి తొట్టెల బాలుఁడాయనమ్మా
పుడుగక యజ్ఞభాగమొగి నారగించేవాఁడు
కొడుకై తల్లి చన్ను గుడిచీనమ్మా ॥

అన్నమా : (8_17)

మాతృస్తన్యమును గ్రోలుచున్న గోపాల బాలుడిందు వర్ణితుడు. ఇట్టివే మరికొన్ని కీర్తనములు.

## మాళవి గౌళ

ఏమని చెప్పఁగవచ్చు నీసంతోషపుసుద్ది
నామము శ్రీకృష్ణుడట నారాయణునికి ॥
గోవులఁగాచేదియు గొల్లెతలఁబొందేదియు
ఆవేళగుణము యీ యచ్యుతునికి
శ్రావణ బహుళాష్టమి చంద్రోదయము రోహిణి
కావింప జన్మమిదివో శ్రీవేంకటపతికి ॥

అన్నమా : (8_253)

## ముఖారి

ఆదరమ్మ పాదరమ్మ అందరు మీరు
వేడుక సంతసములు వెల్లవిరి యాయెను ॥
కమలనాభుఁడు పుట్టెఁగంసుని మదమణఁచ
తిమిరిదేవకి దేవి దేహమందును
అమరులకు మునుల కభయమిచ్చెనితఁడు
కొమిరె గొల్లెతలపైఁగోరికలు నిలిపె.
రేయిఁబగలుగఁజేసి రేపల్లెఁబెరుగఁజొచ్చె
ఆ యెడనావులఁగాచె నాదిమూలము
యీయెడ లోకాలు చూపె నిట్టెతనకడుపులో
మాయసేసి యిందరిలో మనుజుఁడై నిలిచె.
బాలలీలలు నటించి బహుదైవికమునించె
పాలువెన్నలు దొంగిలెఁ బరమమూర్తి
తాళి భూభారమణఁచె ధర్మము పరిపాలించె
మేలిమి శ్రీవేంకటాద్రిమీఁద నిట్టెనిలిచె ॥

అన్నమా : (8_112)

తాళ్లపాకచిన తిరుమలాచార్యుని కీర్తన మిదిగాంచుడు.

## గౌళ

చిన్నవాఁడు నాలుగు చేతులతోనున్నాఁడు
కన్నప్పుడె శంఖము చక్రముఁ జేతనున్నది॥
నడురేయి రోహిణీ నక్షత్రమున బుట్టె
వడిఁ గృష్ణుఁడిదివో దేవతలందు
పడిన మీబాధలెల్ల ప్రజలాల యిప్పుడిట్టె
విడుగరాయ మీరు వెరవకుఁడికను. ॥

చి॥ తి॥. (16_32)

ఈ విధమున తాళ్లపాక కవీశ్వరులు–అన్నమాచార్య పెదతిరుమలాచార్య చిన తిరుమలాచార్యాదులుపదులకొలదిగాపదముల నీ కృష్ణాష్టమి సందర్భమునరచించి పుత్రోత్సవపు వేడుకను గానరూపమున లోకమునకు చాటిరి. తిరుపతిలో తాళ్లపాకవారీ పుత్రోత్సవమును బురస్కరించుకొని కృష్ణస్వామికి ప్రత్యేకముగా జరపించిన సేవలను దెల్పు శాసనములు కూడ లెక్కకు మిక్కిలిగానున్నవి.

గొల్లల యిండ్లలో పెరిగియు. తిరిగియు పాల్వెన్న మీగడలు దొంగిలించిన బాలకృష్ణుని దుందుడుకు చేతలకు నిదర్శనముగా నీ జన్మాష్టమి సందర్భమున వీధులలోనుట్లువెట్టి గడలతో గొట్టించి చేసికొనెడి వేడుక యొకటి మనమందరమెరిగినదే. ఈ వేడుక ఆంధ్ర దేశమందంతటను విరివిగానున్నది. నేడది మన దేశమందే కాక కొన్ని యితర ప్రాంతములకును ప్రాకినది. ఆంధ్ర దేశమున నాలయోత్సవముల కనుబంధముగా నీ వేడుకను మొట్టమొదట ప్రారంభించినవారు తాళ్లపాకవారే. [9]అది మొదలుగా జన్మాష్టమి నాడు ఉట్లుకొట్టు వేడుక దేశమందెల్ల నతిశ

9. క్రీ. శ. 17 వ శతాబ్దిలో నారాయణతీర్థులవారు తమ తరంగిములలో నీ యుట్లుగొట్టు వేడుకను ప్రశంసించుటను బట్టియు, నీ 'శిక్యోత్సవము' ద్రవిడదేశమందలి వరహూరు గ్రామమున నేటికిని జరుపుచుండుటను బట్టియు ఆచార్య శ్రీ సాంబమూర్తిగారు నారాయణతీర్థులవారే ఈ శిక్యోత్సవమును ప్రారంభించినట్లు తెలిసిన విషయమును శ్రీ రజని యిట్లు పేర్కొనిరి.

'వరహూరు వేంకటేశ్వరాలయంలో తీర్థులవారి చిత్తరువు నేటికీ ఉన్నదనీ, తీర్థులవారు ఆనాడు అక్కడ ప్రారంభించిన శిక్యోత్సవం (ఉట్లపండుగ) ఈ నాటికీ భాద్రపదమాసంలో ఆ గ్రామంలో జరుపుతూ వుంటారనీకూడా వ్రాశారు సాంబమూర్తిగారు. ఈ ఉట్లపండుగ ఆంధ్రజిల్లాలలో కృష్ణాష్టమికి ప్రతియేడూ జరుపుతూంటారు.' (చూ. వాగ్గేయకారుల చరిత్ర_పు. 181) ఆంధ్ర జిల్లాలలో జరుపుచుండుటయేకాదు, అప్పటికి రెండువందలేండ్లకు పూర్వమే ఆయుత్సవ మాంధ్రదేశమున నారంభమైనదను విషయం ముందు తెలియగలదు. ఆ వేడుకలనే బహుశః తీర్థులవారు తమ కాలమున వరహూరు దేవాలయమునకూడ వెలయింపజేసి యుందురు. ద్రావిడదేశమున నాయూర మొదట నీ యుత్సవముల నారంభింపజేసినవారు తీర్థులనారై యుండవచ్చును గాని యప్పటికి చాలాకాలమునకు బూర్వమే ఆ వేడుకలు మనదేశమున నుండునవి, మనము ఆ పండుగను శ్రావణ బహుళాష్టమి-నవములలో జరుపుకొందుము. బహుశః ఆ వరహూరున భాద్రపద బహుళాష్టమీ నవములలో జరపుదురేమో. ఎట్లైన నొక్కటియే - ఏలన శ్రీకృష్ణుడు అష్టమినాడు రోహిణీ నక్షత్రమున జన్మించెనని యైతిహ్యము. రోహిణీయుతముగా అష్టమి శ్రావణభాద్రపద మాసములలో నెప్పుడైనను వచ్చును. ఒకవేళ శ్రావణమున గాకున్నను భాద్రపదమున తప్పదని వసిష్ఠసంహిత చెప్పుచున్నది. బహుశః దక్షిణాత్యులు నక్షత్రమునకు ప్రాముఖ్యమిచ్చి భాద్రపదమున యుత్సవము జరుపుచుండవచ్చును. ఏమైనను ఈ "శిక్యోత్సవము" ఆంధ్రమున దేశీయమగు నుత్సవము - దీనిని ఆంధ్రులేయగు తీర్థులవారు ద్రవిడదేశమునకును బ్రాకించి, తమ తరంగములతో బోధించి, క్రొత్త వేడుకల పూలు పూయించినారు.

యించి కృష్ణాష్టమి — ఉట్లపండుగగా రూపొంది ప్రజలకది యొక సామూహికోత్సవమైపోయినది. ఉపవాసముఃతోడను వ్రతాచారములతోడనుకూడి శ్రీకృష్ణ పూజతో మాత్రమే యుండుచుండిన కృష్ణ జయంత్యుత్సవ సంప్రదాయము 15వ శతాబ్దమున తాళ్ళపాకవారి మూలమున ఉట్ల పండుగగా రూపొంది వేడుకనించినది.[10] ఆ పండుగ వేడుక ఈనాడు మన మందర మెరిగినదే కాని దానిని ఎవరు ఎప్పుడు మొదలు పెట్టిరను విషయము మాత్రము మఱగున పడిపోయినది. దాని యారంభ వికాసములు ఈ క్రింది పరిశీలనమున వెల్లడి కాగలవు.

ఉట్లుగొట్టు నీ వేడుక 15వ శతాబ్దికి తరువాతనే కాని అంతకు పూర్వము మన దేశమున నున్నట్లు తెలియరాదు. ఈ వేడుకను తమిళమున 'ఉరియడి' అందురు.[11] దీని ప్రశంస తిరుపతి శాసనములందు పలు తావుల గలదు. క్రీ॥ శ॥ 1545 సం॥ న తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు వేయించిన శాసనమున తిరుమలమీద శ్రీకృష్ణస్వామికి జరగు జయంత్యుత్సవమును గూర్చియు, నచ్చట ఉట్లవేడుకను గూర్చియు వివరణము గలదు. క్రీ॥ శ॥ 1547 లో దిగువ తిరుపతిలో తాళ్ళపాక చిన తిరుమలాచార్యులు స్థాపించిన ఉరియడి వేడుకలను గూర్చియు, కొండమీద తత్పుత్రుడు తిరువెంగళప్ప స్థాపించిన ఉరియడి వినోదమును గూర్చియు వివరణము గలదు. ఈ శాసనములందచ్చటచ్చట తాళ్ళపాకవారు ఆ యుత్సవముల సందర్భమున వేరు వేరుగా పలు సమయములలో ఉరియడి వేడుకలకును, కైంకర్యములకును దాన ధర్మములు చేసియుండినట్లు తెలియుచున్నది. ఆయా కైంకర్యముల ప్రశంస వచ్చినపుడు వారి పేరనే "చిన తిరుమ లయ్యంగారి ఉరియడి" అనియు, 'తిరువేంకటయ్యగారి ఉరియడి' అనియు శాసనములందు ప్రశంసింపబడినది. పై యిరువురును ఈ ఉరియడి వేడుకల నినుమడింపజేసి వానికిదగిన కట్టుదిట్టములు చేసినవారిలో ముఖ్యులు. వీరే తదుత్సవములకు వ్యవస్థాపకు లన్నట్లు తిరుపతి శాసనములందున్నను వారి కాలమునకన్న నించుక పూర్వమే ఆ వేడుకల ప్రశంస మన కచట కన్పించుచున్నది. పరిశీలింపగా శ్రీజయంతినాడు ఉరియడి వేడుకను గూర్చిన మొట్టమొదటి ప్రస్తావన క్రీ॥ శ॥ 1491 సం॥ పు శాసనమందే కానవచ్చు చున్నది. నేను జూచినంతవరకు అంతకు పూర్వమీ ప్రశంస అక్కడి శాసనము లందు కానరాలేదు. ఆ తర్వాత కాలపు శాసనములలో క్రమముగా నా వేడుకను గూర్చిన వివరణ మధికముగా తెలియనగుచు క్రీ॥ శ॥ 1545–47 సం॥ ల నాటికి ఆ యుత్సవ వ్యవస్థ ఎట్టి కట్టుదిట్టములు కలదైనదో విశదమగుచున్నది. ఈ క్రింద నుదాహరింపబడిన శాసన భాగములలో నా వేడుకల యారంభ క్రమ వికాసముల తీరు పరికింపదగును. (చూ. తిరుమల తిరుపతి దేవస్థానము వారి శాసన సంపుటములు.)

1. క్రీ॥ 1491. (2 సంపుటము - 96) దాత అప్పయ్యాన్ అనువారు. శ్రీ జయంతి నాటి ఉరియడి సందర్భమున 1 అతిరసప్పడి. తమ ఉభయ్యముగా సమర్పించిరి.
2. క్రీ॥ 1494 — (2 సం — 127) సరస్వతీ మనో భండార చూరకార నరసరాజు ఒడయ్యర్ — తిరుపతిలోని గోవిందరాజు స్వామివారు శ్రీకృష్ణుని ఉరియడి వేడుకను జూచి వచ్చునపుడు సమర్పించు అప్పాపడి కైంకర్యము.

---

10. మన ప్రాచీనములగు పండుగలలో కొన్నిటిని సామూహికోత్సవములుగ రూపొందించి ప్రజాబాహుళ్యమున నూతన చైతన్యము గల్పించుటకై ప్రయత్నములు ఆయాకాలములలో జరిగినవి. శ్రీకృష్ణాష్టమి ఉట్లపండుగగా రూపొందుట యిట్టిదే. జయంత్యుత్సవములు వ్రతాచారములతో నుపవాసములతో క్లేశమునుగూర్చునవి. కాని వాని నాధారము చేసికొని గావించు వేడుకలుమాత్రము ప్రజలకు వినోదము గూర్చునట్టివి. కావున ఆ యా యుత్సవముల ప్రాముఖ్యము అప్పటి వేడుకలమీదనే అధికముగ ప్రజలదృష్టిలో నాధారపడి యుండును. బాణసంచాలు, టపాకాయలు లేని దీపావళి నేడు మనకు దీపావళియే కాజాలదుగదా! అన్నియు నట్లే. అందుకే ఈ యుత్సవముల పురస్కరించుకొని యెట్లో వేడుకలకు తావు గల్పింపవలెను. వ్రతాచారములతోబాటు శ్రీజయంతి వేడుకలతో ఉట్లపండుగగా రూపొందుటయు నిట్టిపరిణామమునే సూచించును. శ్రీకృష్ణుని బాల్యక్రీడ లందు కనువైనవి. అందుకే జన్మాష్టమి ఉట్లపండుగైనది. ఇట్లే రామకథను పురస్కరించుకొని రామలీల లేర్పాటైనవి. శ్రీరాముని విషయమున బాల్యముకన్న పదితలల రావణుని వధించి విజయమును గొను సందర్భమే వేడుకగూర్చునని కావున ఆ రామలీలలు శ్రీరామనవమినాడు కాక విజయదశమి (దసరా) సరదాగా రూపొందినవి. విశేష మేమన ఈ రెండు ఉత్సవముల సందర్భమునను జరగు నీ వేడుకలు ప్రాయికముగా 15,16 శతాబ్దములలోనే ఆరంభమైనవి. దక్షిణ భారతమున జన్మాష్టమిని ఉట్లపండుగగా రూపొందించినవారు తాళ్ళపాకవారు. అట్లే ఉత్తరభారతమున విజయదశమిని రామలీలా ప్రదర్శనోత్సవముగ తీర్చినవారు తులసీదాసు. వీరి మూలముననే దేశమున నీ యుత్సవములకు విశేష ప్రాచుర్యము కల్గినది.

11. ఉరి—ఉడి; అడి—కొట్టు (ఉ).
ఉట్టి—దే. వి. పిడతలు లోనగునవి యుంచుటకై దారములతో నల్లి వ్రేలఁగట్టెడి యంత్ర విశేషము. శిక్యము. (శ. ర.)
తిరుపతి శాసనము లన్నియు చాలవఱకు తమిళముననే యున్నవి: అది యచటి సంప్రదాయము. అందుకే పరిభాష తమిళమున నున్నది.

3. క్రీ॥ 1516 - (3 సం - 107) కోయిల్ కేళ్వి తిరువేంకట జియ్యర్ - తిరుపతి లోని గోవిందరాజాలయంలో ఉరియడి నాడు 1 అతిరసప్పడి సమర్పణ.

4. క్రీ॥ 1519 - (3 సం - 132) కందాడై దొడ్డయ్యంగార్ అప్ప - తిరుమల స్వామికి శ్రీజయంతినాడు 1 శీడైప్పడి కైంకర్యం. ఉరియడి దినమున తిరుపతి గోవిందరాజు స్వామికి 1 శీడైప్పడి సమర్పణ.

5. క్రీ॥ 1530 - (4 సం - 6) తాళ్ళపాక తిరుమలయంగారు - తిరుమలలో స్వామికి శ్రీజయంతి - ఉరియడి పండుగలు రెండు దినములందును 2 పడులు సమర్పణము.

6. క్రీ॥ 1531 - (4 సం - 12) సారణుసెట్టి తిరుపతిలో గోవిందరాజు స్వామికి శ్రీజయంతినాడు 1 దోసెప్పడి - ఉరియడి పండుగనాడు 1 దోసెప్పడి సమర్పణము.

7. క్రీ॥ 1533 - (4 సం - 26) ఎల్లప్పాపిళ్ల తిరుమలమీద శ్రీకృష్ణస్వామికి ఉరియడి పండుగనాడు ఆలయపు ఖర్చులతో జరుగు ఉరియడి వేడుకల సందర్భమున 1 దోసెప్పడి సమర్పణము.

8. క్రీ॥ 1535 - (4 సం - 46) కోయిల్ కేళ్వి తిరువేంకట జియ్యర్ - తిరుమలమీది కృష్ణస్వామికి ఉరియడి దినమున ఎణ్ణై ఆడల్ (తలంటుకొనుట) కై ఊరేగింపు వెళ్ళివచ్చిన తర్వాత తిరుమామని మంటపమున ఉయ్యాలలో నున్నప్పుడు 1 ఇడ్డలిపడి సమర్పణ.

9 క్రీ॥ 1545 - (5 సం - 47) (1) తాళ్ళపాక పెద తిరుమలయ్యంగారు - తిరుమలమీద వేటాడు కృష్ణుడు ఉరియడి దినమున తలంటునకై యూరేగిపోవునపుడు రామానుజకూటము ముందు 1. నాళివెన్నకై 1 పణముసమర్పణము.

(2) తిరువేంగళప్ప స్థాపించిన ఉరియడి వేడుకలను దర్శించు సందర్భమున కృష్ణ స్వామికి 1 నాళివెన్నకై 1 పణము సమర్పణ.

దిగువతిరుపతిలో :—

లక్ష్మీదేవి మంటపమున వేంచేసిన గోవిందరాజునకు, శ్రీకృష్ణునకు, నాచ్చిమార్, గోదాదేవులకు జరుగు నుభయ్యములకై ఉరియడిపండుగ సందర్భమున సమర్పించిన $561\frac{1}{2}$ పణము (56 సువర్ణ రేఖలు - $1\frac{1}{2}$ పణము)లకు జరగవలసిన కైంకర్యములు : అందు 40 పణములు పలు విధములైన వగైర్పడులకు మిగిలిన సొమ్ములో —

పణములు

| | |
|---|---|
| 3 | -3 నాళుల వెన్న |
| 2 | -2 ,, తేనె |
| 2 | -1 నాళి పాలు |
| 2 | -2 కుండల పెరుగు |
| 2 | -2 నాళుల పంచదార |
| 1 | -1 మరక్కాల్ పొరి(బొర్గులు) |
| 2 | -10 కొబ్బరికాయలు |
| 4 | -4 వీశల బెల్లము. |
| 1 | -100 బుట్టలు, |
| 1 | -100 కెల్లె (కొండపండ్లు) |
| 2 | -2 మరక్కాల్ అవల్ (అటుకులు) |
| 2 | -2 ,, పొరి (పేలాలు) |
| 2 | -2 ,, పెసలు |
| 2 | -2 ,, శనగలు |
| 2 | -50 చెఱకుగడలు |
| 1 | -100 వెలగపండ్లు |
| 6 | -30 కొబ్బరికాయలు |

ఇవికాక యితరములైన వెచ్చములు.

1 పణము పరిచారకులకు (శనపూర్వువారికి)

6 పణ. "తిరుమలయ్యంగారి ఉరియడి" వేడుకలో వాడునట్టి వెదుళ్ళను గడలనుచెడకుండ బాగుచేయు మేదరులకు.

1 పణము — ఉరియడి మంటపము నలంకరించు కైక్కోలర్‌నకు అలంకరణార్థము.

$\frac{1}{2}$ పణము శిల్పికి

$\frac{1}{2}$ ,, కట్టుత్రాళ్ళకు, నారలకు,

2 ,, పూవులకు

4 ,, రెండేసి నాళుల నేయి, తేనె, వెన్న పాలు, పెరుగు, పంచదారలతో కలపి చేయు పంచామృతమును కుండలలో నింపి రెండు ఉట్ల స్తంభముల మీదను పండ్లతోడను, కొబ్బరికాయలతోడను అలంకరించి నిలుపుటకు,

1 రేఖ (10 పణములు) ఉరియడి వేడుకలలో నియుక్తులగు సేవకులకు కై చేతము.

(ఈ శాసనమందు కొన్ని అంకెలు వివరణము లోపించియున్నవి.)

10 క్రీ॥ 1547 — (5 సం - 99). తాళ్ళపాక చినతిరుమలయ్యంగారు - తాము స్వామికి సమర్పించిన వేదుమపాకం గ్రామముమీదవచ్చు నాదాయము 200 సువర్ణరేఖలతో నాలయాధికారులు నిర్వహించిన పలుకైంకర్యములలో - 6 పణములు వెచ్చించి తిరుపతిలోని చినతిరుమలయ్యగారి యింటిముందు గోవిందరాజ స్వామివారికి తాము వ్యవస్థాపించిన ఉరియడి వేడుకల దినమున 1 ఇడ్డలిపడి సమర్పించుట ; దానికి వలసిన వెన్న, పూలు, కొబ్బరికాయలు, అరటిపండ్లు కొని ఉట్టి స్తంభము నిలుపుటకు ఏర్పాటు చేసెను.

ఈ శాసనమందే చినతిరుమలాచార్యుని కుమారుడు తిరువెంగళప్ప అధిక

ముగా 41 సువర్ణరేఖలసొమ్ము తిరుమల లోని శ్రీ భండారమున కర్పించెను. ఆ ద్రవ్యములో -

స్వామివారి యుత్సవమూర్తి తిరుమలలోని ఉత్తరమాడవీధిలో తమ తండ్రిగారగు చినతిరుమలాచార్యులు స్థాపించిన ఉరియడి వేడుకలనుదర్శించు సందర్భమున 5 రేఖల విలువగల 1 మనోహరప్పడియు,

2 నాళులవెన్నయు సమర్పితము కావలెను.

11 సువర్ణరేఖలను వెచ్చించి ఉరియడి పండుగ వేడుకల జరపించు ఖర్చునీ క్రిందివిధమున భరింపవలెను.

3½ పణములు - ఈ వేడుకలకు వలసిన వెదుళ్ళను, ఇతరవస్తువులను సమకూర్చుటకై తిరుప్పణి పిళ్ళకు.

½ పణము పట్రంగికి

10 రేఖలు 100 పట్టుగుడ్డలకు, 100 నూలు గుడ్డలకు ఉరియడి వృక్షము (స్తంభము) నలంకరించుటకు.

1 పణము ఆ వస్తువులను స్తంభములపైనలంకరించినిలుపుటకు.

2 ,, శిల్పికి.

3 ,, పంచామృతము, పండ్లు, కొబ్బరికాయలు సమకూర్చుటకు (ఇత్యాదిగా వివరింపబడినవి)

పైన పేర్కొన్న శాసనములందలి విషయ వివరణమునుబట్టి పరిశీలింపగా - ఈ ఉట్లపండగ విషయమున తాళ్ళపాకవారే విశేషమగుశ్రద్ధ వహించినట్లు తెలియుచున్నది. క్రీ॥ శ॥ 1490-91 ప్రాంతమునో అంతకు కొన్ని వత్సరములుపూర్వమో ఈ ఉరియడి వేడుకలు జరపుకొనాచారమారంభమై యుండును అనగా ఆది సాళువ నరసింగరాయని పరిపాలనా కాలమగును. తాళ్ళపాకవారి వంశవిఖ్యాతికి మూలపురుషుడగు అన్నమాచార్యులవారుచ్చదశలోనుండి సంకీర్తరచన గావించుకొనుచు శ్రీ వేంకటేశ్వరుల మహిమను స్వయమనుభవించి లోకమునకు వెల్లడి సేయుచుండిన దినములవి. (1424-1503) వారి కాలముననే తిరుమలమీద స్వామివారికెన్నో నూతనోత్సవములారంభమైనవి[12]. వానిలో కొన్నిటిని అన్నమాచార్యులే యారంభించి కలకాలము సాగునేర్పాట్లుకూడ కావించియుండిరి. అందుకే బహుశః అట్టివానిలోవ ఉరియడి పండుగవేడుకకూడ నొకటియై యుండియుండవనగునని నేను బావించుచున్నాను. అన్నమాచార్యుని సంకీర్తనములీపండుగనుగూర్చిన విందులకు సాక్ష్యము బలుకుచున్నవి. వారికాలమునకన్నా పూర్వమీ వేడుకలు మనదేశమున లేవనుటకు అంతకు పూర్వము శాసనములందు కాని, సాహిత్యమునందు కాని ఈ ఉట్లు కొట్టు పండుగ వేడుకను గూర్చిన ప్రస్తావన కానరాకుండుటయే నిదర్శనము. అన్నమాచార్యుని కాలముననే ఆరంభమైన యీ వేడుక క్రీ॥ 1500ప్రాంతమునకు ప్రత్యేకమగు నొక పండుగగానే రూపొందెననియు, దాని యారంభ వికాసములకు తాళ్ళపాకవారే కారణ భూతులనియు పై శాసన పరిశీలనమున తెలియగలదు.

అన్నమాచార్యుని సంకీర్తనములలో శ్రీజయంతిని ప్రస్తావించు కీర్తనలే అధికముగనున్నవి. వానిలో గొన్నిట శ్రీజయంతి నాడే పుత్రోత్సవ సందర్భమున నుట్లపండుగ ప్రస్తావనయు గలదు. చూడుడు.

## రామ క్రియ

భూమిలోనగ్గొత్తలాయ బుత్రోత్సవమిదివో
నేమపు కృష్ణజయంతి నేడే యమ్మా ॥
పాలజలధి యల్లుండై పాయకుండే యతనికి
పాలవుట్ల పండుగ బ్రాతా యనటే
అలరి శ్రీ వేంకటాద్రి నాటలాడనే మరిగి
పేలరియై కడుపెచ్చు పెరిగెనమ్మా.

(8-17) అన్నమా.

## సాళంగనాట

పైకొని చూడరో వుట్ల పండుగ నేడు
ఆకడ గొల్లెతలకు నానందము నేడు
ఆదికాలమున గృష్ణుడవతరించిన యట్టి
ఆదట శ్రావణ బహుళాష్ట మాయను
దాదాత రోహిణీ నక్షత్రము గూడిన రేయి
సాదించ లోకులకెల్లా జయంతి యాయను

(8-161) అన్నమా:

ఇట్లే యీ వేడుకల ప్రస్తావనగల తొలి శాసనము లందును 'శ్రీజయంతి నాటి ఉరియడి' అని యుండుటను బట్టి యానాళ్ళలో నీ వేడుక లొక్క దినముననే జరగుచుండినవేమో యనిపించును. కాని క్రీ॥ శ॥ 1519 తర్వాత శాసనములలో విస్పష్టముగ 'శ్రీజయంతి నాడును - ఉరియడి దినమునను' అని రెండు దినములలో జరుగు పండుగలు ప్రస్తావింప బడుటను బట్టి యప్పటికి జన్మాష్టమి తర్వాత నవమినాడు ఉట్ల

12. సాళువ నరసింహరాయని ధర్మమున తిరుమలమీద స్వామివారికి తెప్పోత్సవము. డోలా మహోత్సవము నూతనముగా నారంభమైనవి. ఆ కాలముననే సాళువ మల్లయదేవుని ధర్మమున పవిత్రోత్సవ మారంభమైనది. అట్లే వనభోజనోత్సవ, అధ్యయనోత్సవ, వసంత గ్రీష్మోత్సవాదులును ఆ దినములందే యారంభమైనవి. ఇవికాక ఉట్లపండుగవలెనే తాళ్ళపాకవారి ధర్మమున తిరుమలమీదను, తిరుపతిలోను స్వామివారికి వైవాహికోత్సవము నూతనముగా నేర్పాటైనది. చిన్న తిరుమలాచార్య తిరువెంగళప్పలే యీ యుత్సవముల నిర్వాహమునకును తగిన యేర్పాటులు గావించినవారు.

పండుగ ప్రత్యేకముగ నేర్పాటై యుండు ననిపించును. నేటికిని అట్లే జన్మాష్టమి నాటి రాత్రి వీధులలో నుట్లుకట్టియుంచి మర్నాడే వానిని ప్రజలచేత గొట్టించుట ఆచారమై యున్నది. ఆనాళ్ళలో తాళ్ళపాక వారే తాము వ్యవస్థాపించిన ఈ ఉట్ల పండుగ వేడుకల కగుఖర్చులకై తిరుమలలోని శ్రీ భండార మునకు కొంత ద్రవ్యమును, కొన్ని గ్రామ ములమీది యాదాయమును సమర్పించి యేర్పాటు చేసియుండిరి. ఆ ద్రవ్యముతో నాలయాధికారు లీ వేడుకలను ఆలయోత్సవ ముల కనుబంధముగా నిర్వహించుచుండిరి. అందుకే ఎల్లప్పాపిళ్ళ ప్రభృతులు వేయిం చిన శాసనములలో 'ఆలయపు ఖర్చులతో జరగు ఉరియడి వేడుకల సందర్భమున' తమకైంకర్యములు కూడ చెల్లునట్లుఏర్పాటు గావించిరి.

లభ్యములగు నాధారములనుబట్టి నాటి యుట్లపండుగ యీ తీరున జరుగుచుండెడి దని తలపవచ్చును.13 తిరుమలమీద ఉరి యడి దినమున కృష్ణస్వామి యుత్సవ విగ్రహము ఎన్నె ఆడవ్ (తలంటుకొనుట) కై యూరేగింపుతో బయలుదేరెడిది. అప్పుడు మార్గమధ్యమున రామానుజ కూటమువద్ద వెన్న, నేయి సమర్పితము లయ్యేడివి. తలంటుకొని మరలివచ్చిన పిదప తిరుమామణి మంటపమున నుయ్యాలలో స్వామి యున్నప్పుడు ఇడ్డలిపడులు మున్న గునవి సమర్పితము లయ్యేడివి. పిదప స్వామివారి సమక్షముననే వీధులలో గట్టి యుంచిన యుట్లను అందుకు నియుక్తులైన వారు కొట్టి కోలాహలము చేసెడివారు. ఈ ఉట్లు పలుపురు ఏర్పాటుచేసినవి. ఎవరిపేర వారు ప్రత్యేకముగా నుట్లు కట్టించెడివారు. తాళ్ళపాకవారే తమ తమ పేళ్ళ ప్రత్యే కముగా నీ యుట్లను గట్టించుచుండిరి. తిరు మలయ్యగారి ఉరి వేరు, తిరువేంగళప్పగారి ఉరి వేరు ఆ యుట్లు కొట్టుటకు ముందు వారు వా రేర్పాటు చేసిన కైంకర్యములు ఆ వేడుకలు దర్శించెడి స్వామికి జరిగెడివి. పిదప నుట్లు కొట్టుట. ఉట్లు కట్టుటకు ఉరియడి మంటపమును ప్రత్యేకముగ నిర్మించెడివారు. ఉట్లు వ్రేలాడుదీయుటకు పొడుగు పాటి స్తంభము లుండెడివి. వానిని పట్టు, నూలు బట్టలతోడను, పూలతోను, పండ్లతోను, కొబ్బరికాయలతోను పేర్చి యలంకరించెడి వారు. దాని నాధారముగా గొని ఉట్లను, పంచామృత కలశములను గిలకలతో వ్రేలాడ దీయుదురు. ఆ కలశములను చేతులు జాచియు, నిక్కియు, గడలతో గొట్టియు, నందుకొనుటకు ప్రయత్నించుచు కొట్ట జూచినవారికి కలశామృతము లభించెడిది. అట్టి యుట్లు అనేకములు; పంచామృతపు టుట్లు, వెన్న వుట్టి. పాల వుట్టి, నేతి వుట్టి, పెరుగు వుట్టి, చక్కెర వుట్టి, బొరుగు వుట్టి, అటుకుల వుట్టి లెక్కలేనన్ని. వాని నెల్ల ఒకదాని తర్వాత ఒకటిగా కొట్టి కైవసము చేసికొనుట వేడుక :

ఉట్లపండుగ వేడుకలను కనులగట్టించెడి తాళ్ళపాకవారి యీ కీర్తనలు చూడుడు.

## సాళంగనాట

కొమ్మలు చూడరే గోవిందుఁడు
కుమ్మరించీముద్దు గోవిందుఁడు ॥
దిట్టబాలులతోఁ దిరిగి వీధుల
గొట్టీనుట్లు గోవిందుఁడు
పట్టిన కోలలు పైపైఁ జాఁపుచు
కుట్టీఁ దూంట్లుగా గోవిందుఁడు ॥
నిలువుఁగాళతో నిడిగూఁతలతో
కొలకొలమని గోవిందుఁడు
వలసినపాలు వారలు పట్టుచు
కులికీ నవ్వగోవిందుఁడు ॥

అన్నమా : (8-142)

ఆ యుట్లను కోలలతో గొట్టువారు గోవిందుని వలెనే పీతాంబరము లలంకరించుకొని కూత లిడుచు కొలకొల మని కోలాహలము సేయుదురట :

## దేసాళం

పచ్చిదేరుచు నుట్లపండుగా యను
గచ్చులకు గొల్లెతలు కౌఁగిలించి పట్టఁగా
పీతాంబరముమీద పెద్ద కిరీటముమీద
నేతిపాలచాల లెల్ల నిండె నది వో
జాతిగొల్లెతల వుట్లు సారెఁగోల లెత్తికొట్టి
చేతులు చాఁబారగించి చిమ్మిరేఁగఁగాను ॥
సొరిది సొమ్ములమీద సోయగపు చెక్కులపై
పెరుగులు మీఁగడలు పేరుకొనెను
అరుదుగ వీధులను అందరివుట్లు గొట్టి
దొరతనములతోడ దొమ్మి సేయఁగాను ॥

పలువురిపేర గట్టబడిన యుట్లను పదుల కొలదిగా కొట్టుట నాటి వేడుక.

---

13. కార్ణాటక పదకోశకారుడు కిట్టెల్ ఈ వేడుకల నిట్లు వివరించెను. ఉట్లు – i. e. plural of ఉట్టి ఉట్లాటె – ఆటె=ఉఱడి. A play in which cocoanuts, sugar etc. are suspended and swung, when pesons dressed like herdsmen attempt to strike and obtain them, especially on the day after Krishna's birth day (Mysore) – ఉట్లబడి : A play (on the same day) in which a network contains vessels filled with fruits etc. is suspended from a pole and while the so called herdsmen are trying to strike at it for the purpose of obtaining the fruit etc. the owner of it draws it up beyond their reach (Mysore – Tamil ఉఱియడి)

—*F. Kittel's Dictionary.*

### శంకరాభరణం

ఆక్కలార చూడుఁ డందరును
నిక్క వారవట్టీ నేఁడు గృష్ణుఁడు ॥
ఆనవాలవుట్టి అడుకులవుట్టి
పానకపు టుట్టి బలిమినే
ఆనుకకోలలనంది యందికొట్టి
తేనెవుట్టి గొట్టీ దేవకిసుతుఁడు
పెరుగువుట్టి మంచి పేరిన నేతివుట్టి
సరివెన్న వుట్టి చక్కెర వుట్టి
వెరవుతోఁగొట్టి వెసబాలులతో
బొరుగు వుట్టి గొట్టీ పొంచి రాముఁడు ॥
మక్కువ నలమేలుమంగఁ గూడి నేఁడు
చొక్కి శ్రీవేంకటేశుఁడు వీధుల
నిక్కి వుట్లెల్లా విండాఁ గొట్టి వుట్టి
చక్కిలాలు గొట్టీ జగతీశుఁడు ॥

అన్నమా : (8-149)

### పాడి

బాలులతో వీధులలోఁ బారాడువాఁడు
కోల లెత్తుక వుట్లు గొట్టీఁ జూండీ॥
నారికడవు వక్కలు నానినసనగలు
చారపప్పుఁ దేనెలు చక్కెరలును
పేరిననేతులు నానబియ్యాలు నుట్లన వే
చేరి యశోద బిడ్డకుఁ జెప్పరమ్మ ॥
చక్కిలాలు నడుకులు సనిగె పప్పులును
చెక్కిన మెత్తని తూఁటచెఱకులును
పెక్కువగా నుట్లలో బిందెలనించిన వవే
చక్క యశోదబిడ్డకుఁ జాచేరుసుండీ॥
నువ్వులు చిటిబెల్లాలు నున్నవిచిమ్మిలులు
నువ్వుటిడియునుఁ జిన్నినురుగులును
ఎవ్వరు వెంకటపతి కెఱుగించ నారగించి
కివ్వ కివ్వ నవ్వ నణఁకించీ జూండి ॥

నాడు ఎన్నిరకముల యుట్లు కట్టబడినవో, అందలి వస్తువు లెట్టివో, వానిలో నెన్ని రహస్య చమత్కారములో పై కీర్తనములలో వెల్లడియగుచున్నవి. ఈ వేడుకలో నుట్లు కొట్టువారే గోపాలకృష్ణులు. వారట్లేయలంకరించుకొందురు. వారు కొట్టి కైవసము చేసి కొనునవి పాల్వెన్న మీగడలే కావు. పంచామృతములు. ఈ వినోదములెల్ల బాలకృష్ణుని చిలిపి చేష్టలకు నిదర్శనములు. చిన్నికృష్ణుని చర్యలవి, చౌర్యక్రియలు కావు. ముద్దు లొలికించు పసివాని చిద్విలాసములు. తోడివారి నుడికించి యూరించుటలు. సాధనాంతర మంత్రాంతరముల ననుసరించు జీవుల ననుగ్రహించి పరమపురుషుడు తానై యమృతత్వమును సిద్ధింపజేయుటలు. అందుకే బాలకృష్ణుని చేష్ట లీనాటికి పండుగలై పోయినవి; భాషలో సామెతలై పోయినవి.[14]

ఆనాడు తాళ్ళపాకవారే వ్యవస్థాపించిన ఉట్లపండుగల వేడుకను మనోజ్ఞముగా మన కనులముందును, చెవులయందును నేటికిని నిలుపుచున్న వారి యీ కీర్తనము నరసి యానందింపుడు.

### ముఖారి

పలుమరు వుట్లపండుగను
చిలుకు చిడుక్కని చిందగను ॥పల్లవి॥
ఊళ్ళ వీధుల వుట్లు కృష్ణుఁడు
తాళ్ళుదెగిపడఁ దన్నుచును (నఁగను)
ఫెళ్ళు కఠిల్లు పెఠిల్లు చిఠిల్లని
పెళ్ళుగ మ్రోసె పెనురవము ॥పలు॥
బంగరు బిందెలఁ బాలుఁ బెరుగులు
ముంగిట నెగయుచు మోఁదఁగను
కంగు కళింగు కఠింగు ఖణింగని
రంగుమీరు పెనురవములై ॥పల॥
నిగ్గగ వేంకట నిలయుఁ డుట్టిపా
లగ్గలికఁ బగుల నడువఁగను
భగ్గుభగిల్లని పరమామృతములు
గుగ్గిలి పదనుగఁ గురియఁగను ॥పల॥

(అన్నమా: 12-57)

---

14. అట్టి సామెతలు తెలుగులో చాలా నున్నవి. ఉట్టిమీద :— ఉట్లూడిపడి వచ్చినది— కలిబోసిన వెనుక నుట్లు కసుగొన నేలా? ఊఁకొనకున్న నుట్టి కట్టుకొని యూరేగుము. ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గమున కేమెక్కును? ఇత్యాదులు కొన్ని మాత్రమే.
కొట్టుకుబారి తినుట :— బాలురు యువకులు భుజించునపుడు పెద్దలు "ఈ వయసున కొట్టుకుబారి తినవలెనుగాని యిదేమితిండి పిట్టతిండీ అందురు. అనగా నోటికిని చేతికిని పని గల్పించి తెగగొట్టుకొని తినవలెనని కాదు. బాలకృష్ణుడు చీటికి మాటికి వెన్నకొట్టునకు (గదికి) మజ్జిగకొటునకు పారివెళ్ళి అందిన దెల్ల నారగించి వచ్చినట్లు పుష్టికరమగునట్టి యాహారము కడుపునిండ తినవలెననియే నేడును మన యిండ్లలో వెన్న, మజ్జిగ కొట్లుండుట ప్రసిద్ధమే.

# వీరమాత పనుపు-పుత్రా

— టి. యన్. సి. వెంకటవరదాచార్యులు

క॥ మాతకు భారతమాతకు
ప్రీతిగ సమరం బొనర్చి విజయము తెమ్మా ;
భూతలమే స్వర్గంబుగ
చేతురు నాయకులు సుఖము చేకురు పుత్రా.

క॥ ధీరోదాత్తులు భారత
వీరులటం చనెడు పల్కు వెల్వడవలెరా.
శూరాగ్రేసర భారత
వీరా విజయమ్ము నీదేలేరా పుత్రా.

క॥ నీ కెదురై యెవ డోపును
భీకర సంగ్రామమందు వెన్కటు గనుమా
లోకము మెచ్చ నటించియు
నాకమునం దమరులైరి నరులై పుత్రా.

క॥ భారతపుత్రుల శౌర్యము
ధీరత ఘన బాహుబలము తెంపును పెంపున్
వారు కనుంగొని గానీ
పోరిక పోపొమ్ము సమరభూముకి పుత్రా.

క॥ నెత్తురుకూడని తలపక
మత్తులు మన హద్దు దాటి మార్కొని నిల్వన్.
నెత్తురుకూడని విడుతువ
తుత్తునియలు చేసి హద్దు త్రొక్కర పుత్రా.

క॥ సుక్షత్రియ హృదయంబున
దక్షుడవై నిలచి హద్దు దాటించియు — హ
ర్యక్షంబై గర్జింపుము
పక్షులవలె పోదు రరచి పదరా పుత్రా.

క॥ ఎత్తిన రైఫలు దింపక
తుత్తునియలు చేసి రిపుల దోలి పతాకం
బెత్తుము మన సరిహద్దున
మెత్తురు సరివారు చూచి మేదిని పుత్రా.

క॥ వచ్చిన దారిన పరుగిడ
గ చ్చపలాత్మకుల దరిమి హద్దున జెండా
విచ్చలవిడి పాతుము ని
న్నచ్చట నిచ్చటను మెత్తు రందరు పుత్రా.

క॥ పూని పశున్యాయంబును
మానవ మర్యాద విడచి మహిషాసురులై
చైనులు తలపడి వచ్చిరి
మౌనము విడి తాల్చికొట్టి మరలుపు పుత్రా.

క॥ ఓరువలేని తనంబున
క్రూరులు పొలిమేర దాటి కూర్చొని పిల్వన్,
కూరుకు చుండెదవా నీ
వౌరసులా చించి చెండి పనుపర పుత్రా.

మావోటుంగ్ గుండియలను
దావానల మౌచు పేల్చి ధర్మపు మొక్కన్
నీవే నాటు ఘనుండవు
లేవోయీ వీరపౌత్ర లేలే పుత్రా.

క॥ కలలో నీ యాకృతి గని
చెలియింప మనంబు నరచి చెట్టు కొకండై
బలువెతల పడుచుపోదురు
కలదు భవానీవెలుంగు కదలర పుత్రా.

క॥ త్యాగులమని నాగులమని
వాగుచు నున్నారు రెండు వాగులవారల్
త్యాగుల నాగుల జోగుల
వేగముగా చేసి ధాత్రి వెల్గర పుత్రా.

క॥ మును పోయిన వీరులు నిను
వినువీధిని నిలచి పొగడ వీరరణంబున్
వెనుదియ్యక చేయుమురా
ఘనకీర్తిపథంబు నొందగలవో పుత్రా.

క॥ పరిమార్చుము శాత్రవులను
వరియించును కీర్తికాంత వర్ధిలు శుభముల్
సురపురి వీరులు మెత్తురు
పరమముదం బందు దేను పదరా పుత్రా.

క॥ పంచి యొసంగితి రక్తము
పెంచితి నిందనుక నిన్ను పేరు ప్రతిష్ఠల్
పంచి యొసంగర తల్లికి
వంచకులను పారతోలి భారతపుత్రా.

క॥ తారాపథమును దాక — న
పారముగా బెరుగుచుండె భరత పతాకం
బేరీతినైన తాకును
వీరోచితమైన వృత్తి విడువకు పుత్రా.

క॥ సిరిసంపదలను భారత !
పెరుగును భువినుండి దివికి పేరు గడించున్
పెరవారిగ మన పేరిట
స్థిరమతి వై పోయి జయము తెమ్మో పుత్రా.

క॥ దైవోపహతులు వారలు
దైవానుగ్రహము నీకు దాపై యుండెన్
నీ వాడి చూపి దుష్టుల
భావోద్రేకంబు నడచి పనుపర పుత్రా.

క॥ భారతమాతకు జెయ్ యని
భారము శిరసావహించి, బవరమునందున్
శూరులు మెచ్చ నటించర
భారత సత్పుత్ర వీరపౌత్రా పుత్రా.

క॥ భుజబలము చూపి పొద్దున
విజయపతాకంబు నిల్పి వెల్గుము ధాత్రిన్
విజయుడు గాంధీ రెండవ
విజయం బని పైన పల్కు ప్రీతిగ పుత్రా.

✳

# మనసులూ - మమతలూ

— హీరాలాల్ మోరియా

నిగార్ నిజంగా నల్లటిదే. అయినప్పటికీ ఆ అమ్మాయి ముఖంలో ఒక వింత అమాయకత్వం, తీవ్రమైన ఆకర్షణ కూడా వున్నమాట వాస్తవం. ఆవిడ కన్నులు యెప్పుడూ సముద్రంలా విప్పారి సానుభూతి తరంగాలను వెల్లువికిస్తుంటాయి. ఆవిడ పెదవులమీద చిరునవ్వు స్వచ్ఛంగా సగాదంటు రాయిలా వుంటుంది.

నేను ఆవిడ అగాథ హృదయాన్ని అంతుబట్టించుకోవడానికి ఎంత ప్రయత్నించినా ఒక్క చిరునవ్వుతో అన్నిటినీ తప్పించుకుంటుంది. ఒక్కోసారి అంటూ వుంటుంది, "నా అగాధ హృదయంలో మా అన్నయ్య సుఖంగా జీవించాలన్న ఆకాంక్షతప్ప మరేమీ లేదక్కా. నా భవిష్యత్తును గురించి నేనెన్నడూ ఆలోచించలేదు. కాని మా అన్నయ్య భవిష్యత్తునుగురించి మాత్రమే నాకు మహాచింతగా వుంటుంది. ఆయన ఒకింటివా డెప్పుడు అవుతాడా అన్నదే నా ఆలోచన. భార్యాభర్తలు హృదయాహ్లాదకరంగా వుండేలా నేను వాళ్ళకి వినోద కాలక్షేపం, సంగీతం విన్పించాలనీ, కొంతకాలం నా సంగీతనాదంతో వాళ్ళ హృదయం పులకరించి, శరీరంలో ఉత్తేజం కలిగి, దాన్ని తట్టుకోలేక పాటను ఆపమని వాళ్ళు ప్రతిమాలాలి. భరించలేనంత ఆనందప్రదమైన ఆ గడియలకోసం నేను ప్రతీక్షిస్తున్నానమ్మా. అంతకుమించి నా హృదయంలో మరేమీలేదు.

తన వివాహాన్ని గురించిన ప్రసక్తివస్తే నిగార్ ముఖం లజ్జతో ఎర్రబడి శరీరం కంపిస్తుంది. కాసేపా స్థితిలోనే వుండి, యేదో ఆలోచించుకొని, అమాంతం ఒక్కసారి నన్ను వాటేసుకుని, ఐనా నా పెళ్ళికిప్పు డేమంత తొందరొచ్చిందక్కా. అయినా నేనింకా అన్నయ్యకంటే యెంతో చిన్నదాన్ని కాబట్టి ఆయనకి యెంతో సేవచేయాలి. మా అన్నయ్యకి నన్ను దూరంచేయాలని మీరంతా యెందు కనుకుంటారు. నేను లేకపోతే ఆయన కేం కావాలో ఆయనకే తెలీదు పాపం. అదీగాక నా విషయంలో ఆయనకు యేమాత్రం చికాక్కలగడం నాకు యిష్టంలేదక్కా .... అసలు నన్నెవరు పెళ్ళిచేసుకోవడాని కిష్టపడతారని? ఇంత మరీ బొగ్గులా వుండే నల్లటి ముఖానికి ఈ రోజుల్లో పెళ్ళవుతుందా ?.... దేవుడు నన్నిలా నల్లదాన్ని చేశాడు, ఇలా చెయ్యబట్టేనేమో, నేను మా అన్నని యెడబాయకుండా వుండగలుగుతున్నాను. ఆయన లేకపోతే నా కేమీతోచదు, ఆయనకి అస్తమానం నాగురించిన చింతే, ఆయనకు శాంతి లేకుండా చేస్తున్నందుకు నాకు నామీదే విరక్తివేస్తుంది. ఆయన సంతోషంగా వుంటే నాకు పనుగెక్కినంత ఉత్సాహం,

అప్పుడప్పుడు నేను మళ్ళీ అంటూ వుంటాను "నల్లదానివైతేనేం, నిగార్, స్త్రీ సహజప్రకృతి సంపూర్ణంగా నీలో తొణికిసలాడేప్పుడు ఎలాగైనా యెవరో ఒకర్ని వివాహం చేసుకోవలసిందే కాని జీవితాంతం అన్నగార్నే సేవిస్తూ ఎలా కూర్చుంటావ్? నీ ముంగురుల్ని ముద్దుగా సరిదిద్దుతూ, చిరుకన్నులని ముద్దిడుకొని రసాస్వాదనలో మైమరుస్తూ వెచ్చని కౌగిలిలో బంధించి ఊపిరి సలపకుండా పెళ్ళికొడుకు నిన్ను వేధించాలి.

నిగార్ ఈ మాటలు విని చాలా అయిష్టతను వ్యక్తపరుస్తూ, అబ్బ! అలాంటి మాటలు అనకు. అని నోరుమూస్తుంది... నాకు మహాచెడ్డ చిరాకేస్తుంది. ఆడపిల్లలకింతకన్నా మరొక పనంటూ లేదేం. కేవలం ఇంతమాత్రానికేనా స్త్రీజన్మ?.... ఈ తత్వాన్ని నేను అంగీకరించను. కావాలంటే స్త్రీ అవివాహితగా వుండగలదు. స్త్రీకి అంత బలహీనత ఆపాదించడం స్త్రీ జాతిని అవమానపర్చడమేగాక మరింత పతనానికి, బలహీనతకు గురిచేయడమే అవుతుంది. స్త్రీ ప్రశాంతంగా జీవితం గడపగలగడానికి వివాహమేగాక యితరత్రా చాలా మార్గాలున్నాయి అసలు నేను నా పెళ్ళినిగురించి ఎన్నడూ ఆలోచించనేలేదు. అన్నయ్యను గురించే నా చింత. ఆయన బ్రతుకు రసహీనంగాకుండా మధురాతి మధురంగా వుండేలా చేయ

డానికి వదిన రావాలన్నదే నా ఆకాంక్ష.

పిచ్చిపిల్లా! .... ఆయన నీకు అన్న కాదు, అక్కడా యిదే రక్తం. నిన్ను గురించి అతనలానే కోరుతోంటాడు. జీవితములో సుందరస్వప్నాలను, కళ్లల్లో దాచుకుని యెందాక వేదనపడతావు? ఆవరించుకుంటున్న ప్రణయ వహ్ని ధూమాన్ని యెందాకా నిరోధించగలవు. నీపట్టువింటూంటే నాకు ఆశ్చర్యం వేస్తోంది నిగార్. నేను నీ అక్కయ్యనుకాదూ! నాతో చెప్పడానికేం, పరాయిదానా ?

ఇలా అనడంతోటే ఆవిడ సుందర నయనాలనుండి అశ్రువులు రాల ఆరంభమై. కాదు కాదు, అన్నీ సాకల్యంగా ఆలో చించందే నేను జంజాటంలో చిక్కుకో దల్చుకోలేదు.

ఆలోచించే దేముంది? పెళ్ళిలో సుఖం లేదనా? వెఱ్ఱిపిల్ల? మీ చిన్న చెల్లెలు కమల పెళ్ళయ్యాక ఎంత అందంగా వుందో ఆవిడలో ఎంతటి ఆశ్చర్యకరమైన పరివర్తనమో నే నెరగనూ?....నసీంను చూడరాదూ? పెళ్ళి గాకముందు ఎప్పుడూ నీలానే ఉదాసీనంగా వుంటూవుండేది. అయాక యెంత సంతోషంగా యెంత సుందరంగా వుందో! అలా వుంటుందని నేనెప్పుడూ అనుకోలేదుసుమా? జకారాని తీసుకో! ఎంత అమాయికంగా చిన్నతనంగా వుండేదో, యెప్పుడింత చురుకుగా శాయిలాపాయిలాగా తయారైందో.... ఇవన్నీ నిజంగా ఆలోచించి చూస్తే నా జీవితం నాకే బహుభారం అనిపిస్తుంది. ఇలాంటి జ్వాలల్లో నేను సజీవతప్తము కాలేను. కాబట్టి యివన్నీ ఆలోచనకు రానీకుండా అసంఖ్యాకమైన చింతలను కప్పిపుచ్చి గడపటం నేర్చుకున్నాను. కాని నీవే యిలాంటి ప్రశ్నలు వేసి అప్పుడప్పుడు నన్ను స్మృతుల్లోకి నెడు తూంటావు. అంటుంది.

అప్పుడు నిజంగా నిగార్‌ని కౌగలించు కొని ముద్దెట్టుకోకుండా వుండలేను. నల్లగా నిగనిగలాడే ఆవిడ ముఖం అత్యధికంగా కాంతివంత మవుతుంది. ఆవిడ నలుపులో అదో గొప్పఅందం వుంది, నల్లగా వుంటేనేం నిగార్, యే అందగత్తె కూడా నీ అందంముందు సరితూగదు. నిన్ను నీవు దురదృష్టవంతురాలిననీ అనాకారిననీ యెప్పుడూ వూహించుకోకు. అంటాను. ఆవిడ శ్రద్ధగా నా మాటలు వింటూ తదేకదృష్టితో నా ముఖాన్ని చూస్తూ శిలాప్రతిమలా అయిపోతుంది. చివరికి నేనే కదిలి ముందు వెళ్ళిపోయేదాన్నింటికి.

నాతో కలిసి మాట్లాడిననాడల్లా నిగార్‌కి నిద్ర దూరమవుతుంది. ఒకవేళ నిద్రపట్టినా కలలఅలల్లో ఆవిడ కలగి మేలుకొంటుంది. ఆ కలల్లో ఆవిడ ఎంతో సౌందర్యవతిగానూ భర్త బాహువుల్లో బంధింపబడినట్లుగానూ, చూచుకొం టుంది. హఠాత్తుగా తెలివి రావడంతో ఆవిడ శరీరం కంపించిపోతుంది. ఆ వణుకు తగ్గిందాకా ఆవిడ బయటికిగానీ అన్న ముందుకుగానీ వెళ్ళదు. సరాసరి స్నానాల గదికి వెళ్ళి నీటిబేసిన్ క్రింద కూర్చుంటుంది. శరీరం మెదడూ అంతా చల్లబడి స్వస్థమైపోయాక గాని ఆవిడ స్థితిలోమార్పురాదు. అప్పుడు చిరునవ్వుతో అన్నదగ్గరకు వెళ్ళుతుంది. ఏమాత్రం చీకూ చింతా లేనట్టుగా నవ్వుతో తుళ్ళుతో మాట్లాడుతుంది.చీకూ చింతా లేకుండా చెల్లెలు ఆనందంగా ప్రవర్తిస్తూవుండడం అన్న హృదయానికి ఎంతో తృప్తినిస్తుంది. కాని అది యెంతో సేపు నిలబడదు. ఆవిడ చిరునవ్వులో అసంఖ్యాకమైన పరివేదనలు నిక్షిప్తమై యున్నాయని ఆతనికి తెలుసు. ఆ అమాయకత్వం చాటున ఎంతప్రళయం అణగివుందో ననుకుంటాడు. ఈ ఆలోచన రావడం తడవు. అతనిమనను సంక్షోభించిపోతుంది. మనిషి పట్టుతప్పిపోయి కన్నీళ్ళు వచ్చేస్తుంటాయి,.... నిగార్ తక్షణం అన్న స్థితినిగురించి దగ్గరగావచ్చి అనునయిస్తుంది. నీ కళ్ళలో నీళ్ళుండకూడదన్నయ్యా, నన్ను చూడు. ఎప్పుడన్నా కన్నీళ్ళు వదిలానూ? నన్ను గురించినచింత పెట్టుకోకన్నా! నిన్ను వదలి దూరంగా వుండలేను. నేను చెప్పినమాటవిని ముందు నీవు పెళ్ళి చేసుకొని వదిన్ని తీసుకొనిరా! నాకది చాలు, అంటుంది. ఈ మాటలతో అతనికి దుఃఖం ఉవ్వెత్తుగాపొంగుతుంది.... నేనంత కఠినుణ్ణి, నిర్దయుణ్ణికాదు చెల్లీ? నీకు యేమాత్రం బాధకలుగనీయను. మంచి సంబంధాన్ని తీసుకొచ్చి తీరుతాను. ఈ రోజుల్లో అంతా పై మెరుగు రూపాల్ని చూసి మోజుపడేవాళ్ళూ లేదా ధన రాసులకోసం ఆశపడి ఎలాంటిదాన్నయినా వివాహమాడేవాళ్ళేకాని, కులాన్నీ, గుణాన్నీ, సాంప్రదాయాన్నీ, చూడ్డంలేదు చెల్లీ. మన వూళ్ళో మనకు తెలిసినవాళ్ళల్లోనే ఎంతమంది అనాకారి పిల్లలకు పెళ్ళిళ్ళుకాలేదు? వాళ్ళకి దొరికినభర్తలు ఎంత అందగాళ్లు? ఇదంతా ధనమాహాత్మ్యం....నిగార్! చెల్లీ!! నీ అన్న బీదవాడనీ నీపెళ్ళి చేయలేడనీ నీవు కలలోకూడా అనుకోకు. నీకు మంచి సంబంధాన్ని చూసి వివాహం చేసి తీరతాను. నిన్ను పూలల్లోపెట్టి పూజించి

జీవన సహచారిణిగా భావించే విశాల హృదయంగల సుందరుణ్ని నీకు భర్తగా తీసుకోస్తే సరేనా! నేను సర్వనాశనం అయినా పరవాలేదు కాని నీ జీవితాన్ని సిథిలంగానీను చెల్లీ! ఇదే నా ఆశయం కూడాను. అలా కానినాడు దివంగతమైన అమ్మనాన్నల ఆత్మలు శాంతించవు వాళ్ళ ఆత్మలు వేదనపాలు గావడం నాకు సమ్మతం కాదు. నిన్ను పచ్చ పచ్చగా చూడ్డం నా ఆశయం మాత్రమే కాదు, నా బాధ్యత, విధికూడాను.

"ముందు నీ వొక యింటివాడవు కావాలన్నయ్యా! తరువాతనావిషయం. అప్పుడే నాకేం తొందరంటావు. నీకంటే యెంతో చిన్నదాన్ని. నీపరిచర్యలుచేస్తే వదిన వచ్చిందాకా, నేనిలాగే వుంటాను. అనవసరంగా నన్నుగురించి ఆలోచించి అశాంతిపాలవుతున్నావు. ఇదే నేను భరించలేను; అంటూ నిగార్ అన్నని బ్రతిమాలుకుంది.

అతను చదువు మానేసి తనభవిష్యత్తుని కూడా లక్ష్యపెట్టకుండా దొరికిన కొద్ది పాటి వుద్యోగంలో ప్రవేశించాడు. ఆ నాలుగు డబ్బులతోనే జీవితావసరాలు నెరవేర్చుకుంటాడు, రాత్రిపూట ట్యూషన్లు చెప్పుకోవడం, వీలయినప్పుడల్లా ఫ్యాక్టరీలల్లో పనికి వెళ్ళడం మొదలైన వాటిద్వారా కొంత మొత్తం మిగల్చగలిగాడు. కాని ఆ స్వల్ప మొత్తంతో మర్యాదగా బ్రతికే కుటుంబాలలోని ఆడపిల్లకి, అందులో నల్లపిల్లకి, పెళ్ళికావడం మాత్రం పడదు.

అడిగినంత ధనాన్నీ, ఆస్తులనీ యిచ్చి అబ్బాయిలని కొనుక్కునే కాలంలో, స్థలాల్లో నిగార్‌లాంటి నల్లపిల్లని చేసుకోవడానికి, యెవ్వరూ ముందుకురాలేదు.... ఒకడు అయిదు వేలైనా యివ్వందే సరిపోదంటే మరొకడు పదివేలులేంది మాటకూడా మాట్లాడ్డం అనవసరం అన్నాడు. ఇంకొకడు తనెంతవరకు చదువుకుంటే అంతవ్యయం భరించాలన్న షరతు విధించాడు, మరింకొకడు కొంచెం నీళ్ళు నమల్తూ యేమంత ఆశలేదుగాని యింటినిబ్రాసియిస్తే పిల్లవిషయంలో పేచీ లేదన్నాడు.

మహబూబ్ పాపం చివరికి ఆ యింటిని తెగనమ్మడానిక్కూడా సిద్ధపడ్డాడు. ఈ సంగతి నిగార్ యెలాగో కనిపెట్టి ఒక నాడు అన్నని నిలవేసింది. నాకోసం ఈ వున్న ఒక్కయింటినికూడా అమ్మినీవు పకీరువు కాదల్చుకుంటే నీవు ఈ యిల్లు అమ్మకముందే ఈ యింట్లోనే నేను ఉరిపోసుక చస్తాను. అని కఠినంగా మందలించడంతో మహబూబ్ ఆ ఆలోచనకి స్వస్తిచెప్పాడు. యేవిధంగానైనా సరే కష్టపడి ధనంకూడబెట్టడానికేనిశ్చయించుకున్నాడు. తన జీవితంలో స్వప్నంలో కూడా ఒక్కసారైనా చూడని అయిదు వేల రూపాయల మొత్తాన్ని నిలవచేయడానికి నిరంతర ప్రయత్నం చేస్తూనే వున్నాడు.

మహబూబ్ పట్టుదల నిగార్‌కు తీవ్రమైన మనస్తాపాన్నికల్గించడంతోఒకనాడు అన్నతో పేచీపెట్టుకుంది. నీ పెళ్ళి కన్నాముందు నా పెళ్ళికావడానికి వీల్లేదనీ ప్రయత్నించి నీవు యేదో ఒకటి సాధించగలిగినప్పటికీ నేను సుతరామూ అంగీకరించేదిలేదనీ ఖండితంగా చెప్పింది. చెల్లెలు పట్టుదలకి లొంగిపోయి మార్గాంతరంలేక తల్లిదండ్రులు బ్రతికుండగానే నిశ్చితమైపోయిన తమ బంధువుల్లోని ఆ పేదింటమ్మాయినే చేసుకున్నాడు—

నూతన సంతోష సంరంభాలతో ఇలా కొన్ని మాసాలు గడచినవి. మహబూబ్ మళ్ళీ సంబంధాలవేట ప్రారంభించాడు. తగినంత ధనంకాని, స్తోమతుగానీలేదు. పిల్లా ఎర్రటి బుర్రా కాదు. అంతాయింటికి రావటం, పిల్లని చూచి మూతివిరవటమే గాని సరసంగా మాట్లాడిన వాళ్లు ఒక్కళ్లూ లేరు. పెళ్ళయిం తరువాత మహబూబ్ పరిస్థితి మరీ అధ్వాన్న మయింది. తామిద్దరూ భార్యాభర్తలూ కేళీవిలాసంగా వినోదిస్తుంటే నిండుయౌవనంలో వున్న పిల్ల అర్ధరాత్రిపూట యెన్ని నిట్టూర్పులు విడుస్తుందో, జీవితాన్ని ఎంత ఆవేదనతో వెళ్లదీస్తుందో అతని వూహాకు తట్టినప్పుడల్లా అపరిమితమైన భారంతో కృంగిపోతూంటాడు. ఈ మనోవ్యాధితో టి.బి. పేషెంటులా మారిపోయాడు.

ఈ వ్యవహారం సఖికి అత్యంతాదోళన కలిగించింది. రోజురోజూ భర్త యిలా కృంగిపోవడంతో ఆవిడ ఒకనాడు ఉండబట్టలేక అంది. అయ్యయ్యో! అలా అయిపోతున్నారేమండీ.

ఏం చేయమంటావ్ సఖీ, నా కేమీ పాలుపోవడంలేదు. ఇంతపెద్ద వాణ్ణయి కూడా చెల్లెలికి పెళ్ళి చేయలేకపోయానే ఎంతస్వార్థమతితో నాసుఖం నేను చూచుకుంటున్నాను. ఆలోచిస్తే నాకు నామీదే అసహ్యం వేస్తున్నది అన్నాడు మహబూబ్ విరక్తిగా.

"మనోవ్యాధికి ఆలోచనలకూ, అవధి వుండాలండీ, మీ యీస్థితిని చూస్తే నాకు భయం వేస్తున్నది....కొంచమైనా మీరు ఆరోగ్యాన్నిగురించి శ్రద్ధ తీసుకొనకపోతే లాభంలేదు. నిగార్ పెళ్ళినిగురించి నాకు మాత్రం చింతలేదూ? కాని మన చింత మనోవ్యాధిలోకి పరిణమించ రాదంటాను.

ఎప్పుడైనా ధైర్యంతోనే కార్యం సానుకూలం కావాలి కాని మనోవ్యాధితో సాధించలేము.చూద్దాం, దేవుడున్నాడు'' అంది సఖి.

సఖి వోదార్పు మహబూబ్‌కి కొంచెం తృప్తి కలిగింది. అయినా యేదోబాధగా ''దాని స్థితి చూస్తే నాకు అమితమైన జాలివేస్తుంది సఖి!....దాని ముఖంలో కళకాంతుల హెచ్చుతగ్గులు చూస్తున్నప్పుడల్లా నాకు భయమవుతూంటుంది. నేటికాలం కుర్రాళ్ళకి బుద్ధి లేదంటాను. అందరికీ ధనమే ప్రధానం కాని, గుణం కాదు. డబ్బు! డబ్బు!! డబ్బు!!! అబ్బ! జీవితాంతం సరిపోయేంత డబ్బు. ఊరికే, ఉత్తిపుణ్యానికే కావాలనడం మానవుడి ప్రజ్ఞకే తార్కాణమవుతుందా? ఆమాత్రం తార్కికదృక్పథం యెవడికీ లేదు. నేనుకావాలంటే అంతడబ్బు సంపాదించి, నాచెల్లెలికి పెళ్ళి చేసేవాణ్ణి. నా కలా చేద్దామనే అనిపించింది గాని నిగార్ హెచ్చరింపులకి తట్టుకోలేకపోయాను. ఏనాడోయిచ్చిన వాటికికట్టుబడి వుండితీరాలని ఆమె నిరూపించింది. మరి నియమాలు ప్రచురించి నీవు వదినవయోలా చేసుకుంది. నే నేంచేయను చెప్పు. నాకేమీ తోచడంలేదు అన్నాడు.

సఖి చాలాసేపు ఆలోచించింది. ఆవిడ మనస్సులో యేదో తళుక్కుమని మెరిసినట్టుంది. మీరు ఆట్టే చింతతో చిక్కి శల్యంగాకండి, చూద్దాం అంది.

గృహ వాతావరణం అనుకూలంగా వున్నా డొకసారి సఖిభర్తని యేకాంతంగా కలుసుకొని ఒక్కసారి మా పుట్టింటిదాకా వెళ్ళొస్తాను,ఆజ్ఞయిస్తారా అంది.

మహబూబ్ కొంచెం ఆశ్చర్యపోయాడు...'అరే, కొత్త పెళ్ళికూతురు వచ్చి యింకా యేడాదన్నా కాలేదు. ఇలా ఒంటరిగా కబురైనా చేయకుండా హటాత్తుగా పుట్టింటికి బయల్దేరటం బావుండదు సఖి అన్నాడు.

సఖిమౌనంగా వున్నా ఆవిడ మనస్తత్వం మౌనంగా వుండనివ్వలేదు. ఆఁ, పోనిద్దురూ, ఈసాంప్రదాయాలన్నీను.... అవసరం వున్నప్పుడెలామరి. కార్యసాధనలో సాంప్రదాయం నల్లపిల్లి నీడలా తయారవుతుందొక్కొక్క సారి. మీరు సెలవిస్తే రేపే ప్రయాణమై వెడతాను అంది, గోముగా స్ఫుటంగా.

ఆవిడ ప్రప్రధమంగా చేసిన అభ్యర్థనని తిరస్కరించలేకపోయాడు మహబూబ్. . మర్నాడే సఖి ప్రయాణానికి సిద్ధమైంది.

* * *

ఇంట్లో కాలు పెట్టడంతోనే హటాత్తుగా సఖి యెదురై ముసుగు సవరించుకోవడంతో ఆవిడ పెద్దన్న చాలా ఆశ్చర్యపోయాడు. సఖి అన్నగారికి సౌమ్యతగా నమస్కరించి ఆశీర్వచనం పొందింది.

మధ్యపసారాలో తల్లీ యింకా తమ్ముళ్లూ, చెల్లెళ్ళూ, అంతా కూర్చొని యున్నారు. కొడుకు మనస్సులోని భావాన్ని తల్లి గ్రహించింది. ముందు కాళ్ళు కడుక్కోనిరా నాయనా తరువాత మాట్లాడుకోవచ్చు నంది.

అంతా ఒకచోట పోగైనారు.

ఏం చెల్లీ! హఠాత్తుగా ఇలా వచ్చేశావు. బావగారు కులాసా? అన్నాడు.

నీదయవల్ల అంతా కులాసాగానే వున్నామన్నయ్యా. నా రాకడలో నీవు నానుంచి పెద్ద ఆశ్చర్యకరమైన వ్యవహారం యేమీవినవు.అంది సఖి నిదానంగా.

ఆడబడుచు,, అక్కరనిమిత్తం వచ్చినదన్నా, అంది చిన్నచెల్లెలు.

అదేమిటి, అందుకోసం నీవు ఇలా రావలసి యెందుకువచ్చింది అన్నాడు సాశ్చర్యంగా.

అవునన్నాయ్, వ్యవహారం అతి సున్నితంగా వుంది. నేను కల్పించుకోవడం తప్పనిసరి అనిపించింది.

కాని అక్కడ నీకంతా కొత్త వ్యవహారమేగదమ్మా ఇలా ఒక్కర్తెవు వస్తే అంతా యేమనుకుంటారు?

పోనిస్తూ! స్వంతవిషయాల్లో యెవరికేం ఆసక్తి? ఆలస్యం సహించలేకనే త్వరపడ్డాను.

ఏం? మరికొన్నాళ్ళాగితే యేమైంది.

లాభంలేదు. పరిస్థితి బాగా వుంటంలేదు.

సరే! ఇంతకూ నీవనే దేమిటి?

''నేనా....? నేను..................సఖి అర్ధోక్తిలోనే ఆగింది.

ఏం! సందేహిస్తున్నా వెందుకు? దాచిపెట్టకు. యేమిటీ కథ? ''స్వంత చెల్లెలి పెళ్ళిచేసి, ఋణం తీర్చుకున్నావన్నాయ్. మావారి యా చెల్లెలి పెళ్ళికూడా నీ సహాయంవల్లనే పూర్తి కావాలని?'' సఖి సందేహిస్తో ఆగింది.

నీ మాటలు నాకు బోధపడటంలేదు సఖి అన్నాడు అన్న. బోధపడే దేముంది ఈ వివాహం నీ సహాయంలేందే జరుగదు. అంతే అంది, సఖి తెగకోసినట్లు.

చూస్తున్నావుగా చెల్లీ! నీ పెళ్ళయిం దగ్గరనుంచీ ఎంతగా ఖర్చవుతున్నదో వ్యవహారం. ఇప్పుడు సహాయంచేసే స్థితిలో మేమున్నామా? నీవు మరేమీ అనుకోవద్దు—అన్నాడు మెత్తగా.

సఖి నోటివెంట అప్రయత్నంగా ఆఁ, అన్నధ్వని వెలువడింది. ఆవిడ రాక వట్టి

నీప్రయోజనం అనిపించింది. అన్నగారింత త్వరగా ఆలోచించి పెట్టుకున్నట్టు జవాబిస్తాడని ఆవిడ వూహించలేదు. యేదో చూదాం లెమ్మనైనా అంటాడేమోనని ఆశించింది.

ఇదిగో అమ్మాయ్! నీవు అనవసరమైన చిక్కుల్లో యిరుక్కోవడం నా కిష్టంలేదు. అదంత మంచిదికాదు. మన భుజాలు యెంత భారాన్ని మోయగలవో అంత వరకే బరువు నెత్తుకోవాలి అన్నాడు అన్న సిద్ధాంతీకరిస్తూ.

అవునన్నయ్యా! నిజమే! నేనే పొరపాటు పడ్డాను. ఇప్పుడు పొరపాటని తెలుస్తున్నది...మంచిది...నేను తెల్లవారజాము బండికి తిరిగి వెళ్ళిపోతున్నా?

అన్న కొంచెం దిగ్భ్రాంతుడై, వచ్చిందాని వెలాగో వచ్చావు కాబట్టి పుట్టింటి గడపల్లో ఓ వారం రోజులైనా వుండందే వెళ్ళరాదమ్మా! త్వరపడకు, అన్నాడు.

అక్కడి పరిస్థితుల దృష్ట్యా నేనిక్కడ వుండడానికి అవకాశంలేదన్నా!

ఐతే యెల్లుండి గురువారం పూట వెళుదు గానిలే! వుండు.

ఈరాత్రికన్నా యెక్కువ నేనిక్కడ గడపలేను. క్షమించు. నన్ను అపుజేయడానికి ప్రయత్నించకు. ప్రొద్దునే వెడతాను.

సరే పొద్దున్నే చూతాంలే. ఇప్పుడెందుకు. హాయిగా వెళ్ళి నిద్రపో.

ప్రొద్దున్నే అంతాలేచి ఒక్కచోట కూర్చుని ఫలహారాదికాలు ముగించుకున్నారు. సఖి తొందరను చూచి తల్లి తత్తరపడింది. ఆవిడ ప్రయాణానికి సన్నద్ధ మవుతోవుంటే చెల్లెళ్లు అటకాయించారు. చెల్లీ హఠాత్తుగా నీవు వచ్చి అందరినీ ఐతే మానసిక వ్యథకి గురిచేస్తున్నావు. అన్నాడు పెద్దన్న.

"నేను మిమ్మల్ని యిరుకున పెడితే మీరు నన్ను జీవితసముద్రంలోకి నెట్టారు. అక్కడి తరంగాల తాకిడికి మరి నేను తట్టుకోక యెలావుండను. తట్టుకోవడానికి ప్రయత్నించనప్పుడు నేను ప్రయాణం చేసేపడవే తల్లక్రిందులు కాదూ? అంది సఖియెంతో ఆరిందాలా!

అనవసరమైన సుడిగుండాల్ని యెందుకు వూహాతో కల్పించుకుంటావు?

మనం వున్నదే అక్కడకద? సఖి చాలాచురుకుగా ప్రయాణం తొందరలో వుండి అందరికీ తొందరను కల్పిస్తూంది.

ఆగడమంటూ లేనట్టేనా చెల్లీ? అన్నాడు పెద్దన్న

వుండలేనన్నా! క్షమించు, నన్ను వెళ్ళనీ,

సరే నీ యిష్టం మరి.

నా వెంట తోడుగా ఎవర్ని పంపతావు?

అహమ్మద్‌ని తీసుకువెళ్ల.

ఏం? నీవు రారాదూ?

నేను ఆఫీస్‌కు వెళ్ళాలి అత్యవసరంగా.

ఈరోజుకి సెలవు పెట్టొచ్చుగదా?

వద్దులే.... వాణ్ణే తీసుకువెళుదూ,

కాదు; నీవే రావాలి.

పెళ్ళికాకముందు నీలో యింత పట్టుదల, యిలాంటి పద్ధతి చూళ్ళేదమ్మాయ్ అన్నాడు.

అప్పుడు నేను ప్రపంచాన్ని గురించి తెలుసుకోవడానికి వీల్లేని ప్రదేశములో వున్నాను. కాని యిప్పుడలాలేను.

ఐతే యిప్పుడు స్వచ్ఛమైన సాంఘికపు జీవిత వెలుగులో ప్రవేశించానన్నమాట – ఆ, యిప్పుడే నా కళ్ళముందరి తెరలు తొలగి పోతున్నాయి.

అయితే భవిష్యత్తు అతి కాంతివంతమే, అంటే—?

ఇప్పుడు విశదీకరించే సమయంలేదు.

అలాగయితే సెలవు...అని బయలుదేరింది సఖి. పెద్దన్న తమ్ముడు అహమ్మద్‌ని పిలిచి అక్క వెంట వెళ్ళి దిగవిడిచి రమ్మని ఆదేశించాడు. మంచిది చెల్లీ, ఇక నేను ఆఫీస్‌కి వెళుతున్నాను.

అన్న ఆఫీస్‌కు వెళ్ళిపోయాక తమ్ముణ్ని బాజారుకు పంపించి ఒక రిక్షాను తెప్పించింది సఖి, తల్లిదగ్గరా. అందరిదగ్గరా, సెలవు తీసుకుంది. తన వెంటవచ్చి దిగబెడవ్వలసిన అవసరం యేమీ లేదని తానొక్కర్తె నే పోగలననీ తమ్ముణ్ని రావద్దనీ చెప్పింది. తల్లి బ్రతిమాలినా అంగీకరించలేదు. సాయంత్రం పెద్దన్న ఇంటికి రావటంతోటే ఈ విషయం విని చాలా ఖేదపడ్డాడు.... ఈ రాకడకు ఈ పోకడకు కారణాన్ని అర్థం చేసుకోలేకపోయాడు. పనితొందరలో అతను అలా అన్నాడు. కాని అసలు చెల్లెలు అంటే అభిమానం లేక కాదు. అతని హృదయం గాయపడినట్టయింది. చెల్లెలికి విధంగా తక్షణం ఒక వుత్తరం రాశాడు.

ప్రియమైన చెల్లీ!

ప్రాపంచికానుభవం నీవింకా చాలా సంపాదించవలసి వుంది. లోకవృత్తం నీకింకాచాలా క్రొత్తగా కన్పిస్తోంది. త్వరపడటం, ఉద్రేకపడటంతో కార్యంచెడిపోతుందిగాని సానుకూలపడదు స్త్రీలకి ఈ త్వరపాటు సహజం. నీవు ప్రస్తావించిన విషయంను గురించి నేను చాలా ఆలోచించాను. ఆవిధంగా సహాయపడవలసిందే, నిజమే. కాని యిక్కడి మా పరిస్థితులైనా మీ పరిస్థితులకి భిన్నంగా

లేవుగదా, గత్యంతరం లేదు. నీవు లేనిపోని బాధ్యతలు నెత్తినవేసుకొని బాధపడకు. నీవు బాధ్యురాలివి కావలసిన అంశం యిందులో యేమీ లేదు. మా మీద కోప్పడితే మేము చేయగలిగిందేమీ లేదు.

ఇట్లు
నీ అన్నయ్య.

ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చించి చెత్తబుట్టలో పడవేసింది సఖీ. ఆవిడకు అమితమైన రోషంతోపాటు కన్నీళ్ళుకూడా వచ్చేసినై. తనభర్తకే సుఖం లేనప్పుడు, తనకు సుఖం యెలా లభిస్తుంది. ఈ మాత్రపు విషయజ్ఞానం తన అన్నకు లేకపోయిందే అన్నచింత ఆవిడని ద్విగుణీకృతంగా బాధించింది.

పుట్టింటికి వెళ్ళి వచ్చిందగ్గరనుంచీ సఖీ చాలానిరాశగా నిస్పృహగా వుండడం మొదలెట్టింది. అస్తమానం యేదో ఆలోచిస్తుండేది. రాత్రివేళ భర్త ఆలోచన పగలు తన ఆలోచన ఈ రెండూ ఆవిడ ఆరోగ్యంమీద చాలా దుష్ప్రభావం వేసినై. నిగార్ ఈ వాలకం చూచి భయపడి చాలా నచ్చచెప్పింది కాని ఆవిడలో మార్పు కలగలేదు. యింటి పనుల్లోమాత్రం యేవిధమైన లోటు పాట్లు వుంచకుండా బండెడు చాకిరీ చేస్తూనే వుండేది.

నిగార్ ఉండబట్టలేక ఒకనాడు వదిన్న నిలవేసింది. నేనే నీవిలా అవడానికి కారణం కాదూ వదినా ? మీకింత సుఖం కూడా లేకుండా చేస్తున్నాను. అన్నయ్య అస్తమానం నన్ను గురించే బాధపడుతోంటే వదినవుంటే యింతపాటిగా ఆలోచించడన్న భావంతో ఆయన్ని పెళ్ళిచేసుకోమని త్వరపెట్టాను. కాని ఫలితం యెదురైంది. యిప్పుడు ఉభయులూ యిదే చింతతో చిక్కి శల్యం కావడం నా కిష్టం లేదు వదినా ? ఈ కష్టంనుండి మిమ్మల్ని తప్పించాలంటే నేను ఆత్మార్పణం చేసుకుంటానికి, అలా అయితే నేలాటిచిక్కులు సమూలంగా నిర్మూలమవుతాయి. ఈ దుష్ఫలితానికి మరొకరు గురిగాకుండా ఈ నిర్భాగ్యపు నీడ మరొకరికి సోకకుండా పోతుంది అంది.

ఈ మాటలతో సఖీ ఒక్కసారి చిటపట లాడిపోయింది. నిగార్ అని కఠిన స్వరముతో పిలిచింది. ఈ భావం నీలో కలిగిందంటే మీ అన్నయ్య ఆయనతో పాటు నేనుకూడా రావలసివస్తుంది జాగ్రత్త, అంది.

నిగార్ అనునయస్వరంతో మరైతే ఎందుకమ్మా వాకులేని చింత నీకు. ఏం, సంతోషంగా ఎందుకుండకూడదు? అంది.

కాదు నిగార్, యేదన్నా సమస్య వుంటే, ఆలోచించే అవసరంలేకుండా యెలా వుంటుంది చెప్పు. ఎంతైనా నే నీ గృహ యజమానురాల్ని కాదూ! అంది సఖీ.

కావచ్చుకాని ఇది మనోవ్యాధి క్రిందికి మాత్రం మారకూడదు వదినా ! అవును నిజమేకాని కొన్ని సమయాలలో అదైనా తాత్కాలికంగానే యిలాంటి స్థితి యేర్పడుతూవుంటుంది. యిందువల్ల భవిష్యత్తుకు యేమీ నష్టంలేదు. యేదో రెండురోజులపాటు వుంటుంది; పోతుంది. ఈ సందర్భంలోనే నీవు స్థిరముగా శాశ్వతంగా నిర్ణయాలు చేసుకోవడం సబబుగాదు. అలాగైతే యీ యిల్లంతా సర్వనాశన మయినట్టే ...

నే నీ గృహజీవితాన్ని ఆనందమయం చేసి కలకలలాడించడానికి వచ్చానేగాని దుఃఖాకులం చేయటానికి కాదు. ఆఁ మనకీ సమస్యలు మహావుంటే మరికొన్నాళ్ళకే పరిష్కారం కావచ్చు. శిశిరం తరువాత వసంతం ఎలానూ వస్తుంది.

ఈ దెబ్బతో నిగార్ మౌనం అవలంబించింది. వదినెకు తనపట్ల వున్న ఔదార్యాన్ని ఆవిడ మనస్సులోనే అభినందించుకొని, అన్నా వదినెలకి చేయెత్తి మ్రొక్కకుండా వుండలేకపోయింది.

*   *   *

ఏమిటి ? అర్ధరాత్రైనా యింకా ఆలోచిస్తూనే వుంటారేం. ఇకపడుకోండి, అంది సఖీ భర్తని చూస్తూ. అప్పటికి సఖీ ఒక్క చిన్నకునుకుతీసి లేచింది. భర్త యింకా అలానే ఆలోచిస్తూ గడ్డంక్రింద చేయి వుంచుకొని మంచంపట్టె క్రిందికి కాళ్ళుచాచి ఆడిస్తూ కూర్చున్నాడు.

ఏముంది సఖీ! ఎప్పుడూ నా ఆలోచన ఒకటే, అది నిగార్ పెళ్ళిని గురించే. అవును, నిజమేగాని ఇలా అర్ధరాత్రిళ్లు నిద్రకు దూరమై ఆరోగ్యాన్ని పోగొట్టుకుంటే పెళ్ళవుతుందా ?

మరేం చేయమంటావు. అసమర్థత్వం వినా నాదగ్గర మరేముందని! వయస్సులో వున్న చెల్లెలికి పెళ్ళిచేయకుండా దాని జీవితాన్ని కన్నీరు మున్నీరుగా యేడ్పిస్తున్నాను. అమ్మ నాన్న నాకు అప్పజెప్పినబాధ్యతను నెరవేర్చలేకపోయాను. పట్టి అసమర్థుణ్ణి అంటూ మహబూబ్ కన్నీళ్ళు వదిలాడు.

ఛా ! అదేమిటండీ, మీరు మాత్రం పరిస్థితులు సరిపడనప్పుడేం చేస్తారు. చేయడం యిష్టంలేకనా ? నిగార్‌ను చూస్తుంటే నిజంగా నాకూడా కడుపు తరుక్కుపోయినట్టుంటుంది, నల్లదైనా ఎంత అందం. ఎంత అణకువ, ఆవిడ యౌవనం అంతా అడవికాచిన వెన్నెలవుతోంది పాపం. కాని దేవుడు అవసరమైన

# శరల్లీల


ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు
ఎమ్. గోపాలకృష్ణమాచార్యులు


సీ. నెత్తమ్మి మొత్తమ్ము చిత్తమ్ము నలరింప
దినబాంధవుని నవ్యదీప్తితోడ,
నెమ్మి నమ్మిన కల్వ చిమ్ము కన్నుల వెల్గు
వలపు మెఱుగుల వాలువన్నె విడగ
నవ్వువెన్నెలఁ బువ్వు గవ్వించి కవ్వించి
పువ్వుటమ్ములవాని పూజ నంద
క్రొమ్మొగ్గలు లెగజిమ్మి క్రొత్తచెల్వును నింపి
బంగారు సస్యమ్ము పర్వు మిడగ
శోకసంతప్త మానవలోక మెడల
వచ్చె శారదహేల విశ్వాస మిడుచు
పైడిపంటలు పండఁగఁ బడితి మెట్టు
నత్తవారిల్లు వోలె ని య్యవని వెలిగె.

ఉ. క్రాలెఁ బయోదముల్ ధవళ
కాంతుల నంబరసీమఁ దారకల్
హేల, విలోకనప్రభల
నిందుమనోహరు ముంచి వైచెనా
బాలశశాంకమూర్తి ప్రియ
భామలఁ గూరిమి నొంది, నిర్మల
శ్రీలఁ దనర్చెః ప్రేమికుల
లేతయెడందలు డోల లూగగన్.

క॥ మెండుగఁ గూలంకషలే,
పండించిన పంట కనులపండువు నిడగన్
ఎండిన బ్రతుకుల గతుకుల,
గుండెలలో వెలితి తీటి కుతుకము నిండెన్

క॥ పారదధవళ మ్మగు కా
సారసుధామధురజలము సంతస మిడగన్
పారము నెఱుగని తమితోఁ
గైరవములు గ్రోలి యమృతకాంతునిఁ దన్పెన్.

క॥ చిక్కని చలి మిక్కుటమై
యక్కటికము మాని "చీని" యాత్మల నెల్లన్.
నొక్కుచు నెత్తురు వోవఁగఁ
బ్రక్కకు నెట్టెడిని వీరభారతసీమన్. *

---

సంపద నివ్వనప్పుడు మనం యెంత ఆవేదనపడి లాభ మేముంది. అంది సఖీ, భర్త కన్నీరు తుడుస్తూ, మృదువుగా.

పొరపాటు పడుతున్నావు సఖీ, దేవుడు మనకు సంపద నిస్తే మనం చేయ వలసిన దేముంది. అంతా మన ఐశ్వర్య బలంతోనే జరిగిపోతుంది. కాని మన ప్రజ్ఞకు విలువ కనపడదు. సంపదలు లేనప్పుడు మనిషి అవసరాలు నెరవేర్చు కోవడంలోనే స్వీయప్రజ్ఞ గోచరిస్తుంది చూడు. నాన్నగారు యే సంపదతో మా కుటుంబాన్ని పోషించగలిగి నా కెంత వరకు చదువు చెప్పించగలిగారు. ఇదంతా ఆయన కర్తవ్య నిర్వహణకాదూ !

ఇప్పుడు నేను మామగారినీ మిమ్మల్నీ కించపరచాలన్న వుద్దేశంతో మాట్లాడం లేదు. క్షమించండి. కాలం కలిసిరాన ప్పుడు ప్రజ్ఞ వుంటే ప్రయోజనం లేదను కుంటాను. మరింత చదువు చదివి ఒక్క చిల్లిదమ్మిడీకూడా ఆసించకుండా, రిక్త రాల్ని నన్ను పెళ్ళి చేసుకున్నారు. బహుశా కట్నం బేరంతో ఏ ధనవంతుల అమ్మాయినో వివాహమాడితే యింత యిబ్బంది వుండేదికాదేమో ! నిగార్ పెళ్ళి అవటం యింత జటిలసమస్యకాక పోయేదేమో.

ఇది నా నిర్ణయంకాదు సఖీ, అమ్మా నాన్నల ఆదేశం. దీనికి తిరుగులేదు. వారు వెళ్ళిపోయింతరువాత ఒకటి రెండుసార్లు ఈ విషయం పునరాలో చింతామని నేను ప్రయత్నించకపోలేదు. కాని నిగార్ నన్ను తీవ్రంగా విమర్శించి నిరిదిద్దింది. ఏమైనా నీ సహచర్యం అను భవంతో నాకు ధర్మాన్ని గుర్తించిన చింత లవలేశం లేకుండా పోయింది. దీంతో నేను ఆసంత పొరబాటలేదని అంతా మంచికే జరిగిందని యిప్పుడు విశ్వసిస్తు న్నాను. కాని నిగార్‌ని తలుచుకున్నప్పు డల్లా నాకు మతిపోతూంటుంది సఖీ.

అయితే మనం ఇందులో చేయగలిగిం దేమిటో ముందు తేల్చండి. మన శాయ శక్తులా కృషిచేద్దాం.

అదే నేనూ ఆలోచిస్తున్నాను. కాని పాలుపోవడంలేదు.

ఇద్దరూ కాసేపు మౌనంగా వున్నారు. గదిలో వాతావరణం స్తబ్ధప్రశాంతంత యేర్పడింది. కాని గదిలో వున్న యిద్దరి మనస్సులలో కల్లోలం పని చేస్తోంది. ఇద్దరూ మౌనంగానే తీవ్రంగా ఆలో చిస్తున్నారు. నిట్టూరుస్తున్నారు. మహ బూబ్ యేమీతోచక ఒక గ్లాసెడు మంచి నీళ్ళు గడగడా త్రాగేశాడు. ★



తాజా టీ
పరిమళమైన టీ
ఉత్తమ టీ

# టాటా-ఫిన్లే
# టీ

*సాటిలేని టీ!*

* తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

* అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

* టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్, లలిత్ లీఫ్ టీ, మిలాప్ లీఫ్ టీ, బహదూర్ డస్ట్ టీ, షాన్ డస్ట్ టీ



# ఎనిమిదేళ్ల రాష్ట్రప్రగతి

సి. వి. హెచ్. రావు

**1956** నవంబరు మొదటితేదీన ఆంధ్ర ప్రదేశ్ ఆవిర్భవించిన నాటి నుంచి గడచిన ఎనిమిది సంవత్సరాల కాలాన్ని ఒకపర్యాయం సింహావలోకనం చేసినట్లయితే, పూర్వ ఆంధ్రరాష్ట్రం, తెలంగాణాలోని తొమ్మిదిజిల్లాల విలీనీకరణ ద్వారా ఏర్పడిన ఈ రాష్ట్రం తన అస్తిత్వాన్ని నిరూపించుకున్నదనే అభిప్రాయం స్పష్టంగా ఏర్పడుతోంది. ఆంధ్ర, తెలంగాణాప్రాంతాల పరిపాలన, ఆర్థిక వ్యవస్థల వల్ల ఉత్పన్నమైన కొన్ని క్లిష్ట సమస్యలను అధిగమించి ఈ నూతనరాష్ట్రం, ఈ ఎనిమిది సంవత్సరాలలో ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానికాది రంగాలలో గమనార్హమైన అభ్యున్నతిని సాధించింది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు దానికి కొన్ని అననుకూల పరిస్థితులు ఎదుర్కొన్నాయి. విలీనీకరణకు పూర్వం తెలంగాణాలోని రాజకీయ, ఆర్థికవ్యవస్థల క్లిష్టతవల్ల ఈ పరిస్థితులు ఉత్పన్నమయాయి. అయితే కొన్ని అనుకూల పరిస్థితులు కూడా వున్నాయి. రెండు భిన్నమైన రాష్ట్రాలలో విడివిడిగా నివసిస్తున్న తెలుగు మాతృభాషగాగల ప్రజలందరినీ ఏకంచేస్తూ ప్రజాస్వామికవ్యవస్థలో ఒకేరాష్ట్ర నిర్మాణం జరిగిందనే ఉత్సాహం, ఈ నూతన రాష్ట్రం యొక్క విశిష్టతకు తగిన రాజధానీ నగరం కూడా లభించిం దనే సంతృప్తిభావం ఈ అనుకూలపరిస్థితులలో ప్రధానమైనవి.

గత ఎనిమిది సంవత్సరాలలో, వ్యవసాయం పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి అభివృద్ధిలో విడివిడిగా సాధించిన విజయాలు, ఈ రంగాలలో మొత్తంమీద పొందిన సత్ఫలితాల ఆధారంగా జరిపిన మదింపునుబట్టి ఈ ఎనిమిదేళ్ళకాలంలో ఆర్థిక రంగంలో సాధించిన అభ్యున్నతి గణనీయమైనది. ఎందుచేతనంటే ఈ పరిస్థితి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో 1956 వ సంవత్సరానికి పూర్వం భిన్నంగా వుండేది. ఈ పరిస్థితిని దాటి రాష్ట్రం ముందంజ వేయడానికై ఈ రెండు ప్రాంతాలమధ్య కొంత సమానత్వాన్ని సాధించడానికి యత్నం చేయవలసి వచ్చింది. అభివృద్ధిలో కొంత అసమానత ఇప్పటికీ వుందనడంలో సందేహంలేదు. అయితే, రాష్ట్రమంతటాకూడా అభివృద్ధి సాధ్యమైనంతవరకు ఒకే విధంగా జరగాలనీ, ఉప ప్రాంతాల అభివృద్ధిని వేర్వేరు దృక్పథాలతో చూడరాదనే ప్రధానమైన సూత్రాన్ని ఆమోదించి అమలుపరచడం జరుగుతున్నది.

వ్యవసాయమే మనరాష్ట్రంలో ముఖ్య పరిశ్రమ. రాష్ట్రజనాభాలో 70 శాతం మందికి ఇది జీవనాధారం, ప్రధానవృత్తి. వ్యవసాయాన్ని లాభసాటియైన వృత్తిగా రూపొందించడానికీ, కర్షకునికి ఆర్థిక పరిపుష్టిని చేకూర్చడానికీ, రాష్ట్రసంపద అభివృద్ధికి ప్రధానాంగమైన భూమిలో అనేక ఆహార, వ్యవసాయ పంటలను సమృద్ధిగా పండించడానికీ ఉద్దేశించిన అనేక పథకాలకూ, కార్యక్రమాలకూ రాష్ట్ర ప్రణాళికలలో ప్రాధాన్యం ఇవ్వబడింది. నిర్మాణ కార్యక్రమం బాగా అభివృద్ధిదశలోగల నాగార్జునసాగర్, తుంగభద్ర ఎగువకాలువ, దిగువకాలువ, కడెంప్రాజెక్టు, పథకాలు, పనులు కొనసాగుతున్న పోచంపాడు, వంశధార, రాజోలిబండ మళ్ళింపు పథకం వంటి కొన్నిభారీ సేద్యపునీటి పారుదల ప్రాజెక్టులను నిర్మించడం, రాష్ట్రం మొత్తం మీద 18 మధ్యరకం సేద్యపునీటి పథకాలను అమలుపరచడం స్థానికంగా సత్వర ప్రయోజనం చేకూర్చే చిన్నతరహా సేద్యపునీటి పారుదల పథకాలను రాష్ట్రమంతటా చేపట్టడాన్ని కూడా ఈ కార్యక్రమం ఉద్దేశిస్తున్నది.

ఇంతేకాక ఆహారోత్పత్తిని పెంపొందించడానికీ, ఆ లక్ష్యాన్ని సాధించేందుకు రైతులకు ఆర్థికసహాయం తదితర సహాయాలు అందజేసి ప్రోత్సాహ మివ్వడానికీ అనేక ఇతర కార్యక్రమాలుకూడా అమలు పరచబడుతున్నాయి. వీటి పర్యవసానంగా, గత దశాబ్దికాలములో వ్యవసాయోత్పత్తి



అనంతపూరుజిల్లాలోని చిన్న హాగరి ఆక్విడక్ట్‌కు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవము చేస్తున్నారు.

రెండింతలు పెరిగింది. 1951 వ సంవత్సరంలో వ్యవసాయోత్పత్తి 41 లక్షల టన్నులు వుండగా 1962 నాటికి అది 67.3 లక్షల టన్నులకు హెచ్చింది. 1966 నాటికి ఇది 90 లక్షల టన్నులకు పెరిగే అవకాశం వుంది.

## తీవ్రతర వ్యవసాయ కార్యక్రమం

దేశంలో పెరుగుతున్న ఆహార అవసరాల దృష్ట్యా వ్యవసాయోత్పత్తిని పెంపొందించవలసిన ఆవశ్యకతను పురస్కరించుకొని పశ్చిమ గోదావరి జిల్లాలో అంతటా తీవ్రతర వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాన్ని మరో 150 బ్లాకులలో నవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని, నిర్ణీత ప్రాంతాలలో ప్రత్తి, నూనెగింజలు, చెరకు, పొగాకు వంటి వ్యాపార పంటలు, వ్యవసాయక ముడి వస్తువుల విషయంలో ప్యాకేజ్ కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు. ఆహార రంగంలో స్వయం సమృద్ధిని సాధించే యత్నంలో మన రాష్ట్రం నిర్వహిస్తున్న గురుతరమైన పాత్రను జాతీయ స్థాయిలో గుర్తించడం, రాష్ట్రస్థాయిలో అంగీకరించటం జరిగింది. దీనిని పురస్కరించుకొని రాష్ట్ర ప్రభుత్వం నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణాన్ని ముగించడానికై అధికంగా సహాయం అందజేయవలసిందంటూ కేంద్రాన్ని గత కొన్ని సంవత్సరాలుగా అభ్యర్థిస్తూ వున్నది. చిన్న తరహా సేద్యపు నీటి పారుదల సౌకర్యాలను పెంపొందించడానికీ, విత్తనాల ఉత్పత్తి, మొక్కల సంరక్షణ, మెట్టసాగు భూసార సంరక్షణ మొదలైన పథకాలను పటిష్ఠంగా అమలు జరపడానికి ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నది.

నాగార్జునసాగర్ కొరకు 1964_66 సంవత్సరాలకు రూ. 13 కోట్లు ఇవ్వమంటూ రాష్ట్రప్రభుత్వం కేంద్రాన్ని అభ్యర్థిస్తున్నది. దీనిలో కొంత మొత్తాన్నయినా కేంద్రం ఇవ్వవచ్చని ఆశించబడుతున్నది. రాష్ట్రప్రభుత్వం చేస్తున్న ఈ విజ్ఞాపనలకు ప్రజానీకపు పూర్తి మద్దతు వుంది. నాగార్జునసాగర్‌కు ఈ దశలో తగు ఆర్థిక సహాయం లభించినట్లయితే దీనినుంచి గణనీయమైన ప్రయోజనాలు సిద్ధిస్తాయి. రాష్ట్రప్రభుత్వం కొన్ని ఇతర భారీ సేద్యపు నీటి పారుదల ప్రాజెక్టుల నిర్వహణకు కూడా తగినంత ఆర్థిక వసతులను సమకూర్చుకోవలసి వుంది. వీటిలో పోచంపాడు, తుంగభద్ర కాలువ పథకాలు, చాలా ముఖ్యమైనవి. ఎందుచేతనంటే వీటివల్ల తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో సేద్యపు నీటి పారుదల అవసరాలను తీర్చడానికి వీలుంటుంది. ఈ భారీ దీర్ఘకాలిక ప్రాజెక్టులపై అధిక మొత్తాలు ఖర్చు చేయబడుతుండగా రాష్ట్రప్రభుత్వం అభివృద్ధి పన్నుల వసూలు ద్వారానూ, వ్యవసాయదార్లు తమ క్షేత్రాలలో పంటకాలువలు త్రవ్వి వాటిని సక్రమ పద్ధతిలో వుంచేలా చేయడంద్వారానూ ఈ ప్రాజెక్టులవల్ల కలుగు సేద్యపు నీటి పారుదల శక్తి సమర్థవంతంగా, ఫలప్రదంగా వినియోగం కావడానికి అవసరమైన, ముఖ్యమైన ప్రాథమిక కృషిలో నిమగ్నమైవుంది.



అనంతపూరుజిల్లాలోని చిన్న హాగరి అక్విడక్ట్‌కు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవము చేస్తున్నారు.

రెండింతలు పెరిగింది. 1951 వ సంవత్సరంలో వ్యవసాయోత్పత్తి 41 లక్షల టన్నులు వుండగా 1962 నాటికి అది 67.3 లక్షల టన్నులకు హెచ్చింది. 1966 నాటికి ఇది 90 లక్షల టన్నులకు పెరిగే అవకాశం వుంది.

## తీవ్రతర వ్యవసాయ కార్యక్రమం

దేశంలో పెరుగుతున్న ఆహార అవసరాల దృష్ట్యా వ్యవసాయోత్పత్తిని పెంపొందించవలసిన ఆవశ్యకతను పురస్కరించుకొని పశ్చిమ గోదావరి జిల్లాలో అంతటా తీవ్రతర వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాన్ని మరో 150 బ్లాకులలో సవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని, నిర్ణీత ప్రాంతాలలో ప్రత్తి, నూనెగింజలు, చెరకు, పొగాకు వంటి వ్యాపార పంటలు, వ్యవసాయక ముడి వస్తువుల విషయంలో ప్యాకేజ్ కార్యక్రమాన్ని అమలు పరుస్తున్నారు. ఆహార రంగంలో స్వయం సమృద్ధిని సాధించే యత్నంలో మన రాష్ట్రం నిర్వహిస్తున్న గురుతరమైన పాత్రను జాతీయ స్థాయిలో గుర్తించడం, రాష్ట్ర స్థాయిలో అంగీకరించటం జరిగింది. దీనిని పురస్కరించుకొని రాష్ట్ర ప్రభుత్వం నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణాన్ని ముగించడానికై అధికంగా సహాయం అందజేయవలసిందంటూ కేంద్రాన్ని గత కొన్ని సంవత్సరాలుగా అభ్యర్థిస్తూ వున్నది. చిన్న తరహా సేద్యపు నీటి పారుదల సౌకర్యాలను పెంపొందించడానికి, విత్తనాల ఉత్పత్తి, మొక్కల సంరక్షణ, మెట్టసాగు భూసార సంరక్షణ మొదలైన పథకాలను పటిష్ఠంగా అమలు పరచడానికి ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నది.

నాగార్జునసాగర్ కొరకు 1964-66 సంవత్సరాలకు రూ. 13 కోట్లు ఇవ్వమంటూ రాష్ట్రప్రభుత్వం కేంద్రాన్ని అభ్యర్థిస్తున్నది. దీనిలో కొంత మొత్తాన్నయినా కేంద్రం ఇవ్వవచ్చని ఆశించబడుతున్నది. రాష్ట్రప్రభుత్వం చేస్తున్న ఈ విజ్ఞాపనలకు ప్రజానీకపు పూర్తి మద్దతు వుంది. నాగార్జున సాగర్‌కు ఈ దశలో తగు ఆర్థిక సహాయం లభించినట్లయితే దీనినుంచి గణనీయమైన ప్రయోజనాలు సిద్ధిస్తాయి. రాష్ట్రప్రభుత్వం కొన్ని ఇతర భారీ సేద్యపు నీటి పారుదల ప్రాజెక్టుల నిర్వహణకు కూడా తగినంత ఆర్థిక వసతులను సమకూర్చుకోవలసి వుంది. వీటిలో పోచంపాడు, తుంగభద్ర కాలువ పథకాలు, చాలా ముఖ్యమైనవి. ఎందుచేతనంటే వీటివల్ల తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో సేద్యపు నీటి పారుదల అవసరాలను తీర్చడానికి వీలుంటుంది. ఈ భారీ దీర్ఘకాలిక ప్రాజెక్టులపై అధిక మొత్తాలు ఖర్చు చేయబడుతుండగా రాష్ట్రప్రభుత్వం అభివృద్ధి పన్నుల వసూలు ద్వారానూ, వ్యవసాయదార్లు తమ క్షేత్రాలలో పంటకాలువలు త్రవ్వి వాటిని సక్రమ పద్ధతిలో వుంచేలా చేయడంద్వారానూ ఈ ప్రాజెక్టులవల్ల కలుగు సేద్యపు నీటి పారుదల శక్తి సమర్థవంతంగా, ఫలప్రదంగా వినియోగం కావడానికి అవసరమైన, ముఖ్యమైన ప్రాథమిక కృషిలో నిమగ్నమైవుంది.



మూసీ ప్రాజెక్టు దృశ్యం

వినియోగించుకోవాలనే పునాదులపై నిర్మించాలనీ, అనేక వ్యవసాయక పరిశ్రమల పట్ల ప్రాథమిక శ్రద్ధ వహించాలనే విధానాలను గత ప్రణాళికలలోనూ, ప్రస్తుత ప్రణాళికలోనూ, రాష్ట్రప్రభుత్వం అనుసరించినట్లు విదిత మవుతుంది. మధ్య తరహా పరిశ్రమలు, లఘు పరిశ్రమల అభివృద్ధిని ప్రధానంగా ప్రోత్సహించాలన్నది ఈ విధానపు మరో అంశం. ఇటువంటిపరిశ్రమలకు సాంకేతికపరిజ్ఞానం, పెట్టుబడులు మితంగానే అవసర మవుతాయి. ఈ పరిశ్రమలను ప్రధానంగా ప్రైవేటు పారిశ్రామికవేత్తలు కానీ లేక వారి సహకారంతో కానీ ప్రారంభించాలని కూడా ఈ విధానం ధ్యేయం. పరిశ్రమలను స్థాపించే పారిశ్రామికవేత్తలకు ఋణాలు, నివేశన స్థలం, రాయితీరేట్లకు విద్యుచ్ఛక్తి సరఫరా రావాణా రాకపోకల సదుపాయాలు మొదలైన అవసరమైన సహాయ సౌకర్యాలు కల్పించబడతాయి. ఈ కార్యక్రమంలో భాగంగా రాష్ట్ర ప్రభుత్వం, ఇప్పటి వరకు ఈ పబ్లిక్ రంగంలో నిర్వహించబడుతున్న కొన్ని మధ్యతరహా పరిశ్రమల నిర్వాహణ నుండి వైదొలుగుతున్నది. రాజమండ్రిలోని కాగితం మిల్లుల నిర్వహాణ బాధ్యతను ప్రైవేటు పారిశ్రామిక సంస్థకు అప్పగించడం ఈ విషయంలో పేర్కొనబడిన ఉదాహరణ.

కొన్ని గ్రామీణ పారిశ్రామిక క్షేత్రాలనూ, జిల్లాకు కనీసం ఒకటి చొప్పున పారిశ్రామిక క్షేత్రాలను నెలకొల్పడం రాష్ట్ర పారిశ్రామిక విధానపు మూడవఅంశం నాలుగవఅంశం కుటీర, గ్రామీణ పరిశ్రమలకు సుదృఢమైన ప్రాతిపాదికను ఏర్పరచడం – ఇందునిమిత్తం స్వతంత్ర ప్రతిపత్తిగల ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు నెలకొల్పబడింది. స్థానిక చేతి పరిశ్రమలను, చర్మ పరిశ్రమ వంటి కొన్ని ఇతర పరిశ్రమలను అభివృద్ధి పరచడం మరో అంశం. ఈ విషయంలో రాష్ట్రంలోని కొన్ని ప్రదేశాలలో ప్రత్యేక సదుపాయాలు కల్పించబడుతున్నాయి; ఇక చివరిది కేంద్రం ఆధ్వర్యంలో ప్రారంభించబడే గ్రామీణపరిశ్రమల ప్రాజెక్టు కార్యక్రమాలను అమలుపరచడం.

## మూడు కార్పొరేషన్లు

రాష్ట్రంలోని అపారంగా విస్తృతమై వున్న ఖనిజసంపదను పారిశ్రామిక విషయాల నిమిత్తమై వినియోగించే అవకాశాలను కల్పించడానికీ, కొన్నింట విదేశ పారిశ్రామిక వేత్తల సహకారంతోనూ, మరి కొన్నింట ప్రయివేటు పారిశ్రామిక వేత్తల సహకారంతోనూ తగిన – మధ్య తరహా, లఘు పరిశ్రమల ఏర్పాటుకు ప్రోత్సాహాన్నివ్వడానికీ – అంటే ఆర్థిక సాంకేతిక, యితరవిధాలైన సహాయాన్ని వాటికి కల్పించడానికిగాను ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషను అనే మూడు ప్రభుత్వ కార్పొరేషన్లు నెలకొల్పడం అనేది ప్రభుత్వం యొక్క ముఖ్యోద్దేశం. ఈ కార్పొరేషన్లు తమ కార్యకలాపాల విషయంలో ఆదిలో ఎదురయిన విమర్శను దాటుకుని చాలా ఆరిష్టాల్ని అధిగమించి ఎట్టకేలకు యిప్పటికి తమతమ రంగాలల్లో ప్రధానపాత్రవహించేవిషయంలో దృఢంగా ముందుకొచ్చి నిలిచాయి.

దేశంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికీ యితర రాష్ట్రాలకూ గాని, లేదా ఆంధ్రప్రదేశ్‌కూ యితర ప్రాంతాలకూ గాని ప్రస్తుతం అమలుజరిగే అభివృద్ధి కార్యకలాపాలలో వున్న అసమానతలను తొలగించడానికి కేంద్రం రూపొందించిన పబ్లిక్ రంగంలోని ప్రాజెక్టుల కేటాయింపు విషయంలోనూ, పంపిణీ విషయంలోనూ కేంద్రంయొక్క విధానానికి చిహ్నంగా భావించదగిన ప్రాజెక్టులు – యీ పాటికే యీ రాష్ట్రానికి కేటాయించబడిన సింథ

టిక్ మందుల కర్మాగారం, భారీవిద్యుత్పరికరాల కర్మాగారం, డిఫెన్సు ఎలక్ట్రానిక్ లేబరేటరీలూ నెలకొల్పాలని ప్రతిపాదించిన హిందుస్థాన్ మెషిన్ పరికరాల యూనిట్లు, డిఫెన్స్ మెటలర్జికల్ లేబరేటరీ — వంటి ప్రాజెక్టులే కాక మరికొన్ని కేంద్ర పబ్లిక్ సెక్టార్ ప్రాజెక్టులను చేర్చినప్పుడే అఖిలభారత పారిశ్రామిక పటంలో ఆంధ్రప్రదేశ్ సముచితస్థానం వుండగలదనిన్నీ,. అప్పుడే రాష్ట్రంలో పారిశ్రామిక ప్రగతి సాధించబడగలదనిన్నీ ఒకభావం ప్రజల్లోనూ, ప్రభుత్వంలోనూ వుంది. విశాఖపట్టణం ప్రాంతంలో భారీ ఉక్కు కర్మాగారాన్ని స్థాపించే ప్రయత్నాన్ని విరమించుకోవడం రాష్ట్రంలో విపరీతమైన నిరుత్సాహాన్ని కలిగించిందనే విషయం యిక్కడ ప్రస్తావించకతప్పదు.

## ప్రగతికి మూలం

ఈ ఆధునిక కాలంలో ఏ దేశంలోనన్నా ఆర్థిక, సాంఘిక ప్రగతికి విద్యుచ్ఛక్తి మూలస్తంభం వంటిది. ఆంధ్రప్రదేశ్ యీనాడు బాగా వెనకబడి వున్న రంగాలలో యీ విద్యుచ్ఛక్తి రంగంకూడా ఒకటి. అయితే యీ వెనుక బడి వుండడం అనేది కేవలం యిక్కడి పారిశ్రామిక, వ్యవసాయ ప్రగతికి అవసరమయ్యే జల థర్మల్ విద్యుదుప్పాదకశక్తి — కొరతపడడం అనేదేమీ కాదు.

తృతీయ పంచవర్ష ప్రణాళిక ఆరంభం నాటికి రాష్ట్రంలో స్థాపిత విద్యుదుత్పాదక శక్తి కేవలం 213 ఎమ్.జి.లు మాత్రమే. కాగా స్థిరమైన శక్తి 140 ఎమ్. జి. లు 1966 నాటికి అవసరమయ్యే విద్యుచ్ఛక్తి అంచనా సుమారు 600 ఎమ్, జి. అయితే ప్రస్తుతం అమలులో వున్న వివిధ పథకాల వల్లనేమి, విస్తరించిన పథకాల వల్లనేమి, 1966లోగా కొత్తగా ఉత్పత్తి చేసే విద్యుచ్ఛక్తి వల్లనేమి లేదా వుత్పత్తి చేయదలచిన విద్యుచ్ఛక్తి వల్లనేమి లభించే విద్యుచ్ఛక్తి సుమారుగా 340 ఎమ్. జి.లు మాత్రమే. విద్యుచ్ఛక్తి కొరతతో బాధపడే రాష్ట్రానికి యీ మొత్తం చాలా తక్కువే. అయితే సంతోషించదగ్గ విషయమేమిటంటే పరిశ్రమలకూ, వ్యవసాయ దారులకూ, గ్రామీణ ప్రాంతాలకు - ముఖ్యముగా యీ విషయంలో ఆంధ్రతో పోల్చిచూసినప్పుడు బాగా వెనుకబడిన తెలంగాణా ప్రాంతంలో-విద్యుచ్ఛక్తి పంపిణీని అధికం చేయడంలో, విద్యుదుత్పాదనను హెచ్చు చేయడంలో రాష్ట్ర ప్రభుత్వం చాలా శ్రద్ధ తీసుకుంటోంది. హైదరాబాదు, విజయవాడలలో రెండు విద్యుదుత్పాదక టర్బో యూనిట్లను నెలకొల్పడానికి, రామగుండం, నెల్లూరులవద్ద ప్రతిపాదిత విద్యుచ్ఛక్తిని అధికం చేయడానికి; ప్రస్తుతం వున్న పరికరాలను పునర్వ్యవస్థీకరించడం, విస్తృతీకరించడం చేయడానికి అవసరమయ్యే పరికరాలనూ, మెషిన్లను దిగుమతి చేసుకోడానికి కావలసిన విదేశ మారక ద్రవ్యాన్ని విడుదల చేయవలసిన కేంద్రంయొక్క సహకారంతో రాష్ట్రప్రభుత్వం యీ విషయంలో తగు చర్యలను తీసుకొంటోంది. ప్రయివేటు పారిశ్రామిక వేత్త డా. ధర్మతేజ ప్రతిపాదనను రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలు అంగీకరించాయి. మొత్తం 200 ఎమ్. జిల విద్యుదుత్పాదక శక్తితో రామగుండంవద్ద మూడు జలవిద్యుత్ యూనిట్లను నెలకొల్పేందుకు చివరకు అనుమతి లభించింది. ఇదొక శుభ శూచకం.

భవిష్యత్తులో రాష్ట్రప్రగతి యీ రంగంలో మనం సాధించే అసాధారణమైన అభివృద్ధి మీద ఆధారపడి వుంటుంది గనుక విద్యుచ్ఛక్తి అభివృద్ధి ప్రయత్నాలు యిటుపై ఏమాత్రమూ అలక్షించబడవని ఆశింపవచ్చు. తుంగభద్రా జలవిద్యుత్ కేంద్రం రామగుండం థర్మల్ ప్రాజెక్టుల విస్తరణ వల్లా; బహుశా 1966 నాటికిగాని ఆ తరువాత కొద్దికాలానికి గాని పూర్తికావచ్చే ఎగువ సీలేరు రామగుండం విస్తరణ పథకాల అమలువల్లా; కొత్తగూడెం థర్మల్‌పథకం స్టేజి_2 లోనూ, దిగువసీలేరు ప్రాజెక్టు స్టేజి _1 లోనూ అప్పుడే ప్రారంభించిన



కృష్ణా బ్యారేజి



శ్రీశైలం ప్రాజెక్టు ప్రదేశం

ముందుచర్యల వల్లా; శ్రీశైలం ప్రాజెక్టు పనిని చురుకుగా కొనసాగించడానికి తీసుకున్న చర్యలవల్లా 1971నాటికి రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి కొరత అనేది తొలగిపోవడమే కాక చుట్టుపట్ల రాష్ట్రాలకుకూడా విద్యుచ్ఛక్తిని సరఫరాచేయగలిగే పరిపుష్టి ఆంధ్రప్రదేశ్‌కు ఏర్పడుతుంది.

పట్టణాలలో గృహావసరాల నిమిత్తం, పారిశ్రామిక వినియోగాల నిమిత్తం విద్యుచ్ఛక్తిని సరఫరా చేయవలసిన అవసరం ప్రధానమైనదే అయినప్పటికీ గ్రామీణ ప్రాంతాలవారికి విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కల్పించడంలో గాని, ఈనాడు అధికావసరం అనిపిస్తున్నట్టుగా వ్యవసాయ కార్యక్రమాలకు విద్యుచ్ఛక్తిని అందజేయడంలో గాని ఏ మాత్రము అలక్ష్యమూ తగదు. గ్రామీణ విద్యుదీకరణ రాష్ట్ర ప్రణాళికలో ఉన్నతస్థాయికి చేరుకుంది. 1962-63 నాటికి సుమారు 4,300 గ్రామాలకు, చిన్న చిన్న ఊర్లకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించబడింది 1963-64లో మరో 300గ్రామాలకు విద్యుచ్ఛక్తిని అందజేయడం జరుగుతుంది. తెలంగాణాలోని గ్రామాలు ఈ కార్యక్రమం క్రింద ప్రధానంగా లాభిస్తాయి.

## కొత్త పథం

పంచాయతీరాజ్ పథకాలు అనే వాటిని అంటే ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పథకాలు అనే వాటిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1959 నవంబరులో ప్రవేశ పెట్టడంతో ఒక సరికొత్త పథకానికి నాంది పలికినట్లయ్యింది. 1963 నాటికి అనేకమైన గిరిజన ప్రాంతాలతో ఒకో రాష్ట్రంలోగల మొత్తం గ్రామీణ ప్రాంతాన్నంతా 446 పంచాయతీ సమితి బ్లాకుల క్రింద వ్యవస్థీకరించడం జరిగింది. ఇవి తిరిగి 1964 లో 321 బ్లాకులక్రింద రూపొందించ బడ్డాయి.

కొత్తగా రూపొందించబడిన గ్రామ పంచాయితీల చట్టంక్రింద రాష్ట్రవ్యాప్తంగా 15,000 గ్రామాల్లో పంచాయితీల ఏర్పాటుకై జరిగిన యిటీవలి ఎన్నికలు నిజంగా గుర్తు పెట్టుకోదగ్గవి. వీటిల్లో 7,000 సుమారు గ్రామాల్లో పోటీలేకుండా సర్పంచులను ఎన్నుకున్నారు. పాతిక పంచాయితీల్లో సభ్యులందరు స్త్రీలే. , ఈ విధమైన పురోగతికి కారణం ప్రభుత్వం పోటీలేకుండా ఎన్నికయిన వాటికి బహుమతులను యిస్తామని ప్రకటించడం ఒక కారణమే, అయినా, నిజానికి, గ్రామీణులు పంచాయతీలకు గ్రామాభివృద్ధికీ, గ్రామ పరిపాలనకూ నిజమైన ఏజన్సీలని పరిగణించడంవల్లా పోటీ అనేది సంఘీభావనలోని పటిష్టతను బలహీన పరచడమే అని వారు భావించడం వల్లాను. గ్రామసభల్లో సమావేశమయిన ప్రజల యిష్టాయిష్టాల్ని తెలుసుకుని నిజమయిన ప్రజాస్వామిక పద్ధతిలో తమ అవసరాల్ని గూర్చి వ్యక్తం చేయడానికీ, సమాజ వికాస కృషిలో ప్రజల్ని ఉత్సాహపూరితంగా పాల్గొనేట్టు చేయడానికి వీలుగా స్థానిక స్వయం పరిపాలనా పథకంక్రింద గ్రామ ప్రజలకు వారి బాధ్యతలను గుర్తింప జేయడం, గ్రామీణులకు సంబంధించిన వివిధ ఆర్థిక, సాంఘిక అభివృద్ధి కార్యక్రమాలను అమలు పరచడం, పరిస్థితులను మెరుగు పరచడంవంటి అతి ప్రధానమైన, అత్యంత అవసరమైన తమ బాధ్యతలను నిర్వర్తించడానికి పంచాయతీలు, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు ముందు కొస్తాయని భావిద్దాం.

పంచాయతీరాజ్ సంస్థలకు ఎన్నికయిన వారికి వారి భుజస్కంధాల మీద అసంపూర్తిగా వదిలి వేయబడిన పనుల భారం చాలా వుందనడంలో ఎట్టి సందేహమూ లేదు.

పంచాయతీరాజ్ కారణంగా ఆంధ్రప్రదేశ్ గ్రామీణ ప్రాంతాలలో తలఎత్తుతున్న ఒక క్రొత్త తరహా పరిపాలనా వ్యవస్థ యీ గురుతర బాధ్యతా నిర్వహణకు చేయూత నివ్వాలి. సమాజాభివృద్ధి, ప్రజాస్వామ్య వికేంద్రీకరణ అనే పాథమిక

సూత్రాలపై కృషి జరిపినపుడే యిది ఫలిస్తుంది.

సాంఘిక న్యాయం, సాంఘిక సమానతల సిద్ధాంతాల మీద ఆధారపడి వుండే సాంఘిక అభివృద్ధిని సాధించడానికీ, ప్రజల జీవన స్థాయినీ పెంచడానికీ; జాతీయాభి వృద్ధిలో, ఆర్థిక ప్రగతిలో సరియైన, సమీకృత, సమన్వయత్వాన్ని సాధించడానికీ కేంద్ర, రాష్ట్ర పంచవర్ష ప్రణాళికలు రూపొందించబడ్డాయి. ఈ సాంఘిక న్యాయం, సాంఘిక సమానతలనేవి ఒకదానితో ఒకటి ముడివేయబడి, ఒకదాని మీద మరొకటి ఆధారపడి వున్న సమస్యలు. ఈ రెండింటిలోనూ మొదటి దానికి ఆచరణలో రెండవ దానికన్న ఎక్కువ ప్రాధాన్యత వుంది. అందుకు కారణం ఆర్థిక ప్రగతికి సంబంధించిన కార్యక్రమాల ఫలితాలను స్పష్టంగాదర్శించవచ్చు, గుర్తించవచ్చు కాని రెండవదానిఫలితాలు కళ్ళకు కనిపించవు.దాని ఫలితం కాలగతిలో మాత్రమే తెలియవస్తుంది.

## విద్య

ఆంధ్రప్రదేశ్‌లో ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రాథమిక సాంఘిక సేవా కార్యక్రమంగా విద్యకు ప్రముఖ స్థానం కల్పించబడింది. విద్యా రంగంలో గత ఎనిమిదేళ్ళల్లోనూ సాధించిన ప్రగతిని అంతకు ముందరి అభివృద్ధితో పోల్చి చూస్తే — సంఖ్యా బలంలోగాని, విద్యా ప్రమాణంలోగాని — తగుమాత్రంగానే వుంది. ఒక విధంగా సంఖ్యా బలం మాత్రమే అధికమయ్యిందని చెప్పవచ్చు కూడాను.

6 — 11 సం. వయస్సు వర్గంలోని బాలురలో 95 శాతం, బాలికల్లో 70 శాతం మేరకు విద్యార్థులుగా నమోదుచేయాలనే ధ్యేయంతో తృతీయ ప్రణాళికారంభంలో ప్రారంభించబడిన ఉచిత నిర్బంధ విద్యా పథకం అమలు అనేది యీ విద్యా రంగంలో ముఖ్యమైన కార్యక్రమం. దీని ప్రకారం ప్రతి ప్రాథమిక సంస్థలో అదనంగా 16 మంది పిల్లలను విద్యార్థులుగా నమోదు చేసుకోవడం, ప్రాథమిక విద్యా సంస్థల్లో అదనంగా 28,000 ఉపాధ్యాయులను చేర్చుకోవడం జరుగుతుంది. 1962 ఆఖర్లో ప్రకటించిన జాతీయ అత్యయిక స్థితి కారణంగా యీ ధ్యేయాలను కొద్దిగా తగ్గించవలసి వచ్చింది. విద్యకు కేటాయించిన నిధులు, చేర్చుకో దలచిన ఉపాధ్యాయుల సంఖ్యలో కోత సంభవించింది. పాఠశాలలో చేర్చవలసిన పిల్లల సంఖ్యలో ధ్యేయాన్ని 70 శాతానికి తగ్గించడం జరిగింది. ఏమయినా ఈ కారణంగా విద్యాభివృద్ధిలో కుంటువడిన అభివృద్ధి వచ్చే ప్రణాళికా కాలంలో చక్కబడి తిరిగి పూర్వపు వేగాన్ని ప్రాధాన్యతను సంతరించుకో గలదని భావిద్దాం.

మాధ్యమిక, సెకండరీ విద్యారంగం పరిస్థితిచాలావరకు మెరుగ్గానే ఉంది. అత్యవసరపరిస్థితి కారణంగా ఖర్చులో కొంత భాగాన్ని తగ్గించవలసివచ్చిన క్రొత్త పాఠశాలలను నెలకొల్పడంలోనూ, విద్యార్థుల ప్రవేశసంఖ్యను ఎక్కువచేయడంలోనూ గల లక్ష్యాన్ని దాదాపుగా సాధించడం జరిగింది. అయినా ఒక వైపు కళాశాలలోనూ, ఉన్నత విద్యలోనూ ప్రవేశానికి మొదటి మెట్టు కావడం, రెండో వైపు వివిధ సాంకేతిక విద్యాకోర్సులలో ప్రవేశానికి నాంది కావడం వల్లనూ విద్యావ్యవస్థలో సెకండరీవిద్య కీలక స్థానాన్ని ఆక్రమించిఉన్న దృష్ట్యా ప్రమాణ స్థాయిని అభివృద్ధి చేయడం, బోధనాస్థాయిని పెంచడానికి కృషిచేయడంతో పాటు సెకండరీ విద్యావిభాగ సౌకర్యాలను విస్తరింపజేయడం చాలా అవసరం.

రాష్ట్రంలో విశ్వవిద్యాలయం విద్య విషయంలో అమోఘమైన అభివృద్ధిని సాధించడం జరిగింది. మూడు విశ్వవిద్యాలయాలుచేసిన గణనీయమైన కృషికి యిది ప్రశంసార్హమైన విషయం. అయినప్పటికీ సాధించిన అభివృద్ధిని సమీకరించడానికి, విశ్వవిద్యాలయం, ఉన్నత విద్యలను ప్రయో



బోధన్ చక్కెర కర్మాగారం

జనకరం చేయడానికి వీలుగా కొన్ని సంవత్సరాల వరకు మరికొన్ని ఆర్ట్సు కళాశాలలను నెలకొల్పడాన్ని, పరిశోధన విభాగాలను పటిష్టం చేయడాన్ని విలుపు చేయడం చాలా అవసరం అని అనిపిస్తున్నది.

అతిస్వల్పాదాయ, స్వల్పాదాయ వర్గాల కుటుంబాల పిల్లలకై 10,000 మెరిట్ స్కాలర్‌షిప్పులను ఏర్పాటు చేయడం, ఉన్నత విద్యాస్థాయివరకు బాలికలందరికీ ఉచిత విద్యాసౌకర్యం కలిగించడం, ఇంజనీరింగ్ కళాశాలలు, పాలిటెక్నికులలోని ప్రశంసార్హమైన, చురుకైన విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు మంజూరు చేయడం, ప్రత్యేకంగా బాలికలకు సాంకేతిక విద్యా సౌకర్యాలను విస్తరింపజేయడం వంటి కొన్ని యితర కార్యక్రమాలను అమలుచేసిన రాష్ట్ర ప్రభుత్వాన్ని అభినందించాలి. 6-11 సంవత్సరాల మధ్యవయస్సుగల దాదాపు 10 లక్షల మంది బాలబాలికలకు వర్తించే మధ్యాహ్నభోజన పథకం అమలు చేయడం మరో ప్రయోజనకరమైన కార్యక్రమం. దీనిని యునిసెఫ్, కేర్ సంస్థల సహాయంతో అమలుచేస్తున్నారు. అయితే ఇప్పుడు కేర్ సంస్థ మాత్రమే ప్రధానంగా సహాయపడుతున్నది. ప్రత్యేకంగా రాష్ట్ర సాధారణాభివృద్ధి ప్రాథమిక, సెకండరీ స్థాయిల విద్యా విస్తరణతోనూ సాంఘిక, వయోజన విద్యాభివృద్ధితోనూ ముడిపడి ఉంది, ప్రజల సాధారణ సాంస్కృతిక జీవనంపై ప్రభావం కలిగించేదవడం వల్ల విద్యారంగంలో యింకా యితోధిక కృషి జరగాల్సి ఉంది.

## సాంస్కృతిక పురోభివృద్ధి

సాంస్కృతిక పురోభివృద్ధి విషయంలో గత 8 సంవత్సరాల కాలంలో ఆంధ్రప్రదేశ్ చెప్పుకోదగిన అభివృద్ధిని సాధించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడే వరకు ఆంధ్ర, తెలంగాణాల మధ్య సాంస్కృతిక-సాహిత్య మార్గాలలో అంతర్గత సంబంధాలు చాలావరకు తక్కువగా ఉండేవి. అయితే 1956వ సంవత్సరం తర్వాత యీ అంతర్గత సంబంధాలకు అడ్డుగా ఉన్న అవరోధాలు తొలిగి రెండు ప్రాంతాల మధ్య సాంస్కృతిక వాహినులు పరస్పరం కలిసి వెల్లువలయి ప్రవహించాయి. నూతన ఆంధ్ర సాంస్కృతి, సాహిత్య వికాసాలకు హైదరాబాద్ కేంద్రం అయి దీని ప్రభావాన్ని జిల్లాలకు, తిరిగి జిల్లాల నుంచి రాజధానికి వ్యాపింప జేసింది. సాంస్కృతిక, సాహిత్య, లలితకళలకు సంబంధించిన కార్యక్రమాలను, సాహిత్య, సంగీత, నాటక, లలితకళా అకాడమీల ద్వారా సమన్వయించి పటిష్టవంతంగా నిర్వహించబడుతుండగా జిల్లాలలో కూడా ఇటువంటి సంస్థల ద్వారానే సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తూండడం వల్ల ఆంధ్రప్రదేశ్‌లో సాంస్కృతిక సంపద నిరంతరం అభివృద్ధి చెందుతూవుంది.

ఇటీవల ప్రభుత్వం ఏర్పాటు చేసిన సాంస్కృతిక వ్యవహారాల శాఖ రాష్ట్రంలోని ప్రజలలో వెల్లివిరిసే ప్రగాఢ సాంస్కృతిక వాంఛకు ప్రతిరూపంగా ఉంటుంది. వచ్చే సంవత్సరాలలో దీని సమీకరణ సహకారాల శక్తుల ఫలితాలతోనే దీని విజయాన్ని సమీక్షించవచ్చు.

వివిధ విషయాలలో రాష్ట్రం సాధించ కలిగిన విజయాలకు, ప్రత్యేకంగా పెద్ద తరహా నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు ప్రారంభించడం, రాష్ట్ర అవసరాలు, ఆసక్తికి తగినట్టుగా పారిశ్రామిక విధానాలను రూపొందించడం వంటి విషయాలకు కారకులైన ముగ్గురు ముఖ్యమంత్రులకు (రెండు తడవులు శ్రీ యన్. సంజీవరెడ్డి) రాష్ట్రం ఎంతో రుణపడి ఉంది.

రాష్ట్రాభివృద్ధి, ప్రజాభివృద్ధికి సంబంధించిన విషయాలలోనూ ముఖ్యంగా కృష్ణాగోదావరి నదీ జలాల సమస్య, రాష్ట్రంలో కేంద్ర పరంగా ఇతోధిక పరిశ్రమలను నెలకొల్పాలనే ఆందోళన, నాగార్జున సాగర్ బృహత్తర ప్రాజెక్టుకు ఎక్కువ మొత్తంలో కేంద్ర ఆర్థిక సహాయం లభించాలనే విషయంలోను శాసన సభలో బయటా తమ ప్రాతినిధ్యం, భావవ్యక్తీకరణల ద్వారా రాష్ట్రానికి రావలసిన తగిన వాటాకు కృషిచేసిన ప్రభుత్వం చేతలను పటిష్ఠం చేసిన ఇతర రాజకీయ పార్టీలకు కూడా రుణపడిఉంది.

గత ఎనిమిది సంవత్సరాలలోరాష్ట్రంలో జరిగిన అభివృద్ధి దృష్ట్యానూ, ముందు జరగాల్సిన పని దృష్ట్యానూ వచ్చే దశాబ్దం ఆంధ్ర ప్రదేశ్‌కు అతిముఖ్యకాలం. అటువంటి అభివృద్ధికి కావలసిన అనుకూలమైన ప్రాతిపదిక అంశాలుఇక్కడఎన్నోఉన్నాయి. వాటిని వినియోగించుకోవడం కూడా సమర్థవంతంగానే జరుగుతున్నది.

ఆ అంశాలను క్లుప్తంగా ఇక్కడ ఇవ్వడం జరిగింది :

మొదటి అంశం — పోచంపాడు, ఎగువ సీలేరు, కొత్తగూడెం థర్మల్ పథకం, ఎగువ దిగువ తుంగభద్ర కాలువలు, ముఖ్యంగా నాగార్జునసాగర్ వంటి రాష్ట్రంలోని అన్ని లేక చాలవరకు గల విద్యుచ్ఛక్తి నీటి పాదుదల పెద్దతరహా ప్రాజెక్టుల నిర్మాణానికి ఉపక్రమించడం లేక నిర్మాణపు పనులను పూర్తి చేసి వినియోగంలోకి తేవడం.

రెండవది — గత దశాబ్దంలో వ్యవసా

యోత్పత్తులను రెండింతలు అధికం చేయడంతో పాటు వ్యవసాయానికి ఇతోధికంగా లభిస్తున్న వివిధ సాంకేతిక, శాస్త్రీయ సహాయక పరికరాల సరఫరాను క్రమబద్ధం చేయడం, అధికోత్పత్తికి వాటిని వినియోగించడంలో గల ప్రయోజనాన్ని రైతులు స్పష్టంగా హర్షించడం, భూవసతులను ఎక్కువ ఉత్పత్తి జనకంగా వినియోగించడం, గ్రామీణ ప్రాంతాలకు విస్తరణ సర్వీసులకు విస్తరింపచేయడం, వ్యవసాయ పరిశోధనా ఫలితాలను రైతులకు సత్వరంగా అందజేసే మార్గాలను సుకరం చేయడం, కౌలుదారులను రక్షణ కల్గించి, తను సేద్యం చేసే భూమిలో కౌలుదారుకు ఆసక్తి కలిగించడం ద్వారా అమలు చేస్తున్న భూ సంస్కరణలు అధికోత్పత్తికి అవకాశం కలిగించడం.

మూడవది — పారిశ్రామిక రంగంలో అధిక సంఖ్యలో చిన్న తరహా అనుబంధ పరిశ్రమలను నెలకొల్పడానికి అవకాశం కలిగించే రెండుభారీ పబ్లిక్ రంగం పరిశ్రమలు అప్పుడే పని ప్రారంభించడం, ఇతర పరిశ్రమలు పూర్తి కాకుండడం (నాలుగవ ప్రణాళికా కాలంలో మరో నాలుగు పరిశ్రమలు నెలకొల్ప బడవచ్చు.) మరో వైపు చిన్న తరహా పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, మొదలైన వాటి ప్రాతిపదికగా పారిశ్రామిక వ్యవస్థకు ఎక్కువగా విభజించడం.

నాలుగవది — పంచాయతీ రాజ్య సంస్థలు, వాటి పరంచేసిన అధికోత్పత్తి, ఉద్యోగ అవకాశాల సౌకర్యాలను ఎక్కువ చేయడం, బడుగువర్గాల సంక్షేమంవంటి పథకాలద్వారా అవి ఎక్కువ సమర్థతను, పతిష్ఠతను సంపాదిస్తాయి. ఒకవేళ ప్రస్తుతపు ధోరణులు



సింగరేణి కాలరీలలో బొగ్గు ఉత్పత్తిలో గమనార్హమైన పెరుగుదల ఉంది. కేంద్రమంత్రి శ్రీ సుబ్రమణ్యం రాష్ట్ర ముఖ్యమంత్రి కాలరీలను దర్శించినప్పటి దృశ్యం.

భవిష్యత్ అభివృద్ధికి తనగి సూచనలు, అయితే ఇతోధిక స్వయం కృషి, ప్రజాస్వామ్య ప్రాతిపదికలపై గ్రామీణ అభివృద్ధి దశలో నిమగ్నమయ్యే అభివృద్ధి కర గ్రామీణ జనాభాను తయారు చేవచ్చు.

## జనాభా పెరుగుదలను అరికట్టాలి

అభివృద్ధికర సాంఘిక వ్యవస్థను రూపొందించడంతో పాటు దానిని ప్రత్యేకంగా ఆర్థిక పురోభివృద్ధితో అంతర్గత సంబంధం ఏర్పరచినప్పుడు భవిష్యత్ పురోభివృద్ధి అంచనాలను ఎక్కువైనవిగా భావించాల్సిన అవసరం ఉండదు. నిర్బంధ ప్రాథమిక విద్యను, ఇతర విద్యా విషయాలను విస్తరింప జేయడం, వయోజనులలో నిరక్షరాస్యతను నిర్మూలించడం, ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రజలలో పౌరసత్వాన్ని, సాంఘిక బాధ్యతలనుగూర్చి తెల్పే సాంఘిక విద్యను వ్యాపింపజేయడం, జబ్బులు, అనారోగ్యాలను విజయవంతంగా ఎదుర్కొనడం వివిధ బడుగు వర్గాల సంక్షేమానికి ఇతోధికంగాకృషిచేయడంవంటికార్యక్రమాలద్వారా ఆశించిన అభివృద్ధిని సాధించవచ్చు. అదే విధంగా ఇతోధిక రాకపోకల సౌకర్యాలు, జనబాహుళ్యంలో విద్యావాప్తికి పతిష్ఠమైన పద్ధతులు, అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు క్రియాత్మకంగా పాల్గొనడానికి, సహాయ పడడానికి ప్రోత్సహించే పద్ధతులు కూడా రూపొందించ బడాలి.

దేశం, రాష్ట్రం భవిష్యత్ అభివృద్ధి దేశ సహజ సంపదను గరిష్ఠ పరిమితిలో సాధ్యమైనంత ఉత్తమంగా వినియోగించడమేగాక మానవశక్తినికూడా గరిష్ఠ పరిమితిలో సాధ్యమైనంత ఉత్తమంగా వినియోగించుకోవడంపైన్నే దేశరాష్ట్ర భవిష్యత్ అభివృద్ధి ఆధారపడి ఉంది. యీ ఫలితాన్ని సాధించడానికి జనాభా పెరుగుదలను అరికట్టడానికి సాధ్యమైన చర్యలన్నీ తీసుకోవాల్సి ఉంటుంది. జనాభా పెరుగుదల విషయంలో ఆంధ్రప్రదేశ్ (1951–61 మధ్య 1.59 శాతం) అఖిలభారత సగటు పెరుగుదల (అదేకాలంలో 2.15 శాతం) కన్నా నిస్సందేహంగా తక్కువగానే ఉంది.

అయితే నికరంగా చెప్పాలంటే యీ పెరుగుదల సహితం ఎక్కువే.

గత ఎనిమిది సంవత్సరాల కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ఆర్థిక, సాంఘిక, విద్య, ఇతర అభివృద్ధి కార్యక్రమాలకై వేసిన పునాదుల స్వభావాన్ని పరిశీలిస్తే నాలుగు ఐదు ప్రణాళికల కాలాలలో ఆంధ్రప్రదేశ్ ప్రగతి పథంలో మరింత పురోభివృద్ధిని తప్పకుండా సాధించగలదని పరిశీలకులకు తట్టుతుంది. ప్రణాళికా పెట్టుబడులలో నిరంతర పెరుగుదల (రెండవ ప్రణాళికా కాలంలో రు 188.6 కోట్లు; ప్రస్తుత ప్రణాళికా కాలంలో రు 312.88 కోట్లు (అంచనా); నాలుగవ ప్రణాళికా కాలంలో రు 650 కోట్లు (ప్రతిపాదిత) ను పరిశీలిస్తే భౌతిక విధానాలద్వారా ఇంతవరకు చేసిందే గాక ఇకముందు కూడా ఆ దిశలో జరిగే పురోగతి ప్రతిబింబిస్తుంది.

రాష్ట్ర మనుగడలో గత ఎనిమిది సంవత్సరాలు, గతాన్ని అధిగమించి భవిష్యత్తుకు బాట వేసే తీవ్రకృషి జరిగినకాలం. అభివృద్ధి కార్యక్రమాలను కుంటుపర్చే ప్రకృతి సంబంధమైన అవరోధాలు కలుగకుండా ఉండే పక్షంలో రాష్ట్రప్రజల అన్నివర్గాల సమిష్టి సహకారం, దేశభక్తి పూరిత కృషి ద్వారా మన లక్ష్యాన్ని మున్ముందు సాధిస్తామనే దృఢనమ్మకం కలుగుతుంది.

# ప్రభుత్వ నిర్ణయాలు

* రాష్ట్రంలో ఇటీవల సంభవించిన వరదలవల్ల నష్టపడిన వారికి సహాయంగా డబ్బు మంజూరు చేయడానికై ప్రభుత్వం జిల్లా కలెక్టర్లకు విచక్షణాధికారాలు ఇచ్చింది.
* మద్దికెర పాఠశాలలో మధ్యాహ్నభోజనం భుజించిన తరువాత అస్వస్థత జెంది ప్రాణాలు కోల్పోయిన బడిపిల్లల తల్లిదండ్రులకు రూ. 250/ ల చొప్పున డబ్బు మంజూరు చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. మధ్యాహ్న భోజనం భుజించిన పిమ్మట అస్వస్థత జెందిన పిల్లలు త్వరలో కోలుకోడానికై సహాయంగా ఒక్కొక్కరికి రూ. 50/-ల చొప్పున డబ్బు మంజూరు చేయడానికి కూడా ప్రభుత్వం నిశ్చయించింది.
* హైద్రాబాద్‌లోని బాలికల పాలిటెక్నిక్ పేరును 'కమలా నెహ్రూ బాలికల పాలిటెక్నిక్, అని మార్చవలసిందంటూ ఈ పాలిటెక్నిక్ మేనేజిమెంటు చేసిన ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించింది.
* నాన్‌గెజిటెడ్ ఉద్యోగులకూ, ఉపాధ్యాయులకూ సరసమైన ధరలకు ఆహార ధాన్యాలు సరఫరా చేయడానికై ఒక పథకాన్ని ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం నిశ్చయించింది. నెలకు రూ. 150- లు అంతకు తక్కువ జీతం పొందే నాన్‌గెజిటెడ్ ఉద్యోగులకు నెలకు 5 రూ-ల చొప్పునా, రూ.150- లు దాటి రూ. 500- ల వరకు జీతం పొందుతున్న ఉద్యోగులకు రూ.6- ల చొప్పునా సహాయం లభింపజేయడానికి తాత్కాలిక చర్యగా ప్రభుత్వం నిశ్చయించింది. రూ. 100/-లు అంతకు తక్కువ పింఛనుపొందే వారికి నెలకు రూ. 3/-ల చొప్పున ఇస్తారు. 1964 అక్టోబరు మొదటి తేదీ నుంచి ఇది అమలులోనికి వస్తుంది.
* ప్రఖ్యాత వయోలిన్ విద్వాంసుడు శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడును, ఆంధ్ర ప్రదేశ్ ఆస్థాన సంగీత విద్వాన్‌గా నియమించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.
* రాష్ట్ర విజిలెన్స్ కమిషను అధికారాలనూ, దీనికీ అవినీతి నిరోధక సంస్థకూ మధ్యగల సంబంధాన్ని ప్రభుత్వం నిర్వచించింది. రాష్ట్ర అవినీతి నిరోధక సంస్థ, విజిలెన్సు కమిషన్ అధీనంలో పనిచేస్తుంది. రూ. 1000/-లు అంతకు ఎక్కువ జీతం పొందే ఉన్నతాధికార్లకు సంబంధం వున్న అవినీతి వ్యవహారాలను రాష్ట్ర విజిలెన్స్ కమీషనరు స్వయంగా పరిశీలిస్తారు.
* సివిల్ డిఫెన్స్ శిక్షణా సంస్థకొరకు ఒక హాస్టలును ప్రారంభించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.
* ఉద్యోగ నియమకాల విషయంలో ముల్కీ అభ్యర్థులకు మంజూరు చేయబడిన గరిష్ఠవయః పరిమితి రాయతీని తృతీయ ప్రణాళికాంతం వరకు వర్తింపజేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ రాయతీ సాంకేతికేతరమైన ఉద్యోగాలు, నాన్‌గెజిటెడ్ ఉద్యోగాలలో నియామకానికై తెలంగాణా అభ్యర్థులకు వర్తిస్తుంది.

జాతీయ అత్యవసర పరిస్థితి ప్రకటించబడక పూర్వం రిక్రూట్ చేయబడి, యుద్ధరంగంలో పోరాడి సైన్యం నుండి విడుదలై తిరిగివచ్చే సైనికోద్యోగులకు భూములు ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. లోగడ జారీచేయబడిన ఉత్తర్వు ననుసరించి జాతీయ అత్యవసర స్థితిలో రిక్రూట్ చేయబడిన వారికి మాత్రమే ఈ రాయతీ వర్తిస్తుంది.



అనంతపురంజిల్లా

*మేలుజాతి విత్తనాల పంపిణీ :*

రాయదుర్గ పంచాయతీ సమితిలో ఆగష్టునెలలో ఏడువందల అరవైఆరు కిలోగ్రాముల మేలుజాతి విత్తనాలనూ, 29,769 కి.గ్రా. ల ఎరువులనూ పంపిణీ చేశారు.

తూర్పుగోదావరి జిల్లా

*నూలుమిల్లు :*

పంచాయితీరాజ్ శాఖామంత్రి సెప్టెంబరు 7 వ తేదీన రాజమండ్రిలో సహకార నూలుమిల్లుకు శంకుస్థాపన చేశారు.

గుంటూరు జిల్లా

*పశుచికిత్సా కేంద్రాలు :*

రేపల్లెతాలూకా పిడివాడలో ఒకటి, తెనాలి తాలూకా అనంతవరంలో ఒకటి, పల్నాడు తాలూకా తుమ్మరకోడెలో ఒకటి మొత్తం మూడు గ్రామీణ పశు చికిత్సా కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. ఈ గ్రామాలలోని ప్రజలే అద్దె లేకుండా భవన సౌకర్యాల్ని కల్పించారు. మందులు పరికరాల రూపంలో వారే ఉదారంగా సహాయాన్ని కల్పించుకున్నారు.

*మశూచి నిర్మూలన వారోత్సవం :*

మంగళగిరి పంచాయతీ సమితిలోని వడ్డేశ్వరం, కొలనుకొండలలో మశూచి నిర్మూలన వారోత్సవాలు నిర్వహించారు.

హైదరాబాదు జిల్లా

*జిల్లా కేంద్ర గ్రంథాలయం :*

వికారాబాదులో జిల్లా కేంద్రగ్రంథాలయానికి సెప్టెంబరు 18 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

కరీంనగర్ జిల్లా

*వ్యవసాయ కార్యక్రమం :*

ఆగష్టునెలలో భీమ్‌దేవరపల్లి పంచాయతీ సమితిలో వ్యవసాయకార్యక్రమం క్రింద రైతులకు 6,789 మణుగుల ఎరువులను పంపిణీ చేశారు.

*శిక్షణశిబిరం :*

పెద్దపల్లి పంచాయతీ సమితిలో ఆగష్టు 20 వ తేదీనుండి మూడు రోజులపాటు జరిగే గ్రామలక్ష్మి శిక్షణశిబిరం నిర్వహించారు.

*యువక మండలి :*

కరీంనగర్ పంచాయతీ సమితిలోని ఎల్బోతీరం గ్రామంలో యువకమండలి ప్రారంభించబడింది.

*సాంద్ర వ్యవసాయ కార్యక్రమం :*

కరీంనగర్‌లో అక్టోబరు 8 వ తేదీనుండి మూడు రోజులపాటు సాంద్ర వ్యవసాయ కార్యక్రమం నిర్వహించబడింది.

ఖమ్మంజిల్లా

*జిల్లా పోలీసు వార్షిక క్రీడలు :*

ఖమ్మం పోలీసుపెరేడు మైదానంలో అక్టోబరు 10 వ తేదీన ఖమ్మంజిల్లా పోలీసు వార్షిక క్రీడా సమావేశం జరిగింది.

*శిక్షణ శిబిరం :*

సుడిమెల్ల సమితిలోని రామాపురంలో సెప్టెంబరు 27 వ తేదీనుండి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

*సంయుక్త సిబ్బంది మండలి :*

ఖమ్మంజిల్లా కలెక్టరు అక్టోబరు 2 వ తేదీన ఖమ్మంజిల్లా సంయుక్త సిబ్బంది మండలికి ప్రారంభోత్సవం చేశారు.

కృష్ణాజిల్లా

*రాష్ట్ర సమాచార కేంద్రం :*

కార్మిక శాఖామంత్రి విజయవాడలో సెప్టెంబరు 8 వ తేదీన రాష్ట్రసమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

*శిక్షణ శిబిరాలు :*

ఆగష్టు 17 వ తేదీనుండి ఆగష్టు 28 వ తేదినుండీ దబ్బకేరపల్లి, కన్నెవీడు గ్రామాల్లో మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాలు నిర్వహించబడ్డాయి.

మెదక్ జిల్లా

*సహకార విస్తరణాధికారుల సమావేశం ;*

సంగారెడ్డిలో సెప్టెంబరు 16 వ తేదీన మెదక్ జిల్లా సహకార విస్తరణాధికారుల సమావేశం జరిగింది.

*మశూచి నిర్మూలన వారోత్సవం :*

సంగారెడ్డిలో సెప్టెంబరు 28 వ తేదీన మశూచి నిర్మూలన వారోత్సవానికి



రాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

### నల్గొండ జిల్లా

*వ్యవసాయ కార్యక్రమం :*

చింతపల్లి పంచాయతీ సమితిలో సెప్టెంబరు నెలలో 215 మణుగుల మేలు జాతి విత్తనాలు, 396 మణుగుల రసాయనిక ఎరువులు పంపిణీ చేశారు. ఇదే కాలంలో 198 వ్యవసాయ ప్రదర్శనలు నిర్వహించబడ్డాయి. 3 మేలుజాతి వ్యవసాయ పరికరాల్ని కూడా పంపిణీచేశారు.

*శిక్షణ శిబిరాలు :*

చింతపల్లి పంచాయతీ సమితిలోని గోరంపూడి గ్రామంలో గ్రామ సహాయకుల ప్రత్యేక శిక్షణ శిబిరం సెప్టెంబరు నెలలో నిర్వహించబడింది.

నకరేకల్ పంచాయతీ సమితిలోని కేతేపల్లి గ్రామంలో మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. 50 మంది ఈ శిబిరంలో శిక్షణ పొందారు.

### నిజామాబాదు

*ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రం :*

మదునూర్ తాలూకా జుక్కాలలో సెప్టెంబరు 30 వ తేదీన ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిగింది.

### శ్రీకాకుళం జిల్లా

*శిక్షణ శిబిరాలు :*

గోన పంచాయతీ సమితిలోనిమత్స్యలాసంలో మూడు రోజులపాటు జరిగే గ్రామ సహాయకుల శిక్షణ శిబిరానికి అక్టోబరు 1 వ తేదీన ప్రారంభంజరిగింది.

పాలకొండ పంచాయతీ సమితి తాలూకు అమిలిలో మరో మూడు రోజుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది.

### విశాఖపట్టణం జిల్లా

*పంచాయతీ రాజ్ సమ్మేళనం :*

విశాఖపట్టణంలో సెప్టెంబరు 21 వ తేదీన పంచాయతీరాజ్ ప్రాంతీయ సమ్మేళనానికి పంచాయతీరాజ్ శాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

### వరంగల్లు జిల్లా

*యునాని వైద్యశాల ప్రారంభం :*

ఖాజీపేటలో సెప్టెంబరు 27 వ తేదీన ప్రభుత్వ యునాని వైద్యశాల ప్రారంభించబడింది.

---

"అణుబాంబు పూజార్లు"



# "తత్రశ్లోక చతుష్టయమ్"

వేదుల వేంకటేశ్వర శర్మ

కావ్యేషు నాటకం రమ్యం
తత్రాపిచ శకుంతలా
తత్రాపిచ చతుర్థోంకః
తత్రశ్లోక చతుష్టయమ్.

అని అభిజనోక్తి కలదు. కావ్యముల యందు నాటకము, అందును శాకుంతలము– అందును నాల్గవ యంకము, అందును నాలుగు శ్లోకములు అపూర్వ హృదయానంద జనకములని పై యార్యోక్తికి భావము.

ఉపమా కాళిదాసస్య
భారవే రర్థగౌరవమ్
దండినః పదలాలిత్యం
మాఘే సంతి త్రయోగుణాః.

ఉపమాలంకార నిర్వచనము కాళిదాసునిదే యని అతనితో సాటి యింకొరుఁడు లేఁడనియు పై విబుధోక్తి తెల్లము చేయుచుండెను.

సంస్కృత సారస్వతమున కాళిదాసులు పెక్కులు గలరు. కావ్యత్రయమును – నాటకత్రయమును రచించియే కాళిదాసు ప్రాక్ పశ్చిమ దేశములయందు విఖ్యాతిఁ గాంచియుండెనో ఆ కాళిదాసు నుద్దేశించియే యిట నుల్లేఖింపఁబడుచుండెను.

కాళిదాసు కాలమును గూర్చి విమర్శకులనేకులు నేఁటి వఱకును వివరించుకొనుచుండిరి కావున తద్విషయ మిచట అప్రస్తుతమును అనావశ్యకము నగును. సంస్కృత వాఙ్మయమున కావ్యోదయము ఆదికావ్యమగు శ్రీమద్రామాయణముతో ఆరబ్ధమై యుండెనని సర్వజన విదితమై యుండుటచే కాళిదాసునకు ముందు కావ్య సారస్వతముండెనా ! లేదా ! యని ప్రశ్నింప నవసరము లేదు.

సంస్కృత సారస్వతమున వాల్మీకి, వ్యాస, కాళిదాసులు త్రిమూర్తులచందమున నొప్పియుండి రనుట యత్యుక్తి కానేరదు. కాళిదాసు వాల్మీకి మహర్షినుండి మృదు మధుర శబ్దలాలిత్యమును, వ్యాసభగవాను నుండి అర్థగౌరవ, లోకజ్ఞత, ధర్మోపదేష్టృత్వములు గ్రహించి కావ్యనాటకాదులను సంతరించెను ఇతని కవితలలో నుండు గొప్పతనము అర్థపురస్సరముగ శబ్దమును, శబ్దపురస్సరముగ అర్థమును వియ్యమొంది గురువై, లఘువై. గణమై, వృత్తమై, పిమ్మట కావ్యమూర్తితో సాక్షాత్కరించును ఇతఁడు ఆరాధించియున్న అర్థనారీశ్వర మూర్తియే యీ శబ్దార్థముల కలయికయని గ్రహింపనగును. ఇతనికి కవి సార్వభౌమత్వమును ప్రసాదించినది ప్రతిపద విష్యంది రసమాధురి యనక తప్పదు.

ఇతని కావ్యములును, రూపకములును పౌరాణికములయ్యు నయ్యవి నూత్నతేజస్సులతో పఠితల యెదుట నేకాలమందైనను ప్రతిఫలించుచుండును. ఇతని కావ్యముల యందు ఆర్ష ధర్మము లొకవంకను, వైదికాచారము లొక క్రేవను, లౌకిక సంపత్తి వేరొక దెసను త్రిమార్గానుకృతిగ త్రిపుటీకరణము నొంది భాసించుచుండును, నగర జనపద తారతమ్యమును చక్కగ ప్రబోధించుశక్తి ఇతనికే కలదు. అంతఃపురముల నెంత రమణీయకముగ చిత్రించునో, మున్యాశ్రమములను గూడ అంత సౌకుమార్యముగ, నభివర్ణించును. వీనిని గూర్చి ప్రసంగించినపుడు భాస మహాకవిని స్మరింపక తప్పదు. భాసుఁ డితని కంటెఁ బూర్వుఁడు. ఇతఁడు పలుమారులు భాసుని స్తుతించి యుండుటచే భాసకుని గొప్పదనమును వేఱెవచింప నవసరము లేదు. భాసుఁడు స్వతంత్రుఁడు; ఇతివృత్తమును తారుమారు చేయగల శక్తి సంపన్నుఁడు. కాళిదాసు ఇతివృత్తమును విడనాడక ఔచిత్యము నాదరించి అనౌచిత్యముఁ బరిహరించి మాతాసుతలకు అన్యోన్య సాహచర్యమును గల్పించును. భాసుఁడు మాతృదేవి నొక ప్రక్కనుంచి తత్పుత్రిని సర్వాంగ సౌందర్యాతిశాయినిగ చిత్రించును. ఇదియే యీ యిరువురకుఁ గల తారతమ్యము.

ఇక ప్రకృతము నిరూపింతును. ఈ నాలుగు శ్లోకములు "శాకుంతల నాల్గవ యంకము"లోనివి. ఇందొక్క శ్లోకమునందు ఒకొక్క విధమగు చమత్కృతి ప్రదర్శితమై యుండెననుటయే ఈ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశము. 1 వ శ్లోకము పరికింపుడు.

శ్లో॥ "యాస్యత్యద్య శకుంతలేతి హృదయం
సంస్పృష్ట ముత్కంఠయా
కంఠస్తంభిత బాష్పవృత్తి కలుష
శ్చింతాజడం దర్శనమ్

వైక్లబ్యం మమతావదీ దృశమపి
స్నేహాదర ణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథంనుతనయా
విశ్లేష దుఃఖైర్నవైః"

ఇయ్యది పతి గృహంబునకు శకుంతలను బంపించు సమయమున కణ్వమహర్షి వచించిన వాక్యము. కణ్వమహర్షికిని శకుంతలకును జన్యజనక సంబంధములేదు. పోష్య పోషక సంబంధము మాత్రము కలదు. ఇతఁడు జితేంద్రియుఁడు కులపతి. ఐహిక విషయములను బరిత్యజించిన మహనీయుఁడు. ఇట్టి విరాగి నొక గృహమేధిగ కాళిదాసు వర్ణించుటయే యిందలి చమత్కారము. ఇఁక నిందలి భావమును తిలకింపుఁడు.

ఈ దినము శకుంతల పతి గృహంబున కేగునని హృదయము వచింపరాని ఆందోళనమును జెందుచున్నది. కన్నీరు కంఠము నిండ యుండుటచే ఆమెతో మాట్లాడుటకు శబ్దములు వెలువడకుండెను. కనులనిండ అశ్రువారి యెక్కువగ నుండుటచే జూచుటకు కూడ అవకాశము లేకపోయెను. సంసారమును రోసి యోగియై యున్న నాయట్టివారికే వచింపరాని పరివేదన కలుగుచుండెను. గర్భవాసోదయలైన తనయలు పతి గేహంబునకు తొలిమాఱు పోవు సమయమున ఆ తలిదండ్రుల చిత్తప్రవృత్తులేరీతిగ నుండునో ఎవరేని వచింప గలరా!

ఇందు కవికులతిలకుఁడగు కాళిదాసు కణ్వమహర్షి నెట్లు చిత్రించెనో పాఠకులు గ్రహింతురుగాక! "కనినప్రేమకంటె పెంచినప్రేమ యెక్కువ" అను ఆర్యోక్తికియ్యది దృష్టాంత మగుచుండెనుగదా! కియ్యది ఆ నాల్గుశ్లోకములలో మొదటిది. ఇక రెండవశ్లోకమును పరికింపుడు.

శ్లో॥ పాతుంన ప్రథమంయవశ్యతి జలం
యుష్మాస్వపీతేషుయా
నాదత్తే ప్రియమండనాపి భవతాం
స్నేహేనయా పల్లవమ్
ఆద్యేవః కుసుమప్రసూతిసమయే
యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం
సర్వైరనుజ్ఞాయతామ్.

ఇయ్యదికణ్వుఁడు శకుంతలా ప్రస్థాన సమయమున ఆమెచే పోషింపఁబడిన వృక్షములనుద్దేశించి వచించిన వాక్యము.

ఆశ్రమ తరువులకు శకుంతలకు పోష్య పోషకధర్మ ముండెను. దానిని కవిసార్వభౌముఁ డెంత చక్కగ చిత్రించెనో తిలకింపుఁడు.

మీ కుదురులనిండ నీరు పోయక ఏ శకుంతల పిపాసాకులితయైనను నీటిని గ్రోలుటకు ఇష్టపడక ఉండెడిదో! మీ క్రొంజిగురులు కేశాలంకారములైనను ఏ శకుంతలఅలంకరించుకొని యెఱుంగదో! మీ పుష్పోత్పత్తియే శకుంతలకు అనిర్వచనీయమగు ఆనందమును గలిగించుచుండెడిదో! ఆ శకుంతల, ఈనాఁడు ఈ యాశ్రమమును విడిచి పతిగృహంబునకేగుచున్నది. కావున మీ రందఱు ఆమెపోకకు శుభాకాంక్షలు ప్రసాదింతురుగాక యని కణ్వుని ముఖమునుండి అమృతనిష్యందియగు సూక్తులను బ్రసరింపజేసెను.

ఇయ్యది శకుంతలకు వలక్షములయందు గల అభిమానముకాదు. కవికి పాదపంబుల యందుగల యభిమానము ధ్వనిరూపముగ ప్రదర్శితమైయుండె నని తెలియుచుండెను. సర్వజ్ఞుఁడగు కణ్వమునిని కవిసార్వభౌము డెట్లు చిత్రించెనో పాఠకమహాశయులు గ్రహింతురుగాక! చేతనాచేతనములయందు శకుంతల కెట్టియనురాగము కలదో సూచితమగుచుండెను. మఱియు నిందొక్క విశేషము కలదు. రాజకుల ధర్మము ననుసరించి పతిగృహంబున కేగిన రాజకన్యలు సామాన్య గృహస్థుల పుత్రికలయట్లు పండుగులకు, ఉత్సవములు మున్నగువానికి జనకుల యిండ్లకు రారు. శకుంతల దుష్యంతుని వివాహము చేసికొనినది. అందుచే ఆమె మఱల ఈ యాశ్రమమునకు వచ్చునప్పటికి కొన్నిసంవత్సరములగును. అప్పటికి ఆమెచే పెంపఁబడిన వృక్షములుండునో; వన్యమృగాదుల వలనను, వాతాతపముల వలనను ఎట్లు జీర్ణములగునో వచింపలేము. కావున ఈ నాఁడు శకుంతల పతిగృహంబునకు వెళ్ళుచున్నది కావున మీ రందఱుఅనుమతింపవలెనని వచించుటలో కవియొక్క అచంచలమగు, సుమపేశల హృదయమార్దవము వెల్లడి యగుచుండె ననుటలో సందియములేదు. ఇయ్యది ఆ నాల్గింటిలో రెండవదైయుండెను. ఇక మూడవ శ్లోకమును దిలకింపుడు. ఇయ్యది ఆ నాలుగు శ్లోకములకు తలమానికమువంటిది.

కణ్వమహర్షి; శిష్యుఁడగు శార్ఙ్గరవునితో దుష్యంతునకు తన ఆశయమును నివేదింపుమని ఆదేశించిన సమయమున ఇయ్యది ప్రస్తావింపబడెను.

శ్లో॥ అస్మాన్సాధు విచిత్య సంయమధనా
నుచ్చైః కులంచాత్మనః
త్వయ్యస్యాః కథమప్య బాంధవ కృతాం
స్నేహప్రవృత్తించతాత్
సామాన్యప్రతిపత్తిపూర్వక మియం
దారేషు దృశ్యాత్వయా
భాగ్యాయత్త మతః పరం నఖలు
తద్వాచ్యం వధూ బంధుభిః.

తపమే ధనముగా కలుమ్మెఱుంగుము. అనునది సామాన్యార్థము. మేము తపోధనులముగాని, భాగ్యవంతులము గాము.

నీకేమియు కట్నాదు లియ్యలేదనుకొన కుము, అనునది విశేషార్థము. రాజా ! తపస్సు సాధింపలేనిది ఏమియులేదు. ఆలోచించుకొనుము, అనునది ధ్వన్యర్థము. ఉన్నత మగు నీ వంశ మర్యాదను కూడ గుర్తింపుము. అని సామాన్యార్థము. నీవు సార్వభౌముల కులమునందు పుట్టి సార్వభౌమత్వమును వహించి యుంటివి. మునీశ్వరుఁడు చక్రవర్తి నెట్లు సమ్మానింపగలఁడు? అననది విశేషార్థము. నీవు సామాన్య సంసారివి కావు. భూనాయకుఁడవు. మాయందు ఏమైన దురభిమానమును చూపిన నీ భోగ భాగ్యములన్నియు అంతరింప గలవనిధ్వన్యర్థము. నీవు మా ఆశ్రమమునకు వచ్చి స్నేహమును ప్రదర్శించి మా కన్యను గాంధర్వ విధిగ వివాహమాడితివి. ఇది మావార్లకు తెలియదు. గాంధర్వమునకు పారితోషిక మనవసరము, పవిత్రములగు నాయికా నాయకుల సురచిర మనోగత భావామృతం బులే యుండును కాని అన్యములు కావని చమత్కారము. నీవు భూపతివి. మాబిడ్డ యొక్కతయే భార్య నీకు అని వచింప లేము. భార్య లందఱిని ఎట్లు గౌరవింతువో ఈమెను అటులనే ఆదరింపుము, అనునది సామాన్యార్థము.

అందఱి కంటె మిన్నగ నాదరింప వలెననియు, ఈమె లక్ష్మీ సమానురాలనియు, ఈమెవలన నీవు ఇతోధికైశ్వర్యవంతుఁ డవగలవు అనియు విశేషార్థము. పిమ్మట మా కన్యక అదృష్టము, అయ్యదిమాచే వచింపకూడదు, అని యీ శ్లోకమునకు భావమై యుండెను. ఇందు కవిసార్వభౌముఁడు అనితర సాధారణమగు కవితా చమత్కృతి లోకధర్మముతో సమన్వయించి యెంత చక్కగ నిరూపించెనో యనూహ్యమనుట యత్యుక్తి కానేరదు.

ఆఁడు బిడ్డలను అత్తవారింటికి పంపించు సమయమున వారికి కొన్ని యుపదేశములను జేయుట లోకాచారము. దానినే కాళిదాసు కణ్వ మహర్షి ముఖంబున శకుంతల నుద్దేశించి యుపదేశించెను. ఆ శ్లోక మియ్యది. నాల్గవ శ్లోకము.

శ్లో॥ శుశ్రూష స్వగురూ న్కురుప్రియసఖీ
వృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి రోషణతయా
మాస్మప్రతీ పంగయః
భూయిష్ఠంభవ దక్షిణా పరిజనే
భాగ్యేష్వ నుత్సేకి నీ
యాంత్యేవం గృహిణీ పదం యువతయో
వామాః కులస్యాధయః.

గురువులను సేవింపుమును. సవతుల యందు చెలిమి కలిగియుండుము. ఏ కారణముచేనైన భర్త కోపించిన ప్రతికూలముగ నుండకుము. సేవకులయందు అభిమానము చూపుము. ఐశ్వర్యవతి నని గర్వింపకుము, ఇట్లుండువారే గృహిణులని వచింపఁబడుదురు. మిగిలిన వారు ఉభయ వంశములకు కష్టములను గల్గింతు రని పై శ్లోకమునకు భావము,

ఈ యుపదేశమునేఁటివఱకు భారతీయు లందఱిచే నాచారముగ గ్రహింపబడుచుండెను. ఇందు నార్యధర్మము లన్నియు పరిపోషితములై యుండెను. పతి గృహంబున ఆఁడుబిడ్డ లెట్లుండవలెనో నిరూపింప బడి యుండెను. పెద్దలెవరైనను గురువులే యని ప్రబోధించెను. స్త్రీలు సవతు లుండుటను సహింపరు, దుష్యంతుఁడు శకుంతలను గాంధర్వ విధిగ పరిణయ మాడెను. కావున వానికి శకుంతల తప్ప వేరొకరు ఎవరు భార్యలు లేరని చెప్పరాదు – అందులకే సవతులయందు స్నేహమును పాటింపుమని శాసించెను. సామాన్యముగ కార్యము లెక్కువగ నున్నప్పుడు ప్రతి సంసారియు భార్యను సాధించు చుండును. భూమండలము నంతయు నేలు చక్రవర్తికి ఎప్పుడైన ఏ విషయమునందైన కొంచెముగ భార్యల యందు క్రోధము జనింపవచ్చును. అందుచే భర్త కోపించినాడని వానికి ప్రతికూలముగ నుండరాదని వివరించెను. ప్రతికూలముగ నున్న సతీత్వమునకే కాదు సంసారమునకే ముప్పు వచ్చునని సూచించెను. ఐశ్వర్యము గర్వహేతువునకు కాదు. ఆదరణ హేతువునకని హెచ్చరించెను. సేవకులు అందరికంటెను ముఖ్యులు – వారినేఎక్కువగ సన్మానింపవలెను, అటుల చేయక వారి యెడల కోపము గల్గిన తన యునికికే భంగము కల్పింతు రని ప్రబోధించెను. ఇట్లు ఏ యువతులు పతి గృహంబున జాగరూకతతో నుందురో వారే గృహిణీ శబ్దవాచ్యు లగుదు రనియు మిగిలినవారు కష్టములను జెందఁ గలరని శాంతివాక్యములఁ బ్రసంగించెను.

ఇట్లు కాళిదాసుకణ్వమహర్షిచే అనర్ఘములగు నీ నాలుగు శ్లోకములు చెప్పించెను. ఇందు కాళిదాసుయొక్క వైదిక లౌకిక సంపత్తి – రాజకీయత – సనాతనాధునాతన ధర్మ సమన్వయము – మొదలగునవి తఱచినగొలది భాసించి యుండుటచే నాటక సారస్వతమున "తత్రశ్లోక చతుష్టయ" మ్మనునది చిరస్థాయిగ నుండి పోయె ననుట నిర్వివాదము.



# వెలుగు వెన్నెల దీపావళి

గరికపాటి సాంబశివరావు.

నరకుని నిర్యాణ మరసి
మురిసిరి కడగండ్లు బాయ, ముల్లోకంబుల్
విరిసెన్ దివ్వెల వెన్నెల
విరబూసిన తావి వోలె వెలిగె జగంబుల్.

కమలనాథుని భక్తిని కరము మోడ్చి
పలుతెరంగుల భజయించి పరవశించి
మదిని వెలువడు హర్షమ్ము నధిగమించ
నటనమాడెను జగతియు, నాకముయును!

ఎందు గాంచిన గుమగుమల్ యింపుగూర్చ
జిహ్వ మెచ్చగ భక్షించి వహ్వ యంచు!
సుఖము నొందిరి మరుజన్మ ప్రొక్కినట్లు!
జూడ పుడమియే స్వర్గమై శోభ నంది!

చిచ్చుబుడ్లు, మతాబులు చిందులాడ
నింగి నంటగ సువ్వాయి; నెమలి యాడ
చంద్రమండల మేగెను చర్రుబుర్రు
మంచు రాకెటు, స్పుత్నిక్కు; నలర మనము!

వైరుల మనంబు హడలగ మందుగుండ్లు
తారకల మించె ముత్యాలు, తారజువ్వ;
పుడమి పులకించె, వికశించె పువ్వువోలె
డెంద మలరంగ తనయంగ మెచ్చ విష్ణు!

కూతు రక్కుంద్రతోడుత కూర్మితోడ
సూర్య చంద్రుల తేజమ్ము జూడనయ్యో
పర్వ దీపావళీ శోభ; పరులు గనిన
అమరపుర మని భ్రమపడి నబ్బ పడరె!

# లలనావనం



## మహిళాభ్యుదయం-రాష్ట్రప్రభుత్వ కృషి

*కుమారి వి. వి. రమణమ్మ, కుమారి వి. ప్రభావతీదేవి*

మన సమాజంలో అనాది కాలంనుంచి 'స్త్రీ' కి ఒక మహత్తరమైన స్థానమున్నది. మహిళల మహిమ, ఆధిక్యతలను వెలుగులోకి తీసుకొనివచ్చి వారి ప్రతిభా వ్యుత్పత్తులనుకూడా సమాజానికి, తోటి ప్రజానీకానికి ఉపయోగపడే విధంగా వినియోగించుకోడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ మహత్వపూర్ణ ప్రయత్నాలన్నిటికి రాష్ట్రప్రభుత్వము కేంద్ర ప్రభుత్వము అన్ని స్థాయిలలోను చేయూత నిస్తున్నాయి.

ముఖ్యంగా, ఆ యా రాష్ట్రాలలో వుండే మహిళల స్థితిగతులు, అభివృద్ధికి అవకాశాలు, తదితర అంశాలు రాష్ట్రాల ప్రభుత్వాలకే ఎక్కువగా ముందు తెలుస్తుంది. ఆ భావన ననుసరించే, కేంద్ర ప్రభుత్వము మహిళా సంక్షేమ మన్న బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వాలకు తగినంత పంచిపెట్టింది. ఈ పంపిణీని అనుసరించి అన్ని రాష్ట్రాలలో వలెనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంకూడా స్త్రీ సంక్షేమానికి ఎన్నో పథకాలను రూపొందించింది. ఆ పథకాలన్నీ ప్రణాళికలు కలుగచేసిన అవకాశాలతో తులతూగుతూ, రాష్ట్రంలోని మహిళల అవసరాలను గమనిస్తూ, రూపొందించటం జరిగింది.

మహిళా సంక్షేమ శాఖద్వారా జరుగుతున్న ఈ కృషిని తెలుసుకునేముందు దాని పూర్వ చరిత్రనుకూడా కొంత పరిశీలించటం అప్రస్తుతం కాదని భావిస్తాను. మహిళా సంక్షేమానికి ఒక ప్రత్యేక శాఖను ఏర్పరచాలన్న భావం ఈనాటిది కాదు.

1941 నాటి మాట. రెండవ ప్రపంచ యుద్ధపు భీతి ప్రజల్ని భయభ్రాంతులలో ముంచివేస్తున్న స్థితిలో....అత్యవసర సమయాల్లో మహిళలకుకూడా, యుద్ధ కార్యక్రమాలకు పనికివచ్చే శిక్షణ నివ్వాలని ఉన్నత వర్గాలలో యోచించటం జరిగింది. వెనువెంటనే 'ఎయిర్ రెయిడ్ ప్రికాషన్స్' అన్న సంస్థనొకదానిని నెలకొల్పటం, 1944 నాటికల్లా అదే సంస్థ 'ఇండియన్ వుమెన్స్ సివిక్ కార్ప్స్' అన్న రూపాన్ని పొందడం జరిగింది, 1947 లో వుమెన్స్ వెల్ఫేరు-మహిళా సంక్షేమ - శాఖగా మార్చారు.

ప్రస్తుతం మన రాష్ట్రమంతటా అమలులోనున్న 'పంచాయితీరాజ్యం' పరిపాలన విధానంద్వారా, మహిళా సంక్షేమశాఖ కార్య కలాపాలు గ్రామాంతరాలకు సైతం విస్తరింపబడి వున్నాయి. మహిళలో 'స్వయంకృషి' అనే భావాన్ని పెంపొందింపచేసి వారిసేవలు వారికీ, సమాజానికీ పనికివచ్చే విధంగా వాటిని రూపొందించడమే యీ శాఖయొక్క లక్ష్యం. సమాజసేవ, కుటుంబ సంక్షేమం అన్న రెండు అంశాలు ఈ శాఖయొక్క రెండు కన్నులు.

### కుటుంబ సంక్షేమం

కుటుంబమన్నది భారత దేశంలోని

అతి ప్రాచీనమైన వ్యవస్థ. ఈ వ్యవస్థ మీద నే ఛావి కాలపు సమాజపు యోగ్యతాయోగ్యతలన్నీ ఆధారపడి వున్నాయి. అందువల్లనే కుటుంబ సంక్షేమాన్నికూడా 'సాంఘిక సేవ' లో అతి ముఖ్యమైన అంశంగా పరిగణించటం జరిగింది. పైగా మహిళా సంక్షేమమే కుటుంబ సంక్షేమానికి నాంది.

కుటుంబ సంక్షేమ కార్యక్రమాలను సక్రమంగా అమలుజరపటంజరుగుతోంది. ప్రభుత్వ సిబ్బంది తరచుగా వేర్వేరు కుటుంబాలను ప్రత్యేకంగా సందర్శించి వారి మంచీ, చెడ్డలను విచారించి వస్తూ వుంటారు. కుటుంబంలోని సభ్యుల ఆరోగ్యం పరిస్థితిని తెలుసుకొని తగిన సలహాలను ఇవ్వటంకూడా జరుగుతున్నది.

## సేవా కేంద్రాలు

సమాజసేవా కేంద్రాల స్థాపన, వాటి నిర్వహణలు కూడా మహిళా సంక్షేమ శాఖ కార్యకలాపాలలో ముఖ్య స్థానమునే ఆక్రమించి వున్నాయి. పుస్తక విద్యతోపాటు సాంఘికవిద్యకూడా ప్రతి వ్యక్తికీ అవసరమన్న ఆదర్శమే, యీ సేవా కేంద్రాల స్థాపనకు మూల కారణం. పౌరశిక్షణ, సమాజ ప్రవర్తన, ప్రయోజన విద్య మొదలయిన అంశాల బోధనకు యీ కేంద్రాలలో అవకాశా లున్నాయి. అంతే గాకుండా జాతీయోత్సవాలను, పండుగలను ఇక్కడ వైభవంగా జరిపి ప్రజలలో జాతీయభావం పెంపొందించటానికి తగినకృషి జరుగుతున్నది. వక్తృత్వపుపోటీలు, క్రీడాపోటీలు, విహార యాత్రలుకూడా తరచుగా ఏర్పాటు చేస్తున్నారు. ఇళ్ళలో — పొదుపు, తోట పని, బలవర్ధక ఆహారం, వంటలు, ప్రథమ చికిత్స, శిశు సంరక్షణ... మొదలైన గృహ కార్యకలాపాలలో యీ సేవా కేంద్రాలు తర్ఫీదును యిస్తాయి. విరామ సదుపాయాలలో స్త్రీలు ఎలా కాలాన్ని గడపాలోకూడా తెలుపుతుంటారు. ఇవి గాక ఆ యా ప్రాంతాలలోవుండే 3—7 సంవత్సరాల వయస్సు కలిగిన బాలబాలికలకు తరగతులను కూడా ఏర్పాటు చేయటం, విద్యాబోధన చేయటం జరుగుతూ వున్నది. గ్రామాలలో వుండే గర్భిణీ స్త్రీలకు, యీ కేంద్రాలు ప్రసవ సౌకర్యాలను కూడా కలుగ చేస్తున్నాయి. ఇందునిమిత్తం శిక్షణపొందిన నర్సులు, మంత్రసానులు, కేంద్రాలలో వుంటారు.

## వెనుకబడినవారికి అదనపు సౌకర్యాలు

ఏజెన్సీ ప్రాంతాలలో వుండే ఆదివాసి మొదలైన వెనుకబడిన జాతులకు చెందిన స్త్రీలకు రాష్ట్రప్రభుత్వం కొన్ని అదనపు సౌకర్యాలను కల్పిస్తున్నది. వీరికోసం 18 బ్రాంచీలను నెలకొల్పటం జరిగింది. మహిళా కార్యకర్తలు గ్రామాలలో పర్యటించి అక్కడిస్త్రీలతో ముచ్చటించి వారి అభివృద్ధికి తగు సూచనలు చేస్తూ వుంటారు.

ఈ కృషి సద్వినియోగం కావటానికి ఎంతోకాలం పట్టలేదు. 'ఆదివాసి' స్త్రీలు శుభ్రతను నేర్చుకోగలిగారు. తెలుగు, హిందీ మొదలైన భాషలు నేర్చుకుంటూ అల్లిం, కుట్టుపని మొదలయిన వృత్తులనుకూడా అభ్యసిస్తున్నారు. కేంద్రాలలో తరచుగా వివిధ అంశాల పై ఏర్పాటు చేస్తున్న గోష్టులలో పాల్గొన్న స్త్రీలు లాభపడుతూనే వున్నారు.

ఒకప్పుడు మురికి వాడలను విడిచి మరొక చోటికి వెళ్ళనివారంతా, యీనాడు విహారయాత్రలకు వెడుతూ లోక జ్ఞానాన్ని సంపాదించు కుంటున్నారు. గ్రామాలలో ఏర్పాటుచేస్తున్న గ్రామలక్ష్మి శిక్షణశిబిరంలో పాల్గొంటున్నారు. తాము వివిధ దశలలో నేర్చుకొనినదంతా ఆచరణలో పెడుతున్నారు. మరికొన్నిచోట్ల గ్రామాలలోని స్త్రీలు స్వచ్ఛందంగానే ముందుకొచ్చి తోటివారి అభివృద్ధికై సాయపడుతున్నారు.

మరో వైపు, సాంఘిక సంక్షేమశాఖ తన కార్యక్రమాల ద్వారా సుగాలీ, ఎరుకల, యానాది మొదలైన కులాల ప్రజల అభివృద్ధికి దోహదమిస్తున్నది. అదే విధంగా మహిళా సంక్షేమశాఖ 'విముక్తి జాతికి చెందిన స్త్రీల అభివృద్ధిని కాంక్షిస్తూ ఏడు ఉపశాఖలను ప్రారంభించింది. ఈ జాతి స్త్రీలనుకూడా సమాజంలోకలిపి వారిలో ఒక భాగమైన అసాంప్రదాయమైన సంప్రదాయాలను తీర్చిదిద్దటానికి నిర్విఘ్నమైనకృషి జరుగుతున్నది.

## అనాథల సంరక్షణ:

సమాజంలో అనాథలెందరో వున్నారు వీరిలో చాలామంది రెక్కలాడితేనే డొక్కలాడని స్థితిలోకూడా వున్నారు. వీరినిసంరక్షిస్తూ, వీరికి పనికివచ్చే వృత్తులను నేర్పుతూ జీవనోపాధి ఏర్పరచటానికికూడా కృషి జరుగుతున్నది. మన రాష్ట్రంలో వీరి స్థితిగతులకు సంబంధించిన వివరాలను ప్రభుత్వం ఎన్నడో సేకరించింది. మహిళా సంక్షేమశాఖ కార్యకర్తలు ఇంటింటికి వెళ్ళి, అనాథల వివరాలను సేకరించి అర్హమైనవారిని "సర్వీస్ హోమ్స్"అనబడే సేవాగృహాల్లో చేర్పిస్తూ వుంటారు. ఈ సేవాగృహాల కార్యక్రమా లన్నీ గాంధీజీ సూత్రాలు

ప్రజాస్వామ్య నియమావళి ననుసరించి రూపొందించ బడ్డాయి. ఒకమాటలో చెప్పాలంటే పునరావాస కల్పనమే యీ సేవాగృహాల లక్ష్యం.

నిరుద్యోగ సమస్య:

హైస్కూలులో విద్యాభ్యాసం ముగించిన మధ్య తరగతి తక్కువ తరగతి యువతులకు ఉద్యోగాలు అవసరమే. అలాంటి వీరికి చక్కని వృత్తులను నేర్పి ప్రావీణ్యం చేకూర్చేందుకు, రాష్ట్రంలో వృత్తివిద్యా కేంద్రాలు వున్నాయి. టైపు రైటింగు, షార్టుహాండు, అకౌంటెన్సీ, బ్యాంకింగు మొదలైన విషయాలలో ఇక్కడ తర్ఫీదును ఇస్తారు. ఈ పథకంవల్ల యువకులకు ఉద్యోగాలు లభించటమే గాకుండా, దేశంలో సాంకేతిక పనివారి కొఱతకూడా తీరటానికి అవకాశాలు ఏర్పడుతున్నాయి.

సమాజ వికాస కార్యక్రమాలు

బ్లాకు కేంద్రాలలో వుండే సేవికలు, ముఖ్యసేవికలుకూడా మహిళా సంక్షేమ శాఖకు చెందినవారే. సమాజ వికాస కేంద్రాల ద్వారాకూడా ఈనాడు మహిళల ప్రగతికి అనిర్వచనీయమైన కృషి జరుగుతున్నది. గ్రామాలలోని మహిళలకు ఒకప్పుడు ప్రభుత్వమే అన్ని బోధనలు చేస్తుండేస్థితి యీనాడు తొలగిపోయినది. స్త్రీలు సర్వసమగ్రులైనారు. ఈనాడు సమాజవికాస కార్యక్రమాలలో గ్రామీణ స్త్రీలుకూడా అధిక సంఖ్యలో పాల్గొనటమే ఒక చక్కని తార్కాణం.

మహిళా మండలులు

గ్రామాలలోని కార్యక్రమాలు చాలా వరకు మహిళా మండలుల ద్వారానే జరిగిపోతుంటాయి. ఈ మండలులను ఎప్పుడూ ఉన్నత స్థాయిలోనే నడుపుతున్నారు. అందువల్లనే గ్రామీణ స్త్రీలు గృహనిర్వహణ, శిశు సంరక్షణ, నర్సింగు, కుట్టుపని మొదలైన అంశాలలో చక్కని శిక్షణను పొందకలుగుతున్నారు. ఈ కార్యక్రమాల ద్వారా ఆయా రంగంలో ఆసక్తి అభిరుచివున్న మహిళలకు మంచి 'కాలక్షేపం' కావటమే గాకుండా, ఆర్థికంగా వెనుకబడిన వారికి 'చేయూత లభించటానికి అవకాశం కూడా వున్నది. మరోవిధంగా ఆలోచిస్తే యీ మహిళా మండలులు గ్రామాలలో మహిళలలో ఐక్యతను పెంపొందింపటానికి సాయపడుతున్నాయి. అందువల్ల వీరిలో నాయకత్వపు అభిరుచులుకూడా పెరుగుతున్నాయి. మహిళా మండలి సభ్యురాండ్రు పలువురు గ్రామ పంచాయితీల స్థాయీ సంఘాల్లోను, ఇతర నిర్వాహక సంఘాల్లోను వుండటం ఆశ్చర్యం కాదు.

సాంఘిక నైతిక భద్రతల

ఆర్థిక కారణాల వల్ల పతనం చెంది తద్వారా సాంఘిక, నైతిక ప్రమాణాలను కోల్పోవటానికి అవకాశాలుండే స్త్రీల పరిరక్షణకు రాష్ట్రంలో నాలుగు రక్షణ కేంద్రాలున్నాయి. వారికి ఆశ్రయమిచ్చే మరో నాలుగు నివాస గృహాలు కూడా లేకపోలేదు.

మన రాష్ట్రంలో నైతేనేమి, దేశం యావత్తు అయితే నేమి, మహిళా సంక్షేమ కార్యక్రమాలు ప్రణాళికలతోనే ప్రారంభమయ్యాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఎన్నెన్నో కార్యక్రమాలు రూపురేఖలు దిద్దుకున్నాయి. తృతీయ పంచవర్ష ప్రణాళికాకాలంలో వడిదుడుకులు లేకుండా సాగిపోతున్నది. నాలుగో ప్రణాళిక రాష్ట్రానికి, దేశానికి వుత్తమమైన భవిష్యత్తును సూచిస్తున్నది.

ఈ ప్రపంచమంతా ఒక్క రోజులో వెలుగులోకి రాలేదు. ప్రగతికూడా అంతే. ఏ ఒక్క పూటలోనో, ఏ ఒక్క రోజులోనో సాధ్యం కాకపోవచ్చు. వాస్తవం కూడా అంతే. స్వాతంత్ర్యం వచ్చిన మరురోజునుంచి ప్రగతికూడా ఆరంభమయింది. మొన్నటికంటే నిన్న ఎక్కువ బావుంది. నిన్నటి కంటే యీ నాడు ఎక్కువ వెలుగురేఖలున్నాయి. నేటి కంటె రేపటి రోజున ఎక్కువ ఆనందంగా వుంటుందన్న ఆశారేఖలు పొడసూపుతున్నాయి. మహిళా సంక్షేమంకూడా ఈ నియమానికి అతీతం కాదు. సంక్షేమ కార్యక్రమాలు ప్రతిరోజు కొంత నవ్యతను సంతరించుకుంటున్నాయి. తద్వారా సమాజానికి తీర్చిదిద్దగలిగిన 'మహిళాజాతి' ప్రగతికి మార్గదర్శకం అవుతున్నది.

భవిష్యత్తులో మహిళలకు ఇంకా ఇతోధికంగా అవకాశాలున్నాయి. ఈనాడు మన ప్రభుత్వం మనకోసం ఏర్పాటు చేస్తున్న తోటలన్నీ రేపటి రోజున పూలు పూస్తాయి. కాయలు కాస్తాయి. దేశమూ, మనమూ, మూడు పూవులు, ఆరు కాయలుగా అభివృద్ధి చెందుతాం. ఆ రోజు కను చూపు దూరంలో వుంది.

**(రాష్ట్ర ప్రభుత్వ మహిళా సంక్షేమ శాఖనుంచి సేకరించిన వివరాలు ఆధారంగా)**

'ఇంకా ఎంత సేపు ?' →




తల్లి కూతురితో: చాలా బావుందమ్మాయి. మీ ఆయన్ను మొత్తం
మీద పాకశాస్త్రంలో ప్రవీణుడ్నే చేశావే. నిజానికి నీకు
నా పోలికలే వచ్చాయనుకో.




ఇప్పు డిప్పుడు అబ్బాయి మనుషుల్ని గుర్తుపట్ట
గలుగుతున్నా డన్నమాట !




మొట్ట మొదటిసారి మీ అమ్మను నా సెక్రటరిగా కలుసు
కున్నాను....ఇప్పుడు కోశాధికారిణి.

# గాథాకవులు చిత్రించిన కులాంగనలు

కె. గోపాలకృష్ణారావు

ప్రప్రథమాంధ్ర సామ్రాజ్య నిర్మాతలుగ ప్రశస్తి వహించిన శాతవాహన నరేంద్రులు ప్రాకృతమును రాజభాషగ గౌరవించి యుండిరి. ప్రాకృతకవులు రచించిన కోట ముక్తకములలో ముత్యములవంటి ఏడు వందలగాథల నేరి 'గాథా సప్తశతి'గా సంకలన మొనర్చి, కవివత్సలు డను బిరుదముచే ప్రసిద్ధుడైన 'హాలుడు' శాతవాహనులలో చిరస్మరణీయుడు. "గాథ" ప్రాకృత ఛందములలో నొకటి. ఈ ఛందమున ప్రాకృతకవులు ముక్తకముల ననేకముగా రచించి యుండిరి. సప్తశతియన ఏడువందలు మాత్రమే. హాలుడు ఏడువందల ముక్తకములను మాత్రమే సంతరించి యుండును కాని "గాథా సప్తశతి" వివిధ ప్రతులలో నీ సంఖ్యా నియతి యథాక్రమముగ గన్పట్టదు. హాలుడు సంకలన మొనర్చిన గ్రంథమున తరువాతివారు మఱికొన్ని ముక్తకముల జేర్చి యుందురు.

గాథా సప్తశతిలోని ముక్తకము లేకకవి కర్తృకములు కావు. రాయ రసికుడు, దేహలుడు, భోజయుడు, మాధవుడు, మీణసావి, సుందరుడు, యశస్సింహుడు, మేఘచంద్రుడు, చందసామి, చారుదత్తుడు, తిలోయజుడు, పాలితుడు మున్నగు కవులును; ఘాధవి, రేవా, రోహా, అణులచ్చి మున్నగు కవయిత్రులును రచించిన గాథలిం దనేకము గలవు.

గాథాకవు లందఱును ఉదాత్తభావనా సంపన్నులు. సాటిలేని సరసకవితా చతుర్ముఖులు—ఊహాతీతములగు భావములుకాని, కన్నులకందని దృశ్యములుకాని వారి గాథలందు గన్పట్టవు-భావము లతిసహజములు. సుందర కోమలములు — వర్ణనలు మధురములు. స్త్రీ పురుషుల చిత్తవృత్తి చిత్రణములు. ప్రకృతి వర్ణనలు స్వభావోక్తులకు మచ్చుతునకలు. నవరస పూరితములును, శబ్దార్థాలంకృతులును నగు గాథలు కవులకు. ఆలంకారికులకు నొజ్జబంతులు. గాథా సప్తశతియందలి గాథలు బహుళముగ ధ్వని శృంగారప్రధానములు. గాథాసప్తశతి సుందర ద్రాక్షగుళుచ్ఛము—ఒక్కొక్కగాథ ఒకద్రాక్ష. అందలిసారము మధురాతి మధురమైన అమృతము.

గాథాకవులు రచించిన ముక్తకములను బరిశీలించినచో నాటి కులాంగనల జీవనవిధానము, వారి మానసిక ప్రవృత్తి సుస్పష్టముగ గ్రహించుట కవకాశము కలదు. గాథాకవులు నాయికా నాయకుల భిన్న విభిన్నములైన ప్రకృతులను సరసముగ జిత్రించిరి. వారు సృష్టించిన స్త్రీలు ఊహాసుందరులుకాని, పోతబొమ్మలవంటి వారుకాని కారు. పదునారు వసంతముల చవియైనను చూచి యెఱుంగని కన్యకలు, సర్వాంగ సౌందర్య విలసిత లగు ముగ్ధలు, చూపుతూపులచే హృదయ మర్మముల ఛేదింపజాలు ప్రౌఢలు, చింతచచ్చినను పులుపు చావనట్లు, జీర్ణవయస్కలైనను మధురోహ లణగారని సందుముసలులు. గాథాకవుల రసాత్మకసృష్టికి ప్రతిబింబములు. వీరిలో మఱుపు మర్మము లెఱుగని వారు కొందఱు. మఱికొందఱు వాత్స్యాయనునకే వంకలు పెట్టు కామశాస్త్రోపాధ్యాయనులు. ఆదర్శ దాంపత్య జీవితసౌఖ్యము నందోలలాడిన కులాంగనలును కొందఱుండిరి. అట్టివారిలో ప్రాకృతాంధ్రగృహిణీ ధర్మములు మూర్తీభవించి యున్నవి.

భాగ్యవశమున ధనధాన్య భోగభాగ్యములకు నోచుకొనిన కులాంగనలకు, పాంజీలు, ముత్యాలహారములు, నీలరత్న కాంచి, పసిడి చెవిపోగులు మున్నగునవి అలంకారములు. తక్కినవారికి తాళవృంతములు, నేరెడు చివుళ్ళ గుత్తులు, ఇప్పపూ గుత్తులు మొదలగునవి వెలలేని భూషణములు. జాలవలయములు, మంగళసూత్రము, పసుపు కుంకుమ కులాంగనల. కందరికి మాంగల్య సూచకములు.

తొలికోడి కూతతో మేల్కొని అర్ధరాత్రి వఱకును గృహిణీ ధర్మములను నిర్వర్తించిన నాటి, కులాంగన లాదర్శ గృహిణులు. హైందవ సంప్రదాయములందును, కులవంశ మర్యాదలందును సచ్ఛీల సంరక్షణమునందును వారికి శ్రద్ధాసక్తులు మెండు.

అల్లారు ముద్దుగ లాలించి పెంచిన తలిదండ్రులను వివాహానంతరము వీడి శ్వశుర గృహములో ప్రవేశించిన నాటి నుండి సంయుక్త కుటుంబములో ప్రముఖ పాత్ర నిర్వహించి అత్తమామలను గౌరవించి, పిన్నవారి నాదరించి, అతిథి జన సత్కారము లొనర్చి, భర్తృ ప్రేమానురాగములకు పాత్రమై పుట్టినింటికి, మెట్టినింటికి కీర్తి ప్రతిష్ఠల నార్జించిన కులాంగన ఆమె.

సామాన్య కర్షకకులమున జన్మించిన గృహిణికి ఇంటిపనులతో తీరికయేయుండదు- వారు నివసించు పూరిండ్లే వారి పాలిటి అంబర చుంబి సౌధములు- ముఖప్రక్షాళనాదు లొనర్చి, పసుపు నలుగుపిండితో స్నాన మొనర్చుట ప్రాతఃకాల కృత్యములలో నొకటి. నాటి కాపు కోడలికి సహజ సౌందర్యమును శ్వేతచూర్ణములకు, శ్వేతాంజనములకు ధారవోయు పద్ధతి తెలియదు.

వారు నివసించు గృహములు పూరిండ్లగుట గది గోడలు, ఆరవేసిన బట్టలు పొగచూరి నల్లబారుచుండెను. వర్షఋతువునం దీబాధ మఱింత మిక్కుటము. అన్నము కూరలు వండుసరికి మిట్టమధ్యాహ్నమయ్యెడిది. కులదైవమునకు బూజ లొనర్చి యథావిధిగ బలిని సమర్పించి, అన్నము దీసికొని అపరాహ్ణ సమయమునకు పొలముల కేగెడివా రీ కర్షకకులాంగనలు. అల్లంత దూరము నుండి నూలచేల మధ్యనుండి వచ్చుచున్న తన ఇల్లాలిని జూచి కర్షకుని హృదయము ఉప్పొంగెడిది. పట్టెడకు బదులు గిత్త ముక్కుత్రాడు తీయుచున్న భర్తను చూచు సరికి గృహిణికి నవ్వు ఆగెడిది కాదు. తెల్లవారు జామున హలము నెత్తికొని పొలమునకు వచ్చిన కర్షకునకపుడు విశ్రాంతి సమయము. కర్షక దంపతు లిరువురును ఆ విశ్రాంతి సమయమున విందారగించుచుండిరి. భర్త చుట్ట త్రాగుచు కొంతతడవు విశ్రమింప ఈ గృహిణి నాగలి బట్టి ప్రత్తిచేను దున్నుటకు యత్నించెడిది. భర్తకు నాగలి నప్పగించి మెల్లగా నింటికి బయలుదేరు నపుడు నెమలి పింఛము కొప్పులో నమర్చికొని గురివింద పూసల హారము ధరించిన భిల్లాంగన లెదురగుచుండువారు.

గృహకృత్యములందు నిమగ్నమైన నాటి గృహిణికి పగటినిద్ర కవకాశమే చిక్కదు. చిక్కినను జున్నుపాలు త్రాగిన దూడవలె నిదురించు నను విమర్శకు భయపడి నిదురించెడిది కాదు. మంగలిని జూచి వీధులవెంట పరుగులిడు బాలుని పట్టితెచ్చి స్నానము పోయుట, పిండి విసరుట, వడ్లు దంచుట, చెరుగుట, పొగచూరిన బట్టలు దులుపుట, జాల వలయములకు, దుమ్మైనలకు నంటుకొనిన మైలను వెదురు పుల్లతో తీయుట — మున్నగు పనులతో దాదాపు సాయంకాల మయ్యెడిది.

సామాన్య కులాంగనలు అక్షరజ్ఞానము నొందుటతో తుష్టినొందుచుండిరి. అట్టివారు శ్రీకారముతో చక్కగ లేఖలనుకూడ వాయజాలి యుండిరి. కొందఱికి ఆ మాత్రపు భాగ్యము కూడ లేకుండెను. భర్త ప్రవాసమున కేగినచో నవధి గడియలను చేతి వ్రేళ్లతోడను గోడలపైని గీతల వలనను లెక్కించుచుండిరి. లౌకిక వ్యవహారజ్ఞానము మాత్రము వారికి మెండు. గ్రామమునగల ఒకేఒకమంచి నీటిబావికివెడలి వరుసలోనిలబడి తనవంతు వచ్చిన, నీరు తెచ్చునప్పుడును, దేవాలయములకు పూజ యొనర్చుటకు పోవునపుడును ఉత్సవ సందర్భములందును వారు తోడివారల చిత్తవృత్తిని, వారి విభిన్న ప్రకృతులను బరిశీలించి యుందురు. గ్రామమున గల కులటలు, వేశ్యలు, వంశమునకు కళంకము నాపాదించు కన్నెలు, మధుమాసము నందు జీర్ణసురాపాన మొనర్చి క్షణికేంద్రియ సుముఖముల నాశించిన యువతులు[1], వీధి వెంట నడచు బాటసారుల జాడ నీయక గుత్తుగుత్తులుగా బూచిన విరజాజి పూవులు వాకిట గడియ లైనవవి బాధనొందు జారిణులు, భర్తల సమక్షముననే జారవైద్యు నిల్లు సేరు పతితలు[2] మున్నగు వారికి

పాఠకుల సౌకర్యార్థము "గాథాసప్తశతి"కి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారొనర్చిన ఆంధ్రానువాద పద్యము లుదాహృతములు.

1. ఊరినిండ వయసువారు ; ప్రాయము ; ముదు
సలిమగండు ; నవవసంత వేళ ;
ప్రాంతకల్లు గలదు చేతిలో 'చెడిపెగా
వలదు'— కాని చావవలయునేమి ; 2-97

2. 'అమ్మ ! తేలు గుట్టె' నని చేతులను వీచు
చిన్నదానిఁ బట్టి చెలులు జాణ -
లదిగో ! మగని కనులయెదుటనే కొంచుఁబో -
యెదురు జారవైద్యు నిల్లు సేర. (3-37)

మధూక నికుంజములు – కదంబవనములు – మహిషశాలలు, శాలీక్షేత్రములు కమల వనములు – యవలపొలములు – కందిచేనులు ప్రత్తిచేనులు, దట్టముగా పెరిగిన మఱ్ఱిచెట్లు, జీర్ణదేవాలయములు మున్నగునవి సంకేత స్థానములుగ ప్రసిద్ధి నొందిన విషయము, నాటి రసిక జీవనపు జాడలు, నాటి కుల స్త్రీలకు తెలియును.

తత్కారణముననే తన బాలుడు యుక్త వయస్కుడైన తరవాత కులకుమిటారుల వలలో బడకుండునట్లు, శీలసంపదున్మూలన కారణములైన గోదావరీ నికుంజములకు వెడలినచో దారిలో కుక్కల బెడదయు, నదీతీరములందు కోతుల బాధయు మిక్కుటమని ఒకానొక గృహిణి అప్పు డప్పుడు భయపెట్టుచుండెను, కుటుంబములోని వ్యక్తులు సుశిక్షితులై యుండవలయునని గృహిణి కోరిక. కుటుంబ సభ్యులలో నెవ్వరైనను కుమార్గము లనుసరించినచో నామె పడు బాధ యింతింతకాదు. కేవలము బాధ పడుచు మిన్నకుండక వారి చిత్తవృత్తిని సంస్కరించుటకు యత్నించుచుండెను. తన్ననునయించుట కుద్యుక్తుడైన మఱది నొకానొక గృహిణి సన్మార్గమున మరల్చుటకు చేసిన యత్నము ప్రశంసాపాత్రము. మలిన మనస్కుడైన మఱదికి గోడలమీద చిత్రింపబడిన రామలక్ష్మణుల బొమ్మలను జూపి నర్మోక్తులతో మందలించినది[3].

అన్యాంగనాసక్తుడైన మరదికి గ్రామాధికారి పెరటిలో మాత్రము లభించు పాటలీపుష్పము లెట్లు లభించె నని వ్యంగ్యోక్తులతో నొక గృహిణి తన అత్తగారి నడిగినది. కుటుంబ విచ్ఛేదమునకు దారితీయక పదిమందిలో పరువు నిల్పుకొనునట్లుగ వర్తించిన ఈ గృహిణుల చాకచక్యము మెచ్చుకొనదగినది. కులదైవము వంటి మగని కూరిమికి నోచుకొనని తోడికోడలి దుస్థితిని జూచి జాలిపడి భార్యను ప్రేమానురాగముల జూచుట న్యాయమని పరిహాసోక్తులతో మఱదికి ఒకఇల్లాలు ఉపదేశించినది. కామినులచే జిక్కకుండ దినకృత్యముల దీర్చి గృహమున కేతెంచిన భర్తకెదురేగి పాదప్రక్షాళన మొనర్చి గౌరవించు కులాంగనలు నా డెందరో యుండిరి. తమ నిధిని దోచుకుందురను భయమున వారనుక్షణము జాగరూకత వహించుచుండిరి. ప్రాణనాధుని ప్రాణరక్షణము నిమిత్తమై దౌత్యమును నిర్వహించిన పతివ్రతలు నాడుండిరి. శీలరక్షణము నిమిత్తమై యెట్టి విపత్కర పరిస్థితులైనను నెదుర్కొను ధైర్యసాహసములు నాటి కులస్త్రీలకుండెను[4].

నాటి గృహిణులు తమ ఆర్థిక స్థితిగతులకు దగినట్లుగ జీవించుచుండిరి. గొంతెమ్మ కోరికల దీర్చుటకై భర్తలను తికమక పెట్టినభార్యలు నాడు గన్పట్టరు. తొలిచూలాలొకతె గర్భదోహద సందర్భమున చెలులెంత బలవంతముగ నడిగినను భర్త దుస్థితిని దలచిదలచి మంచినీటిని మాత్రమే కోరినది.

నాటి కులాంగనలకు బంధుప్రీతి అధికము. కలిగినంతలో నతిథిసత్కార మొనర్చుట వారిమర్యాద. అత్తమామలను గౌరవించుట తమ పవిత్రధర్మముగా నెంచిన ఇల్లాండ్రు వారు. ఆ పండుముత్తైదువులకును నట్టి కోడండ్రపై మిక్కుటమైన అనురాగము.

తన పుత్రుడు వ్యవహార వశమున గ్రామాంతరమేగినచో విరహాయత్తచిత్తయగు కోడలి నొకయత్త వేయికన్నులతో కాపాడుచుండెను. వలపుతీగలు లేతపీతపిల్లనరాలవలె కుటిలము లని ఆమెకు తెలియును. తనకు పాదాభివందన మొనర్చునపుడు విరహభరమున కుమిలి కృశించిన కోడలి కోమలాంగములను, మణికట్టువఱకు సరసర జారనుంకించుచున్న జాలవలయము జూచి కంటతడిపెట్టి తన పుత్రునకు

---

3. మలినచిత్తుఁడై మరఁదికి నిల్లాలు
చిన్న నవ్వు దోఁపఁ జెప్పుచుండు,
రామువెంట దిరుగు సౌమిత్రి చరితంబు
గోడమీద వ్రాసికొన్నదాని. (1–35)

4. రమ్యమైన రూపు; రమణు లేదూర;
పేదరికము; పెద్దవీథి నిల్లు;
పరువమైన వయసు; పొరుగింట రంకెంత
యైనఁ జెడదు చూడు చాననడత. (1–36)

"సంజీవని"5 వంటి కోడలిని "పుత్రీ" అని గారాబమున బిలిచి లేపి ఎదకు హత్తుకొనిన మాతృమూర్తి ఆ అత్తగారు. అత్తగారి ఆదరాభిమానములకు పాత్రయైన ధర్మపత్నిని, పేదకు దొరికిన పెన్నిధిగా భర్త మన్నించుటలో నాశ్చర్యములేదు.

గృహకృత్యము లందు నిమగ్నులయ్యు దాంపత్య సుఖమును సంపూర్ణముగ ననుభవించినవారు నాటి కులాంగనలు. మగని కూరిమి 'గడించుటకు వారిని బలవంతముగా వశీకరించుకొనుటకు చేరెడు గింజలు పోసి ఎలుకలదాని నాశ్రయించి మందు మాకు లుపయోగించువారు కాని, మంత్ర తంత్రముల ప్రయోగించువారుకాని ఆ కాలమున నున్నట్లు తోచదు. అలుకబూని కోప గృహముల బ్రవేశించుట యన అసలే తెలియని అమాయికలు వారు. భర్త వీపుపై గుఱ్ఱపుస్వారి చేయు ముద్దులు మూటగట్టు శిశువుల జూచి ఆనంద పారవశ్యము నొందు మాతృమూర్తి యొకతె. ప్రథమదంతోత్పాటనము నొందిన శిశువును భర్త కందించి మధురోహాల రేకెత్తించిన సరసాంగన మఱియొకతె. దంపతుల ప్రణయ రహస్యములను విననేర్చి పెద్దల సమక్షములో పరుషదీయజాలు గోరువంకలను రాత్రిపూటనే వేఱొకగదికి తరలింపజేయుట యందనుభవజ్ఞులు కొందఱు.

ద్వ్యంగుళ అంతరమైనను లేక వాత్సల్య శృంగారములకు ప్రాతినిధ్యము వహించిన స్తనద్వయముచే నిగూఢోప గూహనములను ప్రాణనాథున కొసగిన పిండుజవ్వనియొకతె. పెదవిపైని పగిటిగంట్లు, ఊరువులపైని చంద్రవంకలు - ఎదపై దాసాని పూలవలెనున్న నఖక్షతములు, వారి ప్రణయ సామ్రాజ్య విజయ పతాకాలు. మదేభముల గూల్చిన భిల్లనాయకుడు నెమలిపింఛములను మాత్రము తనకు కానుకగా దెచ్చినపుడు విజయగర్వమున మురిసిన పిన్న భార్యను జూచి, భిల్లాంగన సవతుల ఈర్ష్యకు హద్దులెక్కడివి.6

అత్తమామ లింటికి వచ్చిన అతిథులతో "క్షీరసాగర మథన" ప్రదర్శనమునకు వెడలిన నాటి రాత్రి దంపతులకు మధురయామిని నాడా గృహిణి శృంగార రసాధిదేవత. ఉత్సవ వేలందు మాత్రమే ధరించు కుసుంబావన్నె చీరగట్టి, గుమ్మడిగింజల తిలకముతో నొప్పు ముఖ సరోవరమున కలువల వంటి కన్నులకు కజ్జల రేఖల దీర్చి, వసంత లక్ష్మివలె పడకటింటిలో ప్రవేశించిన సతిని పతి ఆనంద రసవార్ధిలో ముంచెత్తుట సహజమే. మున్నే సడలిన పోకముడిని విప్పుటకు వృధా ప్రయత్నము చేయుచున్న ప్రాణనాథుని మందహాసముతో జూచుచున్న పత్నివదనముపై చంద్రుని షోడశ కళ లొక్కమారు తెరపైని బొమ్మలవలె నాట్యము చేసినవి. నాటి రాత్రి దంపతు లెపుడు నిదురించిరో వారికే తెలియదు. తొలికోడి కూతతో వారిరువురును మేల్కొనిరి. చెక్కిళ్లు వికసింప లక్షలాది ఆజ్ఞ లొసగిన ఆమెయే ఈమెనా అని అబ్బుర మొందుచు ప్రాణనాథుడు వెడల, జఘన భాగమును స్పృశించుచు చెల్లాచెదరైన నల్లని కురులను సవరించుకొని శయ్యాగృహము వీడి అతని గృహిణి దినకృత్యములందు లీనమైపోయినది. నాటి కులాంగనల దివ్య దాంపత్య మట్టిది.

---

5. పట్టుఁ కదిగో ! మొదటబుట్టిన పలుదోయిఁ
గోఱికి, కొడుకు కాటువఱిచినాఁడు
'రేఁగుపండు ; గంటిరే,' యని పెండ్లాము
నగుచుఁ దెచ్చిపెట్టె మగనిచేత. (2-100)

6. మత్తగజ కుంభములఁ బుట్టు ముత్తియముల
తొడవులను దాల్చు సవతుల నడమఁ, గురుల
నెమలి యీఁకలు గొన్ని సొన్పికొని, బోయ-
పడుచు పెండ్లాము పొగరుతో నడచుఁ గంటె ? (2-78)

# సంగ్రహ ప్రకటనలు

## భద్రాచలం శ్రీ సీతారామస్వామి దేవాలయం

శ్రీ భద్రాచలం శ్రీ సీతారామస్వామి దేవాలయం జీర్ణావస్థలో ఉండి మరమ్మతులు లేకుండా ఉన్నకారణంగా దేవాలయం పునరుద్ధరణ నిమిత్తం 1960 ఫిబ్రవరిలో శ్రీ కె. చంద్రమౌళి అధ్యక్షతన శ్రీ భద్రాచల సీతారామాలయ ఉద్ధరణ సంఘాన్ని ప్రభుత్వం ఏర్పాటుచేసి దాని అధికారాలను విధులను నిర్దేశించింది.

పునరుద్ధరణకు సంబంధించిన కార్యనిర్వహణా విధానాలను రూపొందించి అమలు చేయడానికి వీలుగా కార్యనిర్వాహక వర్గాన్ని కూడా ఏర్పాటు చేయడం జరిగింది. దీనికి శ్రీ కె. చంద్రమౌళి అధ్యక్షులు గానూ, శ్రీ యస్. డి. జి. వరదాచారి ఉపాధ్యక్షులు గానూ వ్యవహరిస్తున్నారు.

ఆగమ పండితుల సలహాలకు అనుగుణంగా పునరుద్ధరణ పనులను చేపట్టి ఋచ్చితంగా అమలు చేయాలని 1960 మే 24 వ తేదీన కార్యనిర్వాహక వర్గం తీర్మానించింది. తదనుసారంగా 6 గురు ప్రముఖ ఆగమ పండితులను సంప్రదించి, ప్రదాన దేవాలయాన్నే పడగొట్ట అనుమతించవచ్చు ననే వారి అభిప్రాయం ప్రాతిపదికంగా అంతరాలయాన్ని, మహామండపాన్ని పడగొట్టడానికి అధ్యక్షులు అనుమతించారు. 1964 మే 31వ తేదీన ప్రాతఃకాలంలో వాస్తవంగా యీ పనిని ప్రారంభించారు.

ఆలయాన్ని పడగొట్టే పని ప్రారంభమయ్యాక గర్భాలయంలో ఏటువంటి మార్పులు చేయరాదనీ, మార్పులు శాస్త్ర విరుద్ధములైనవనీ ప్రజలుకొందరు అభ్యంతరాలు తెలిపారు. అంతరాలయం యొక్క ఎత్తు, పొడవు వెడల్పులకు యంత్రం, మూలవిరాట్టుతో సంబంధం వుందనీ కనుక ఎట్టిపరిస్థితిలోనూ ప్రస్తుత కొలతలను మార్చరాదని పేర్కొంటూ శాసనసభ్యుడు శ్రీ తెన్నేటి విశ్వనాధంనుంచి విజ్ఞాపనలు అందాయి.

ప్రభుత్వం ఈ విషయంలో నివేదించబడిన అభిప్రాయాలను జాగ్రత్తగా పరిశీలించింది. శ్రీ కంచి కామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీ శంకరాచార్య స్వామి (కాంచీపురం) వారి అభిప్రాయాలనుకూడా తెలుసుకున్నది. స్వామివారు తెలిపిన అభిప్రాయాలను ప్రభుత్వం అంగీకరించి తదనుగుణ్యంగా నిర్ణయం తీసుకున్నది. ఆలయాన్ని పడగొట్టడానికిపూర్వం గర్భాలయం లోను, వెలుపలగల కొలతల ప్రకారమే సంఘం తిరిగి నిర్మాణం సాగించాలని ప్రభుత్వం నిర్ణయించింది.

## వినియోగ ధరల సూచీ సంఖ్యలు కమిటీ ఏర్పాటు

హైద్రాబాదులోని అర్థగణాంక శాఖ కూర్చిన జీవన వ్యయ సూచీ సంఖ్యలు వాస్తవంగా లేవనిన్నీ, వివిధ కేంద్రాలలో యీ సంఖ్యను కూర్చడంలో ఒకేతరహా విధానం అమలులోదనిన్నీ, సూచిలో అవసరమైన మార్పులు చేయడానికి వీలుగా ప్రభుత్వానికి సలహా యిచ్చేందుకు మహారాష్ట్ర, గుజరాతు రాష్ట్రాలలో వలెనే ఒక నిపుణుల కమటీని ఏర్పాటు చేయాలనిన్నీ ప్రభుత్వానికి రాయబారం వెళ్ళింది.

1960 వ సం ప్రాతిపదికగా తీసుకు[illegible] అర్థగణాంకశాఖ విడుదల చేయనున్న కొత్త సూచీసంఖ్యలను దృష్టిలో ఉంచుకు[illegible] ప్రభుత్వం యీ సలహాను పరిశీలించి యి దిగువ సభ్యుల్తో ఒక కమిటీని ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది.

ప్రొఫెసర్. ఎస్. వి. అయ్యంగార్ హైదరాబాదులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనామిక్సు డైరెక్టర్లు అధ్యక్షుడు ప్రొఫెసర్ కె. నాగభూషణం, వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అర్థగణాంకశాఖ ప్రధాన అధిపతి, శ్రీ ఆర్, రామానంద్ రావు, ఏరియా పర్సనల్ మేనేజరు, ఐ. ఎస్ డి. డి. కంపెనీ లి. గుంటూరు, శ్రీ బి. ఎస్ మహాదేవ్ సింగ్, హైదారాబాదులోని మింట్ కాంపౌండులోగల విద్యుచ్ఛక్తిశాఖ కార్మి[illegible]కుల సమాఖ్య అధ్యక్షుడు, సభ్యులు.

ఈ కమిటీ పదవీకాలం 1-10-1964 నుంచి మూడునెలలపాటు ఉంటుంది.

### విధులు

ఈ సంఘం దిగువ విధులను నిర్వహిస్తుంది.

1. యజమానులు, పనివారలు అందజేసిన విజ్ఞాపనలు, సూచనలు దృష్టిలో ఉంచుకుని, రాష్ట్రంలోని వివిధ కేంద్రాలకు తయారుచేసిన వినియోగదారుల ధరల సూచీసంఖ్యల పరంపరలకు సంబంధించిన విషయాలను, అనుసరించిన విధానాలను పరిశీలించడం.

సూచీసంఖ్యల పరంపరలనుమరింతవాస్తవికంగా తయారుచేయడానికి అవసరమైనచో సిఫార్సులు చేయడం. 2. 1960 ప్రాతి

పదికగా తయారైన వినియోగదారుల ధరల సూచీసంఖ్యల క్రొత్త పట్టికలను పాత పట్టికలతో ప్రయోజనకరంగా కలుపడానికీ, దానికి సంబంధించిన ఇతర విషయాలను పరిశీలించడం. 3. సూచీసంఖ్యల తయారీకై కేంద్రాలను సెలక్టుచేయడానికి అనుసరించాల్సిన విధానాలను పరిశీలించడం. 4. వివిధ కేంద్రాల ధరల సూచికసంఖ్యల సరిపోల్చడాన్ని పరిశీలించడం.

## నిజామాబాదులో సెటిల్మెంటు కమీషనరు

1956 వ సం. ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) కమతాల విభజననిరోధం, ఏకీకరణ చట్టంక్రింద 'సెటిల్మెంటు కమీషనర్' అధికారాలన్నిటినీ నిజామాబాదు జిల్లా కలెక్టరుకు సంక్రమింపజేయడం జరిగింది.

## రసాయనిక ఎరువుల కొనుగోలు పథకం కొనసాగింపు

1964–65 ఖరీఫ్ ఋతువులో రసాయనిక ఎరువుల కొనుగోలు నిమిత్తం దిగువ పేర్కొన్న జిల్లాలలో రైతులకు స్వల్పకాలిక ఋణాలు పంపిణీచేయడానికై అదనంగా రు. 35/- లక్షలు ఖర్చుచేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరు చేసింది.

గుంటూరు జిల్లా రూ. 10 లక్షలు, మహబూబునగర్ జిల్లా రూ. 10 లక్షలు, మెదక్ జిల్లా రూ. 2 లక్షలు, వరంగల్ జిల్లా రూ. 3 లక్షలు, నిజామాబాదు జిల్లా రూ. 5 లక్షలు, నల్గొండ జిల్లా 1 లక్ష ఇతర జిల్లాలు రూ. 4 లక్షలు.

## ఆకేరునదికి ఆనకట్ట

వరంగల్ జిల్లా, మహబూబాబాద్ తాలూకా మదనపర్తి గ్రామంలో ఆకేరు నదికి ఆనకట్ట నిర్మించటానికి ప్రభుత్వం ప్రత్యక్ష, పరోక్ష ఖర్చుల క్రింద రూ. 5,37,100 లు మంజూరు చేసినది.

## వరదబాధితులకు సహాయం

1964 సెప్టెంబరు 28 నుండి 30వ తేదీ వరకు కనీవినీ ఎరుగని రీతిగా భారీ వర్షాలు వచ్చిన కారణంగా కృష్ణ, చంద్రవంక, బుడమేరు, తమ్మిలేరు, ఎర్రకాలువ ఇతర నదులకు విపరీతంగా వరదలు వచ్చి అపారమైన ఆస్తి ప్రాణనష్టాలు సంభవించినట్లు కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి, మహబూబునగర్, నల్లగొండజిల్లా కలెక్టర్ల నుంచి వార్తలు అందాయి. యీ ప్రకృతి వైపరీత్యం వల్ల నష్టపోయిన బీదబాధితులకు తక్షణ సహాయం అందజేయడానికి పై కలెక్టర్లకు దిగువ మొత్తాలను ప్రభుత్వం మంజూరు చేసింది.

కృష్ణా జిల్లా రు. 1,00,000/- లు; గుంటూరు రు. 1,00,000; పశ్చిమ గోదావరి రు. 50,000/- లు; నల్లగొండ రు. 50,000/- లు; మహబూబునగర్ రు. 20,000/-.

పై మొత్తాలేగాక వరద బాధితులకు అవసరమైన సహాయం చేయడానికి వీలుగా ప్రభుత్వం అదనంగా దిగువ మొత్తాలను కలెక్టర్ల స్వాధీనం చేసింది; పశ్చిమగోదావరి రు. 1,00,000/- లు; కృష్ణా; రు. 1,00,000-/ లు; గుంటూరు; రు. 1,00,000/- లు; మహబూబునగర్ జిల్లాలోని వనపర్తి యితర ప్రాంతాలలోవి వరద బాధితులకు తక్షణ సహాయం కల్గించడానికి వీలుగా మంజూరు చేసిన రు. 20,000/- లు; గాక మరో రు. 80,000/- లను ప్రభుత్వం, మహబూబునగర్ జిల్లా కలెక్టరుకు మంజూరు చేసింది.

## ఆంధ్రప్రదేశ్ విజిలెన్సు కమీషన్

అవినీతి నిర్మూలనకు తీసుకోవలసిన చర్యలను సూచించడానికై శ్రీ కె. సంతానం అధ్యక్షతన నియమింపబడిన సంఘం చేసిన ముఖ్యసిఫార్సులను పురస్కరించుకొని భారత ప్రభుత్వం, 1964 ఫిబ్రవరిలో కేంద్ర విజిలెన్సు కమీషనరు అధ్యక్షతన కేంద్ర విజిలెన్సు కమీషన్ను నెలకొల్పింది. అవినీతి నిరోధనకు సంబంధించి ఆంధ్రప్రదేశ్‌లోగల ఏర్పాట్లను పరిగణనలోకి తీసుకుంటూ, విజిలెన్స్ కమీషన్ను నెలకొల్పడంలోగల సమంజసత్వాన్ని, సాపేక్షకమైన ప్రయోజనాలను కూడా పరిగణిస్తూ రాష్ట్ర ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ విజిలెన్స్ కమీషన్ పేరిట విజిలెన్స్ కమీషనరుగా పూర్తి సమయం పనిచేసే అధికారి అధ్యక్షతన ఏకసభ్య కమీషన్ను నెలకొల్పడానికి నిశ్చయించింది.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ శ్రీ ఎం. శేషాచలపతి, 1964 మేలో విజిలెన్స్ కమీషన్ కమీషనరుగా నియమించబడినారు.

ఈ కమీషను అధికారాలు, అధికార పరిధి తదితర అంశాలు యీ క్రింద పేర్కొనబడినవి – ఈ కమీషను అధికారాలు, విధుల మేరకు ఇది ఏశాఖకుకూడా లోబడి ఉండదు. ఆంధ్రప్రదేశ్ పబ్లికు సర్వీసు కమీషనుకు ఉన్నటువంటి స్వతంత్రాధికారాలు దీనికికూడా ఉంటాయి.

విజిలెన్సు కమీషనరు మూడు సంవత్సరాల వరకుకానీ లేదా ఆయనకు 65 సంవత్సరాల వయస్సు వచ్చేవరకుకానీ ఏది ముందు జరిగితే అప్పటివరకు అధికారంలో ఉంటారు.

కమీషనుకు అప్పగించబడే బాధ్యతలు, విధుల సక్రమ నిర్వహణకు విజిలెన్సు కమీషనరు బాధ్యత వహిస్తారు. ఇంతేకాక ఆయన పరిపాలనలో నిజాయితీ, నిష్పక్షపాతం పరిపోషించడానికి సంబంధించిన సమస్త విషయాలలోను శాఖలకు సంస్థలకు సలహా లిస్తారు. సాధారణముగా కార్యకలాపాలను సమన్వయపరుస్తారు.

అధికారాలు, అధికార పరిధి: ఈ

కమీషను అధికారాలు, విధులు దిగువ విధంగా ఉంటాయి:-

1. అఖిలభారత సర్వీసులో వున్న ఉద్యోగితో సహా ఎవరైనను ప్రభుత్వోద్యోగి, అవినీతికరముగా ప్రవర్తించినట్లు లేక అక్రమ ప్రయోజనానికై వ్యవహరించినట్లు అనుమానించబడిన లేక ఆరోపించబడిన ఏ వ్యవహారంలోనైనా రాష్ట్ర ఎగ్జికూటివ్ అధికారి విచారణ జరపడానికి కోరే అంశాలను పరిశీలించే అధికారం యీ కమీషనుకు ఉంటుంది.

2 — అ. ప్రభుత్వోద్యోగి తన అధికారాలను, అక్రమ పనులకుగానీ అవినీతి పనులకుగానీ వినియోగించినట్లు లేక అధికారాలను విలుపు చేసినట్టు వచ్చిన ఫిర్యాదు మరియు.

ఆ. అవినీతి, అక్రమ ప్రవర్తన, న్యాయబుద్ధిలోపం, ఇతర అక్రమ చర్యలు, చెడునడతలతో వ్యవహరించినట్టు ప్రభుత్వోద్యోగిపై ఫిర్యాదు వచ్చినవాటిని విచారణ, దర్యాప్తు చేయించడం.

3. శాఖలు, సంస్థలలోని అవినీతి నిరోధక చర్యలను విజిలెన్సు కార్యక్రమాల పై సాధారణ పరిశీలన, పర్యవేక్షణ చేయడానికి వీలుగా విజిలెన్సు కమీషన్, అన్ని శాఖలు, సంస్థలనుంచి రిపోర్టులు, వివరణలు కోరడం.

4. అవసరమని భావించిన ఫిర్యాదులు, కేసులు, సమాచారాన్ని స్వయంగా తన అధీనంలోకి తీసుకుని-అ. రెగ్యులర్ కేసుగా రిజిస్టరు చేసుకుని దర్యాప్తు చేయాలని అవినీతి నిరోధకశాఖను కోరడం లేక ఆ. ఫిర్యాదు, సమాచారం, లేక కేసును విచారణకై అవినీతి నిరోధకశాఖకు లేక సంబంధితశాఖ సంస్థలకు అప్పగించడం.

5. పైన తెల్పిన 4 - ఆ. లో ఉదాహరించిన కేసులోనూ, అవినీతి నిరోధక శాఖ విచారణ జరిపిన కేసులోనూ అంతిమ రిపోర్టును కమీషనుకు పంపాలి. ఇతర సంబంధిత రికార్డులను పరిశీలించి ఆయా శాఖ, సంస్థలు తగిన చర్యలు తీసుకునేందుకు కమీషన్ సలహా ఇస్తుంది.

6. ప్రాసిక్యూషన్ జరపాలని భావించిన సందర్భంలో అవినీతి నిరోధకశాఖ దర్యాప్తు జరిపిన అన్ని కేసుల అంతిమ రిపోర్టును ఆ శాఖ, కమీషన్ ద్వారా సాధారణ పరిపాలనశాఖకు పంపాలి.

7. అ. సంబంధితశాఖ, సంస్థల నుంచి అందిన వ్యాఖ్యను, కేసును కమీషన్ పరిశీలించి ప్రాసిక్యూషన్ మంజూరీ చేయడం అవసరమో కాదో అనేవిషయంలో సాధారణ పరిపాలన శాఖకు సలహా ఇస్తుంది, ఆ తర్వాత ఆ విధమైన అధికారం ఎవరికి దత్తం చేస్తున్నది తెల్పుతూ;

ఆ. గవర్నరు మినహా ప్రాసిక్యూషన్ మంజూరు చేసే అర్హతగల అధికారి, అవినీతి నిరోధకశాఖ కోరిన ప్రాసిక్యూషన్ మంజూరీ ఇవ్వదలిచిన సందర్భంలో ఆ కేసును కమీషన్‌కు పంపుతారు. కమీషన్ సలహాను పరిశీలించి అధికారి తదుపరి చర్య తీసుకుంటారు.

8. కమీషన్‌కు అనుబంధంగా ఉండే ట్రిబ్యునల్‌కు క్రమశిక్షణ ప్రొసీడింగ్సుకై ఏ కేసునైనా ట్రిబ్యునల్‌కు పంపే అధికారం కమీషన్‌కు ఉంది. ఐతే ప్రస్తుతం ఉన్న విధంగా నెలకు రు. 180 లోపుగా జీతం ఉన్న ప్రభుత్వోద్యోగుల కేసులను సంబంధితశాఖలు విచారణ చేస్తాయి. రూ. 1,000లు అంతకు మించి జీతం ఉన్న ప్రభుత్వోద్యోగుల కేసులను కమీషన్ స్వయంగానే పరిశీలిస్తుంది.

9. కమీషన్‌కు నివేదింపబడిన అన్ని కేసులకూ సంబంధించిన క్రమశిక్షణ చర్యల విషయంలో ట్రిబ్యునల్ ఇచ్చే అంతిమ నివేదికను యీ కమీషన్ పరిశీలిస్తుంది. క్రమశిక్షణ చర్యలు తీసుకునే ఆయా అధికారులకు ఆ పై చర్యలు తీసుకొనే నిమిత్తం ఆయా కేసులకు సంబంధించిన రికార్డులను యీ కమీషను పంపిస్తుంది.

10. విచక్షణాధికారాలు సక్రమముగా సరియైన పద్ధతిలో అమలు పరచబడినట్లయితే ఆ ప్రభుత్వ సేవకునిపై తగు చర్య తీసికోవలసిందిగా అతనికి సంబంధించిన శాఖకు, సంస్థకు యీ కమీషను సలహా ఇస్తుంది. అవినీతికి, దుష్ప్రవర్తనకు తావిచ్చే విధానాన్ని గాని లేదా ఆచరణనుగాని తగిన విధముగా మార్చుకోవలసిందిగాను లేదా ఒకానొక ప్రత్యేకమైన విధముగా మార్పు చేయవలసిందిగాను యీ కమీషను సలహా ఇవ్వవచ్చు.

11. పరిపాలనకు సంబంధించిన అన్ని శాఖల్లోనూ పరిపాలనలో సమైక్యతను పరిరక్షించే విషయానికి సంబంధించినంత వరకూ పరిపాలనా విధానాలను, వాటి ఆచరణలతీరును, తగిన వ్యవధినిస్తూ పరిశీలించమని యీ కమీషను తెలియపరచవచ్చు. ఆ విధమైన లెక్కలను, ఇతర సమాచారాన్ని అవసరాన్ని బట్టి యీ కమీషను సేకరించవచ్చు. తమ సిఫారసుల మీద తీసుకునే చర్యపై తగిన సమాచారాన్ని కూడా యీ కమీషను పొందవచ్చు.

తమ కార్యకలాపాలను గురించి, ముఖ్యంగా నిరాకరింపబడిన తమ సిఫారసులను గురించి యీ కమీషను సాధారణ పరిపాలనశాఖ ద్వారా ప్రభుత్వానికి ఒక సాంవత్సరిక నివేదికను సమర్పిస్తుంది. ఆ నివేదికతోపాటు ఆ కమీషను చేసిన ఏ సిఫారసునైనా అంగీకరించక పోవడానికి గల కారణాలను తెలియపరుస్తూ ఒక మెమోరాండాన్ని కూడా సాధారణ పరిపాలనశాఖ ఉభయసభలముందూ ఉంచుతుంది.

## విజిలెన్స్ అధికారులు

ప్రతిసచివాలయంశాఖ ఒక్కొక్క ప్రధాన విజిలెన్స్ అధికారి, వాటికింద పనిచేసే, వాటికి అనుబంధంగా పనిచేసే అన్ని కార్యాలయాలలోనూ, ప్రభుత్వ సంస్థలలోనూ విజిలెన్స్ అధికారులు ఉంటారు. ప్రధాన విజిలెన్స్ అధికారిహోదా ప్రభుత్వ ఉపకార్యదర్శి హోదాకు తక్కువ కాకుండా ఉంటుంది. ఆయాశాఖల్లోని

సీనియరు అధికారులనుండి విజిలెన్స్ అధికారులు ఎన్నిక చేయబడతారు. ఆయా ప్రభుత్వ సంస్థల అధిపతులు కమీషనుతో సంప్రదించినమీదట తమ సంస్థలలోని విజిలెన్స్ అధికారుల హోదాను నిర్ణయిస్తారు. ఆయా శాఖలకు సంబంధించిన ప్రధాన విజిలెన్స్ అధికారులు సంప్రదించిన మీదట అనుబంధ కార్యాలయాలలోని విజిలెన్స్ అధికారులు నియమింపబడతారు. కమీషను వ్యతిరేకించిన ఏవ్యక్తినికూడా ప్రధాన విజిలెన్స్ అధికారిగా నియమించడం జరగదు.

ప్రధాన విజిలెన్స్ అధికారీ, ఇతర విజిలెన్స్ అధికారులూ కమీషనర్‌కూ, ఆయా శాఖలకూ మధ్య సంబంధ బాంధవ్యాలను కలిగించడంతోపాటు ఆయా శాఖల్లోని ప్రభుత్వ కార్యదర్శులకు, లేదా ప్రభుత్వ సంస్థల ప్రధానాధిపతులకూ, ఆయా శాఖల్లోని సంస్థలలోని అవినీతి, దుష్ప్రవర్తనను, అక్రమ చర్యలను నిరోధించడంలో సహాయకారులుగా ఉంటారు.

జిల్లా కలెక్టర్లే తమ పరిధుల్లోని ప్రధాన విజిలెన్సు అధికారులు.

ఏ ఫిర్యాదునైనా సమాచారాన్నయినా లేదా ఏ కేసునైనా విచారణ జరిపించే నిమిత్తం అవినీతి నిరోధక శాఖకుగాని, లేదా జిల్లా స్థాయిలో వారికి సంబంధించిన శాఖ అధికారికిగాని అప్పగించడం. అవినీతి నిరోధక శాఖ లేదా ఆయాశాఖలకు సంబంధించిన అధికారులు జరిపే పరిశోధనలు శీఘ్రతరంగా జరిగేటట్టుచూడడం; అవినీతికి అక్రమచర్యలకు తావిచ్చే విషయాలను తొలగించే ఉద్దేశ్యంతో జిల్లా కార్యాలయాలలో ప్రస్తుతం ఉన్న విధానాలను పరిశీలించేటట్టు చూడడం–కలెక్టర్ల విధి.

ప్రధాన విజిలెన్స్ అధికారుల, విజిలెన్స్ అధికారుల పనులను మదింపువేసే అధికారం విజిలెన్స్ కమీషనరుకు ఉంటుంది. అవినీతికి సంబంధించిన తప్పుడు సమాచారాన్ని వ్యక్తులనూ సమైక్యతలేని ప్రభుత్వ సేవకులనూ గూర్చి విచారణ జరిపే విషయంలో యీ కమీషను పూనుకుంటుంది.

## అల్లాపురం ప్రాజెక్టు

హైదరాబాదు జిల్లాలోని, తాండూరు తాలూకా అల్లాపురం ప్రాజెక్టు నిర్మాణానికి గాను అవృత, అనావృత చార్జీలతో సహా 8,32,000 రూపాయలూ, పనులకుగాను రూ. 7,24,600 లు ఖర్చుల అంచనాలను ప్రభుత్వం అనుమతించింది.

## పెద్దవాగు ప్రాజెక్టు

మెదక్‌జిల్లా, జహీరాబాద్ తాలూకా గద్దరపల్లి గ్రామం సమీపంలో పెద్దవాగు ప్రాజెక్టును నిర్మించడానికి అయ్యే ప్రత్యక్ష పరోక్ష ఖర్చులతోసహా రూ. 6,79,500 లు లేక పనులకు రూ. 5,97,200 ల సవరించబడిన మొత్తాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరు చేసింది.

## జాలర్లకు సహాయం

పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల్లో మరి ఇతర ప్రాంతాలలో 1964 సెప్టెంబరులో వచ్చిన అధికవర్షాలు, వరదల కారణంగా నష్టపడిన జాలర్లకు సహాయక గ్రాంట్లు ఇచ్చే సమస్యను ప్రభుత్వం పరిశీలించి అటువంటి వారికి దిగువ తెల్పిన సహాయక గ్రాంట్లు ఇవ్వాలని ఆదేశించింది:–

వలలు, పడవలను పూర్తిగా కోల్పోయిన జాలర్లకు దిగువ సహాయం చేస్తారు; (1) వలల కొనుగోలుకు ప్రతికుటుంబానికి గరిష్ట పరిమితిలో రూ. 250/–లు (2) పడవల కొనుగోలుకు ప్రతికుటుంబానికి గరిష్ట పరిమితిలో రూ. 1,000/–.

పై మొత్తంలో 50 శాతం గ్రాంటుగానూ మిగతా 50 శాతం రుణం గానూ ఇస్తారు.

పడవలకు నష్టం వాటిల్లిన జాలర్లకు పడవల మరమ్మతుల నిమిత్తం కుటుంబానికి రూ. 100 ల చొప్పున గ్రాంటు పొందే అర్హత ఉంది.

## ఎర్రన్నవాగు చెరువు

మెదకుజిల్లా జహీరాబాదు తాలూకాలో మల్చలమ గ్రామ సమీపంలోని పెద్దన్నవాగు ఉపనది అయిన ఎర్రన్నవాగు ఆధారంగా చెరువు నిర్మించడానికి ప్రత్యక్షపరోక్ష ఖర్చులతో సహా ఖర్చులకు రూ. 4,11,000 లు లేక నిర్మాణం పనులకు రూ. 3,44,200 లు ఖర్చు అంచనాను ప్రభుత్వం మంజూరు చేసింది

## ధాన్యం వర్తకుల లైసెన్సింగ్ ఉత్తర్వుకు సవరణ

1964 జనవరి 25 వ తేదీ ఆంధ్రప్రదేశ్ గెజెటు అసాధారణ సంచిక 2 వ భాగంలో 1 వ పుటనుంచి 14 వ పుటవరకు ప్రచురించబడిన 1964 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ ధాన్యం వర్తకుల లైసెన్సింగ్ ఉత్తర్వుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దిగువ సవరణ చేసింది.

### సవరణ

"ఈఉత్తర్వు 10వ క్లాజులోని, (1) (3) సబ్ క్లాజులలో వున్న "సివిల్ సప్లైస్ శాఖ కమీషనరు, హైదరాబాదు; అనే మాటలకు బదులు "జిల్లా కలెక్టరు" అనే మాటలు చేర్చబడాలి.''

## ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ

ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ జనరల్ కౌన్సిల్‌కు దిగువ తెల్పిన వారిని సభ్యులుగా ప్రభుత్వ నామినేటు చేసింది. వీరి సభ్యత్వకాలం 1964 నవంబరు 1వ తేదీ నుంచి మూడు సంవత్సరాలు ఉంటుంది.

శ్రీ మసూద్‌అహమ్మద్, వైస్ ప్రిన్స్‌పాల్, లలితకళలు, వాస్తుశాస్త్రం కళాశాల, హైద్రాబాద్ (గౌరవకోశాధికారి); శ్రీ బి. పి. ఆర్. విఠల్, ఐ. ఎ. ఎస్.; శ్రీ డి. సూర్యనారాయణస్వామి, ప్రభుత్వ కార్యదర్శి, న్యాయశాఖ; శ్రీ వహీద్‌ఖాన్, డైరెక్టర్, వాస్తుశిల్పశాఖ, హైద్రాబాద్; శ్రీ ఎ ఎస్. రామన్, ఎడిటర్, ఇల్లస్ట్రేటెడ్ వీకిలి ఆఫ్ ఇండియా, బొంబాయి; శ్రీ నరోత్తమరెడ్డి, ఎం. పి. హైద్రాబాద్; శ్రీ సంజీవదేవ్, గుంటూరుజిల్లా; శ్రీ ఎస్. ఎన్. చామకూర్, మద్రాసు; శ్రీ పి. టి. రెడ్డి, హైద్రాబాద్; శ్రీ గణపతి శతపతి, భద్రాచలం; శ్రీ కుమారుల్‌స్వామి, ఢిల్లీ; శ్రీ జగదీష్‌మిత్తల్ హైద్రాబాద్; శ్రీ కె. శేషగిరిరావు, హైద్రాబాద్; శ్రీ వి. మధుసూదన్‌రావు, హైద్రాబాద్; శ్రీ జి. వి. సుబ్బారావు, మద్రాసు; శ్రీ ఉస్మాన్ సిద్దీఖీ, హైద్రాబాద్.

# మేలిముత్యాలు

సీ॥ నలినసంభవు వాహనము వారువంబులు
కులముసాములు మాకు కువలయాక్షి !
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బువ్వుఁబోణి !
సత్యలోకముదాఁక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన !
మధురాక్షరములైన మా మాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి !
తే॥ గీ॥ భారతీదేవి ముంజేతి పలుకుఁ జిలుక
సమదగజయాన ! సబ్రహ్మచారి మాకు ;
వేద శాస్త్ర పురాణాది విద్య లెల్లఁ
దరుణి ! నీయాన ఘంటాపథంబు మాకు.

—శ్రీనాథుఁడు.

సీ॥ చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు ;
రహిపుట్ట జంత్రగాత్రముల ఠాల్ గరఁగించు
విమలగాంధర్వంబు విద్య మాకు ;
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోడఁ బెట్టినది మాకు ;
హయమేధ రాజసూయము లనఁ బేర్పడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకుఁ ;
తే॥ గీ॥ గనకనగసీమఁ గల్పవృక్షముల నీడఁ
బచ్చఱాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ ;
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాము గరిడీలు మాకు గోత్రామరేంద్ర !

— అల్లసాని పెద్దన

శ్లో॥ త్వన్నేత్రాంచతలవ త్రపంచితరసం,
త్వన్మధ్యవన్ముష్టినా
గ్రాహ్యం, త్వత్కుచకుంభవన్నఖముఖ
వ్యాపార లీలాస్పదం !
త్వచ్చేతోవదమందరాగజనకం
త్వద్గాత్రవత్కామదం
స్వాదిష్ఠంచ తవోష్ఠవత్తరుణి ! మే
తాంబూలమానీయతాం॥

—కాళిదాసు—చాటువు

శా॥ నానాగాయన గాయనీమణులు గా
నం బుర్వి నాలింపమో
నానాఁటన్ నగభేది పీటఁ గల గం
ధర్వాప్సరో గీత వి
ద్యా నైపుణ్యము లెన్నియేని వినమో
అందైన నిందైన విం
దై నాదం బొనఁగూడునే మదికి ని
ట్లానంద సంధాయియై.

—రామరాజభూషణుఁడు

శ్లో॥ వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం
యథైవ తథా జడే
నచఖలు తయోః జ్ఞానే శక్తిం
కరో త్యుపహంతివా
భవతిహి పునర్భూయాన్ భేదః
ఫలం ప్రతితద్యథా
ప్రభవతి శుచిర్బింబగ్రాహే
మణిః నమృదాదయః

—భవభూతి

మ॥ అసురేంద్రాశయ కుండికాచ్ఛ రుధిర
వ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహగర్జనమిళ
న్మూర్ఛన్ దదుద్దామదీ
ర్ఘనటార్ఘూటము ప్రేళ్ళగించుగతి నాం
త్రశ్రేణిఁ గిన్కన్ బెరం
చుసితక్రూరభవ న్నఖావళులు ప్రో
చున్ మర్త్య పంచాననా !

—శ్రీకృష్ణదేవరాయలు

శ్లో॥ కుంఠత్వ మాయాతి గుణః కవీనాం
సాహిత్య విద్యాశ్రమ వర్జితేషు
కుర్యాద నార్ద్రేషు కిమం గనానాం
కేశేషు కృష్ణాగురుధూపవాసః
శ్లో॥ వ్యుత్పత్తిరావర్జిత కోవిదాఽపి
నరంజనాయ క్రమతే ఖలానాం !
నమౌక్తిక చ్ఛిద్రకరీ శలాకా
ప్రగల్భతే కర్మణి టంకికాయాః॥

—బిల్హణుఁడు

మ॥ అటఁ గాంచెం గరిణీవిభుండు నవపు
ల్లాంభోజ కల్హారమున్
నటదిందిందిర వారమున్ కమఠ మీ
నగ్రాహ దుర్వారమున్
వట హింతాల తమాల సాల సుమనో
వల్లీ కుటీతీరమున్
జటులోద్ధూత మరాళ చక్ర బక సం
చారంబుఁ గాసారమున్.

—పోతనామాత్యుఁడు

చ॥ అటఁ జని కాంచె భూమిసురుఁ
డంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠద
భంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనాను రూప పరి
ఫుల్ల కలాప కలాపి జాలమున్
గటకచరత్కరేణు కర
కంపిత సాలము శీత శైలమున్.

—అల్లసాని పెద్దన

సీ॥ కరిణీ కరోజ్ఝిత కంకణ చ్ఛటఁదోఁగి
సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు;
హస్తినీ హస్త విన్యస్త పద్మంబుల
వేయుగన్నులవాని వెఱపు సూపు:
గుంజరీపరిచిత కుముదకాండంబుల
ఫణిరాజ మండనప్రభ వహించుఁ ;
గలభీసముత్కీర్ణ కల్హారరజమునఁ
గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చు ;

ఆ॥వె॥ మదకరేణుముక్త మౌక్తికశకలల
మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజమల్లంబు
వనజగేహకేళి వ్రాలునపుడు.

సీ॥ నిటలాలకము లంటి నివురఁ జుంజుమ్మని
ముఖసరోజమునిండ మూసురుఁ దేంట్లు:
నళులఁ జోఁపఁగఁ జిల్క లల్లనల్లనఁ జేరి
యోష్ఠబింబద్యుతు లొడియనుఱుకు ;
శుకములఁ దోలఁ జకుర్మీనములకు మం
దాకినీపాఠీనలోక మెగుచు
మీనపంక్తులు దాఁట మెయిదీఁగెతో రాయ
శంపాలతలు మింట సరణి గట్టు;

ఆ॥వె॥ శంపలను జయింపఁ జక్రవాకంబులు
కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వు చూపు ;
మెలఁత మొగులుపిఱిఁది మెఱుఁగు దీఁగెయుఁబోలె
జలదవర్ణు వెనుక జరుగునపుడు.

—పోతనామాత్యుఁడు

శ్లో॥ యాత్యేకతోఽస్త శిఖరం పతిరోషధీనాం
ఆవిష్కృతోఽరుణ పురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగప ద్వ్యసనోదయాభ్యాం
లోకోనియమ్యత ఇవాత్మ దశాంతరేషు॥

—కాళిదాసు

మ॥ ఎది సౌదామని తాండవంబునకు నెం
తేనిన్ మృదంగారవా
భ్యుదయంబై తగు; శక్రచాపమునకు
ద్ద్యోతించు టంకార మె
య్యది; మత్తేంద్రగజేంద్ర కంఠ లుఠితా
వ్యగ్రోగ్ర గర్జాఘనం
బదె యభ్రంబు వియోగినీ వ్యథకునై
యభ్రస్థలిన్ గ్రుమ్మరున్.

—ఆంధ్రబిల్హణ

శ్లో॥ వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః
నఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రయంతే
వికసతిహి పతంగస్యోదయే పుండరీకం
ద్రవతి చహి మరశ్మావుద్గతే చంద్రకాంతః॥

—భవభూతి

మ॥ తమముం బాసిన రోహిణీవిభుక్రియం
దర్పించి సంసార దుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిం
గ్రాహంబు పట్టూడ్చి పా
దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌం
దర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీకరోజ్ఝిత సుధాం
భస్స్నాన విశ్రాంతుఁడై.

—పోతనామాత్యుఁడు

# ముఖ్యవార్తలు

సెప్టెంబరు 30: నాగార్జునసాగర్ వద్ద కృష్ణానదిపై వున్న రోడ్డు వంతెన ప్రవాహంలో కొట్టుకపోయింది.

అక్టోబరు 2: ముఖ్యమంత్రి, కేంద్ర మంత్రులు రాష్ట్రంలోని వరదప్రాంతాలను విమానంలో పర్యటించి పరిశీలించారు.

అక్టోబరు 6: హైదరాబాదు, చిక్కడ్‌పల్లిలోని తంతితపాలశాఖ సిబ్బందికై 17 లక్షల ఖర్చుతో నిర్మించబడిన కాలనీకి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

అక్టోబరు 12: రాష్ట్ర పబ్లిక్ గ్రంథాలయాలచట్టం, 1964వ సం॥పు నీటి పారుదల (అభివృద్ధిపనులపన్ను) చట్టాలకు గవర్నరు ఆమోదం తెల్పారు.

అక్టోబరు 14: భారత రాష్ట్రపతి మూడు రోజుల పర్యటనపై హైదరాబాదు వచ్చారు.

అక్టోబరు 17: పునర్నిర్మించబడిన రాష్ట్ర ప్రణాళిక సలహా సంఘం మొదటి సమావేశంలో ముఖ్యమంత్రి ప్రసంగించారు.

అక్టోబరు 19: కలెక్టర్ల రెండు రోజుల సమావేశం హైదరాబాదులో ప్రారంభమయింది.

## భారతదేశంలో

సెప్టెంబరు 16: శ్రీ యస్. వి. గుప్త, భారత సొలిసిటర్ జనరల్‌గా నియమించబడ్డారు.

సెప్టెంబరు 22: ప్రఖ్యాత మరాఠీ నాటక కర్త శ్రీ బి. వి. (మామ) మారేర్కర్ మృతి చెందారు.

సెప్టెంబరు 25: కేంద్ర ఆర్థిక మంత్రి, ½ శాతం బ్యాంకురేటు హెచ్చింపును ప్రకటించారు.

సెప్టెంబరు 29: శ్రీ శ్రీమన్నారాయణ్, నేపాల్ రాయబారిగా నియమింపబడ్డారు.

సెప్టెంబరు 30: శాంతి కార్యక్రమానికి యు. యస్. ఆహారపథకం క్రింద రు॥ 190 కోట్లు విలువచేసే ఆహారాన్ని సరఫరాచేసే ఒప్పందంపై భారత యు. యస్. దేశాల ప్రతినిధులు సంతకాలు చేశారు.

అక్టోబరు 1: శ్రీ రామేశ్వర్ సాహు, ఆర్థిక ఉపమంత్రిగానూ, శ్రీ పి.యస్. నాస్కర్ ఆరోగ్యశాఖ ఉపమంత్రిగానూ, పదవీప్రమాణ స్వీకారం చేశారు.

అక్టోబరు 3: కేంద్ర విద్యామంత్రి విద్యాకమీషన్ సమావేశాలకు ప్రారంభోత్సవం చేశారు.

అక్టోబరు 13: 1964-65వ సంవత్సరానికి వరి, గోధుమలు, కాయధాన్యాలకు సంబంధించిన ఉత్పత్తిదారుల ధరలను కేంద్రప్రభుత్వం ప్రకటించింది.

అక్టోబరు 14: నాలుగవ ప్రణాళిక పెట్టుబడి రు॥ 21,500 కోట్ల ధనంకు చెందిన ప్రాథమిక మెమోరాండంను కేంద్ర మంత్రిమండలి ఆమోదించింది.

అక్టోబరు 15: బొంబాయిలో జరిగిన రెండవ క్రికెటు టెస్టులో భారతదేశం, ఆస్ట్రేలియాను ఓడించింది.

## విదేశాలలో

సెప్టెంబరు 21: మాల్టా స్వతంత్రదేశంగా అవతరించింది. రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్, ఐర్లాండ్‌లో నాలుగు రోజుల అధికారపర్యటనపై డబ్లిన్ చేరారు.

అక్టోబరు 2: ప్రధానమంత్రి శ్రీ లాల్ బహదురుశాస్త్రి మూడు రోజుల అధికార పర్యటనపై కైరో చేరారు.

అక్టోబరు 5: అలీనరాజ్యాల రెండవ సమితి సమావేశాన్ని అధ్యక్షులు నాసరు ప్రారంభించారు.

అక్టోబరు 10: టోక్యోలో 18వ ఒలంపిక్ క్రీడోత్సవాలకు జపాన్ చక్రవర్తి ప్రారంభోత్సవం చేశారు.

అక్టోబరు 12: సోవియట్ రష్యా, ముగ్గురు మనుష్యులతో కూడిన అంతరిక్ష నౌకను ప్రయోగించింది.

అక్టోబరు 14: 1964వ సం॥ నోబిల్ శాంతి బహుమానాన్ని అమెరికా నీగ్రో నాయకుడు డాక్టరు మార్టిన్ లూథరు కింగ్‌కు బహూకరించారు.

అక్టోబరు 15: శ్రీ అలెగ్జికోసిగిన్, కృశ్చేవ్ స్థానంలో రష్యా ప్రధానమంత్రిగా నియమింపబడ్డారు.

అక్టోబరు 16: చైనా తన మొదటి అణుబాంబు పాటవ పరీక్షను ప్రయోగించింది.

బ్రిటిష్ సాధారణ ఎన్నికలలో లేబరు పార్టీ విజయం పొందింది. శ్రీ హెరాల్డ్ విల్సన్‌ను ప్రధానమంత్రిగా వ్యవహరించమని రాణి ఆహ్వానించింది.

అక్టోబరు 19: 8 మంది ఉన్నత సైనికోద్యోగులతోసహా 29 మంది ప్రయాణీకులు ఉన్న సోవియట్ విమానం, బెల్‌గ్రేడ్ వద్ద అవాలా పర్వతాలలో కూలిపోయింది.

అక్టోబరు 20: అమెరికా మాజీ అధ్యక్షులు శ్రీ హెర్బర్టుహూవరు న్యూయార్కులో మరణించారు.

అక్టోబరు 20: యునెస్కో 13వ సాధారణ సమావేశం పారిస్‌లో ప్రారంభమయింది.

అక్టోబరు 22: పాకిస్థాన్ మాజీ అధ్యక్షులు శ్రీ ఖాజానాజిముద్దీన్ ఢాకాలో మరణించారు.

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at YUVA PRESS, Public Garden Road, Hyderabad.

